| | | | | |
|---|---|---|---|---|
| 114. | ఏల మఱగున నుండేవిటు రారాదా | కాంభోజి | రూపకం | 297 |
| 115. | అలుకలు చెల్లవు హరిపురుషోత్తమ | శంకరాభరణం | ఆది | 300 |
| 116. | ఘనుడు దానే కాక కలరా నాకు దిక్కు | శంకరాభరణం | ఝంపె | 302 |
| 117. | ఎప్పటి వాడవె కావా యెరుగుదుము | కురంజి | రూపకం | 304 |
| 118. | అతడిదె నీవిదె అన్నిటాను జాణలు | కురంజి | త్రిపుట | 307 |
| 119. | ఎన్ని మహిమలవాడే యీ దేవుడు | శుద్ధవసంతం | రూపకం | 310 |
| 120. | ఎదుటి నిధానము వెటుచూచినసీ | శుద్ధవసంతం | ఆది | 313 |
| 121. | ఏమని చెప్పేద నిట మీసు హాతి | శుద్ధవసంతం | ఆది | 315 |
| 122. | తొల్లి నే మెరుగుదుము తొడిబడ నీ ప్రద్దులు | ఆరభి | త్రిపుట | 317 |
| 123. | నలువంక సతులెల్ల నవ్వేరాతని | పూర్వగౌళ | త్రిపుట | 320 |
| 124. | ఎంత వేడుకో నీకు యీపె మీదను | నీలాంబరి | త్రిపుట | 323 |
| 125. | ఎంత భ్రమల బెట్టేవే ఇతని నీవు | నీలాంబరి | త్రిపుట | 326 |
| 126. | మాతో నేమిచెప్పేవు మాపుదాకాను | సామ | రూపకం | 329 |
| 127. | ఛీ ఛీ ఓ బదుకా సిగ్గులేని బదుకా | బిలహరి | తిశ్రఏక | 332 |
| 128. | కంటి నఖిలాండ (తతి) కర్తనధికుని గంటి | దేశాక్షి | ఝంపె | 334 |
| 129. | అప్పలవారే అందరును | దేశాక్షి | ఆది | 336 |
| 130 | ఏమని వినెనో యిటునీ సరితలు | దేవ గాంధారి | ఆది | 338 |
| 131. | ఏమని దూరే మెందాకా నిను | దేవ గాంధారి | చతురశ్రఏక | 340 |
| 132. | నేరి చెవ్వడు బ్రదికె నేరక యెవ్వడు చెడె | దేవ గాంధారి | ఝంపె | 342 |
| 133. | పోయె బోయె కాలమెల్ల పూటపూటకు | సామంతం | తిశ్రలఘువు | 344 |
| 134. | ఇందరికి నభయంబు లిచ్చుజేయి | సామంతం | తిశ్రఏక | 346 |
| 135. | ఎటువంటి మోహమో యెట్టితమకమొకాని | సామంతం | ఝంపె | 348 |
| 136. | ఇతరము లన్నియు నేమిటికి | సామ తం | ఆది | 351 |
| 137. | ఏమనవచ్చునుగొందరికింపౌబులుసులుతీపులు | సామంతం | ఆది | 353 |
| 138. | రమణుని కడ కిటు రావమ్మా | సామంతం | ఆది | 355 |
| 139. | ఇటు గరుడుని నీ వెక్కినను | నాట | ఆది | 357 |
| 140. | అప్పటికప్పుడే కాక అసలించేలే | నాట | రూపకం | 359 |
| 141. | ఎరిగీ నెరగదు యేమి సేతుమతి | వరాళి | ఆది | 362 |
| 142. | తరుణి నీతో వీడు తానే మనీనే | వరాళి | త్రిపుట | 364 |

| | | | | |
|---|---|---|---|---|
| 143. | నీకు వలచిన సతికి నెగులు గలదా మీద | వరాళి | త్రిపుట | 367 |
| 144. | ఇందుకు నేనేమి సేతు ఇది నీకే తెలుసు | వరాళి | రూపకం | 369 |
| 145. | నీ వెఱగవా ఇది నెరజాణవు | వరాళి | రూపకం | 371 |
| 146. | చాలెద నిదియే సత్యము సుండో | రామక్రియ | ఆది | 374 |
| 147. | వెలయునిన్నియును వృథా వృథా | రామక్రియ | ఆది | 376 |
| 148. | అక్కటా లోకోన్నతుడు హరిజేరి | రామక్రియ | రూపకం | 378 |
| 149. | అందరు నెఱిగినవే అన్నిపనులు | బౌళి రామక్రియ | చాపు | 381 |
| 150. | అన్నిటా ఘనుడు దాను అందుకేటిదే | బౌళి రామక్రియ | రూపకం | 384 |
| 151. | మరలి మరలి జయ మంగళము | రామక్రియ | ఆది | 387 |

**అవతారిక :**

ఇందు శ్రీమన్నారాయణుని ప్రస్తుతించుచు అయ్యవారు, ఆ దేవుని గుణ గణములను చెప్పుకొనుచు 'నారదాది మునుల గాన మాధురులకు చొక్కెడి ఓ దేవా! నీవు కలియుగము నందలి జనులకు కల్పతరువు వలె శేషాచలము నందు నెలకొని యున్నావు. వేదములను ఉద్ధరించినావు. యాదవ కులమునందు పుట్టినావు. నీవు నాద ప్రియుడవు. నీకు నా నమస్సులు'. అని కొనియాడుచున్నారు.

**రాగ లక్షణము :**

**తోడి.** ఇప్పుడు యిది బిలాస్‌ఖానీ **తోడి** యని వ్యవహరింపబడుచున్నది. నిజమునకు **తోడి** రాగమును దేశీయ రాగములలోనిదిగా కర్నాటక సంగీతజ్ఞులు పేర్కొనియున్నారు. కాని **తోడి** తన దేశీయతను కోల్పోయి కర్నాటక గమక వరికాదులను పూర్తిగా సంతరించుకొని ఇప్పుడు మనము పాడుచున్న రూపమును దాల్చినదేమోయని తోచుచున్నది. ఏలననగా **తోడి** స్వరము లే కలిగి ఇప్పటికినీ తన ప్రత్యేకతను నిలుపుకొనుచు ఉత్తర దేశీయుల సంగీత పద్ధతియందు విన వచ్చుచున్న యీ బిలాస్‌ఖానీ **తోడి**యే కర్నాటక సంగీతము నందలి **తోడి** రాగమునకు పూర్వ రూపమైనచో కావచ్చును. ఇప్పటికినీ కొందరు ప్రాచీన విద్వాంసులు **తోడి** రాగమున గాంధార, ధైవత, నిషాదములను నియత స్థానములందు పట్టుచు పాడుచుండుట కలదు. అట్లు పాడినచో అది బిలాస్ ఖానీ **తోడి**కి చాల దగ్గరగనే యున్నట్లు వినబడుచుండును. ఈ రచన యందలి సాహిత్యమును గమనించి దీనిని యీ రాగమునందే స్వరపరచుట జరిగినది. ఇది జన ప్రియమయి, ప్రచారమునకు వచ్చినది గనుక అట్లే యుంచుట జరిగినది.

ఆరోహణ : స రి గ ప ద ని సా

అవరోహణ : స ని ద మ గ రి గ స

**బిలాస్ ఖనీ తోడి — ఆది**

ప. నారాయణతే నమో నమో
నారద సన్నుత నమో నమో ॥

చ. మురహార భవహార ముకుంద మాధవ
గరుడ గమన పంకజ నాభా
పరమ పురుష భవ బంధ విమోచన
నరమృగ శరీర నమో నమో ॥ ॥ నారాయణతే ॥

జలధి శయన రవి చంద్ర విలోచన
జలరుహా భవనుత చరణయుగా
బలి బంధన గోప వధూవల్లభ
నలినోదరతే నమో నమో ॥ ॥ నారాయణతే ॥

ఆదిదేవ సకలాగమ పూజిత
యాదవ కుల మోహనరూపా
వేదోద్ధర శ్రీవేంకటనాయక
నాద ప్రియతే నమో నమో ॥ ॥ నారాయణతే ॥

ప. స రి గా | రి స రి ని || న సా రి | మా - - ||
నా - రా | య ణ తే - || న మో న | మో - - ||

గ ప ద ని | ద మ గ రి || గ రీ ని | సా - - ||
నా - ర ద | స - న్ను త || న మో న | మో - - || ॥ నారాయణతే ॥

చ. ప ప ద ని | ద మ గ రి || గ రీ ని | స రి మ మ ||
ము ర హా ర | న ర హా ర || ము కుం ద | మా - ధ వ ||

గ ప ద స | స స సా || రి గ రి ని | సా - - ||
గ రు డ గ | మ న పం || క జ నా - | భా - - ||

౩.

ప ద స రి̇ | గ̇ గ̇ గ̇ గ̇ || రీ̇ ని ని | స̇ రి̇ మ మ ||
ప ర మ పు | రు ష భ వ || బం ధ వి | మో - చ న ||

గ̇ గ̇ రి̇ రి̇ | ని దా మ || గ గా రి | సా - - ||
న ర మృ గ | శ రీ ర || న మో న | మో - - || ॥ నారాయణతే ॥

**అవతారిక :**

"నీవు నాకు చేసుకొన్న మగడవు, నన్నేలినది గొప్పా? మనసిచ్చి లాలించి మన్నించేది కావలెను గాని నాకు ఆశలు గొలిపి రాకుండ నుందువా? ఇచ్చిన మాటలు నిలబెట్టుకొని నన్నా నందింపజేయుట పౌరుషముగాని, నీవు నన్ను చేరి కూడినను, నా కైవసమై యుండుట నాకు కావలెను. నీ చనవు లిచ్చిన అంతే చాలును." అని నాయిక తన నాధుడగు శ్రీ వేంకటేశ్వరునితో విన్నవించు కొనుచున్నది.

**రాగ లక్షణము :**

తోడి ప్రాచీన రక్తి రాగములలో నొకటి. కొందరు లక్షణకారులు దీనిని దేశీయ రాగమని చెప్పియున్నారు. కాని ఇది కొన్ని వందల యేండ్లనుండి కర్నాటక సంప్రదాయములలో ఇమిడిపోయి తన దేశీయ లక్షణములను పూర్తిగా వదలుకొని నట్లున్నది. మహా సముద్రమువంటి గంభీర సంచార సందర్భములుగల ఈ రాగమునందు తాళ్ళపాక వారినుండి నేటివరకు ఎందరో వాగ్గేయకారులు రచనలు చేసియున్నారు. ఇందలి గమక వరికాదులు, స్వరలిపి విధానములకు అతీతములై ఆహిరి, సైంధవి, హుస్సేని, నీలాంబరి వంటి రాగములవలె గురుముఖత అభ్యసింప వలసి యున్నవి. ఇందు ముఖ్యముగా క్షేత్రజ్ఞులవారి పదములయందుగల రాగభావములు ప్రాచీనములై తాళ్ళపాకవారి రచనలయందలి ఛాయలు ఇంకను కానవచ్చునని తోచుచున్నది. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 72 మేళకర్తలలో ఎనిమిదవదిగా గుర్తింపబడుచున్నది. సంపూర్ణ సంపూర్ణము. దీనిని హనుమత్తోడి యని వ్యవహరించుటయు కలదు.

**తోడి — త్రిపుట**

ప. మెచ్చితిమి నిన్నును మేలు వాడవౌదువు
నిచ్చలు మా కన్నిటాను నీవే గురిగాక ||

చ. చేసుకొన్న మగడవు చేకొనక మానేవా
వాసితోడ రక్షించేదే వైపు గాక
ఆస గొలిపినవాడ వట్టే రాక మానేవా
బాస దప్పకుండేదే పంతముగాక || || మెచ్చి ||

ప్రియమైనవిభుడవు బెరయక మా నేవా
క్రియతో మన్నించుటే కీరితిగాక
నియతమైనవాడవు నెట్టుకొనక మా నేవా
జయముగా నేలుటే సంగతి గాక || ॥ మెచ్చి ॥

శ్రీవేంకటేశుడవు చేరి కూడక మా నేవా
కైవసమై వుండినదే ఘనత గాక
యీవల నన్నేలితివి ఇచ్చగించక మా నేవా
యేవల్లా జన విచ్చుటే యెక్కుడుగాక || ॥ మెచ్చి ॥

శృం : 19-54

ప. - - ప | ద ప ప మ గా || గ రి రీ స | రి స నీ సా ||
- - మె | చ్చి - - - తి || మి - - - | ని - - న్ను ||

- - ద ని | సా సా - రి || గా - | మ గ మా పా ||
- - మే - | లు వా - - || డ - | వౌ - - దు ||

ద ప ప మ గ మ | ప ద ని ద మ || ద పా దా - | నీ సా ||
వు - - - ని - | చ్చ - - లు - || మా - క - | న్నిటా ||

సా గ మ | ప ద ని ద మ || ప మ గ రి స రి | గా మా ||
ను నీ - | వే - - - గు రి || గా - - - - - - | కా - ||

ద ప ప మ ప | ద ప ప మ గా || గ రి రీ స | రి స నీ సా ||
- - - - మె | చ్చి - - - తి || మి - - - | ని - - - న్ను ||

చ. - - మ | మా ద ప ప మ || గా - | గ రి రీ సా - ని ||
- - చే | సు కో - - - || న్న - | మ - గ డ - - ||

సా ధ ని | స స సా || స రి గా | మా మా ||
వు చే - | కొ న క || మా - - | నే వా ||

- - గ మ | నీ ని ద || ద ని సా రి స ని ద | పా ద ప మా ప మ గ రి ||
- - వా - | సి తో - || ఉ - ర - - - - - | డిం - - - - - చే - ||

సా స రి | గ మ ప ద ని ద || మ పా | పా - - ||
దే వై - | పు - - - - - || గా - | క - - ||

- - స | సా రి స ని ద || పా మ పా - | ప గ మా ద ప ||
- - అ | స గో - లి - || పి - న - | వా - - డ - ||

దా ద ని | సా స రి గా || రి సా | స ని పా ద ని ||
వు అ - | ట్టే రా - - || క - | మా - - నే - ||

సా ద ని | సా స రి గా || రి సా | స ని పా ద ని ||
వా శా - | స త - - || ప్ర క | యుం - దే ||

సా గ మ | ప ద ని స సా రి స ని ద || పా ద ప మా ప మ గ రి | స రి గ మా ||
దే వం - | త - - - ము - - - - - || గా - - - - - - - - | కా - - - ||

ద ప ప మ ప | ద ప ప మ గా || గ రి రి స | రి స నీ సా ||
- - - - మె | చ్చి - - - తి || మి - - - | ని - - న్న ||

**అవతారిక :**

ఇందు నాయిక ఖండిత. తన కోపమును వ్యంగ్యముగా వ్యక్తము చేయక స్పష్టమగు మాటలలో "నీకు ఆపెయందు మమతలున్నచో నీ వద్దనే యుంచుకొనుము. మాకేల చెప్పెదవు? ఆపె నీకు కంచము పొత్తు సొంతమైనచో అగుగాక. నాకేల? నీ కిష్టమైనచో ఆపె పుట్టములే కట్టుకొనుము. గోడ గడిగినచో కుప్ప పడినట్లున్నది నీచేతలు. దప్పికలిగినచో నీరు త్రాగుదురు గాని నేయి త్రాగుదురా?" అని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుడు తనయందు ఇష్టము కలిగి రాగా వచ్చియు ఇంకొకతెను మెచ్చుటలు సహించక దెప్పి పొడుచుచున్నది.

తోడి—రూపకం

మరిగిన నీకేకాక మాకేలరా
తెరమఱగింతే నీవు తీసివేయనేలరా || పల్లవి ||

ఆడకురా నాముందర ఆకెగుణగుణాలు సారె
గోడ గడుగ నసలే కుప్పవడీని
వోడక నీ కితవైతే వుట్టి గట్టు కుందు గాని
సూడు బంటుతో బలాలు చూపి చెప్పనేలరా || మరి ||

ఎంచకురా ఆకెపొందు యెక్కుడుగా నాయెదుట
యొంచబోతే మంచము కిందింతా నుయ్యే
కంచముపొత్తు గలిగితే కలవెల్లా నీతవుగా—
నించుకా జలిలేకున్నా నెండగాయనేలరా || మరి ||

కప్పకురా ఆకె చీర గట్టుకొంటి వదె నీవు
వుప్పాలికి యినుమడౌ నొద్దికైతేను
యిప్పుడె శ్రీవేంకటేశ యిటునన్ను గూడితివి
దప్పికి నీరే కాక తగనీ నెయ్యేలరా || మరి ||

ప. - ప ప ద ప మా || ద ప ప మ గ గ రీ సా ||
- మ రి గి న నీ || తే - - - కా - - క ||

సా - ని ధ ని ధ ని || సా - - - - ||
మా - - కే - - ల || రా - - - - ||

- గ మా ద మ - ద ని || సా రి స నీ సా ||
- తె ర మ అ గిం - || తే నీ - - వు ||

- ప ద సీ ద ని స ని ద మ || గ మ ద మ గ రి సా స రి ||
- తీ - సి వే - - - యు - || నే - - - ల - రా - - ||

గ మ ప ప ద ప మా || ద ప ప మ గ గ రీ సా ||
- - మ ర గి న నీ || కే - - - కా - - క ||

చ. - ద ద ద ప ద నీ || ద ని స ని ద మ గ మ ||
- ఆ ధ కు రా - - || నా - - - ము - ద ర ||

- స రి గ మ పా ద ప ప మ || గా గ రి రీ సా ||
- ఆ - కె గు ణ - - ము - || లు సా - - రె ||

- స రి గ మ ప ద ప || మ మ గ మా మా ||
- గో - ద గ డు గ - || న స - లే - ||

- మ ప ద ని స ని ద మా || పా - - - - ||
- కు ప్పు - వ - డి - - || ని - - - - ||

- గ మ ద మ ద || ని ద నీ సా ||
- వో ద క నీ - || కి త వై తే ||

- స̇ రి̇ గ̇ రి̇ ని స̇ రి̇ స̇ ద ని || స̇ ని ద ప ద ని సా స̇ ||

- వు - ట్టి - గ - - - ట్టు - || కుం - - - దు - గా ని ||

- స̇ రి̇ గా̇ మ̇ || గా̇ ప̇ మ̇ గ̇ గ̇ రి̇ స̇ ||

- సూ డు బం టు || తో బ - లా - - లు ||

- ద ని సా స రి̇ స̇ ని ద ప || ద ప ప మ గ గ రి స స రి ||

- చూ - - పి - చె - - ప్ప || నే - - - - - - ల ర - - ||

గ మ ప ప ద ప మా || ద ప ప మ గ గ రీ సా ||

- - మ ర గి న నీ || కే - - - కా - - క ||

**అవతారిక :**

ఇందు నాయిక ముగ్ధ. ఆమెను గురించి 'నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునకు నెలత మనసులో నిండు వలపున్నది. కన్నులలో తరి తీపులున్నవి. పెదవులపై చిరునవ్వులున్నవి. ఆమె మాటలయందు ఆసలెన్నో యున్నవి. ఆమె నీసొత్తై యున్నది. ఈమెను గురించి నీకేమి చెప్పుదుము? మా అలమేలుమంగను అనుగ్రహించి ఏలుకొనవయ్యా!' అని చెలులు స్వామికి నివేదించుచున్నారు.

**రాగ లక్షణము :**

సామవరాళి ప్రాచీన రాగము. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 1వ మేళకర్తయగు గానమూర్తి జన్యము. స రి మ ప ద ని స । స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. మేళకర్తల ఆవిర్భావమునకు పూర్వమే ఎంతో ప్రచారమునందున్నయీ రాగము తన పేరునందే ఇముడ్చుకొన్న వరాళి స్వరూపమును 'ప మ గా' అనునప్పుడు 'స రి గా' అనునప్పుడు చూపించుకొను చున్నది. ఇంత అందమైన రాగమునందు ఇతర వాగ్గేయకారుల రచనలు దొరకకుండుట చిత్రముగనే యున్నది.

**సామవరాళి—రూపకం**

ఏమని విన్నవించేము యిట్టె కనుగొనవయ్యా
మోమున జేతులలోన మొక్కులున్నవి ॥ పల్లవి ॥

నెలత మనసులోన నిండువలపులున్నవి
నెలవి నవ్వులలోన సిగ్గు లున్నవి
తలిరుమోవి మీద తరి తీపులున్నవి
కలువ కన్నులలోన కాంతులున్నవి ॥ ఏమని ॥

అంగన మాటలలోన నడియాస లున్నవి
రంగగు చన్నులపై కరగు లున్నవి
అంగపు సేవలలో ప్రియములెల్లా నున్నవి
సింగారంపు గొప్పుమీద సేసలున్నవి ॥ ఏమని ॥

కప్పి యలమేలుమంగ కాగిట నీ మేనున్నది
చిప్పిల జెక్కులమీద చిహ్నాలున్నవి
యిప్పుడె శ్రీ వేంకటేశ యిద్దరును గూడితిరి
నెప్పున నీకె వేల నీ వుంగర మున్నది || ఏమని ||

రేం : 25-93

ప. పా ద ప మ మ || ప మ గా గ రి రీ సా ||
ఏ మ ని వి న్న || విం - - చే - - ము ||

స రి రి స స ని స ర || మ మ పా ద ప ప మ ||
ఇ - ట్టే - - - క ను || గొ న వ య్యా - - - ||

ప ద స స నీ || ద ప ద ప ప మ పా ||
మో - ము న చే || తు ల లో - - - నా ||

ప ద ప మ మ మ గ గ || గ రి రీ సా - రి మా ||
మొ - - కు్క లు - - న్న || వి - - - - - - ||  || ఏమని ||

చ. రి మ ప ప ద ద || ద ప పా ప మ గా రి స ||
నె ల త మ న సు || లో - - న - నిం డు - ||

స ని ధ ఫ ధ సా రి || మా - - - - ||
వ - ల - పు లు న్న || వి - - - - ||

స రి మా పా || ద ప ప మ పా - ద సా ||
సె ల వి న || వ్వు - ల - లో - - న ||

స ని ప ద ద ప ప మ ప ద || పా - - - - ||
సి - - గ్గు లు - - - న్న - || వి - - - - ||

ప ద స స రి మ మ || మ గ గా రి స ||
త లి రు మో - - వి || మీ - ద త రి ||

స ని ప ద ద ప ప మ ప ద || సా - - - - ||
తీ - - పు లు - - - న్న - || వి - - - - ||

స రి గా గ రి రీ || స ని ద ప దా ||
క లు వా క - - || న్న ల లో - నా ||

ద ప మ మ ప మ గ గ || గ రి రీ స రి స రి మా ||
కాం - - డు లు - - న్న || వి - - - - - - - ||

|| ఏమని ||

**అవతారిక :**

ఇందలి నాయిక విరహోత్కంఠిత. శ్రీవేంకటేశ్వరునకు, తన విరహమును చెప్పుమని చెలికత్తెను వేడుకొనుచున్నది. చెక్కిట చేయిచేర్చి నాధుని మక్కువలు తలచి తలచి నిట్టూర్చుచు సాత్విక భావములతో నిద్దుర లేక తానెట్లు పతిరాకకై వేచియున్నదో చెప్పుకొను చున్నది.

**రాగ లక్షణము :**

భూపాళ రాగము ప్రాచీనరక్తి రాగములలో నొకటి. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 8వ మేళమగు హనుమత్తోడి జన్యము. స రి గ ప ద స | స ద ప గ రి స అనునవి ఆరోహణావరోహణములు. దీనిని కొందరు మాయామాళవగౌళ జన్యముగా పాడుచుండుటయు కలదు. కాని రేవగుప్తి, బౌళి మున్నగు రాగములు 15వ మేళ జన్యములుగా వాడుకయందుండుటవలన అట్లే పాడినచో భూపాళకు ప్రత్యేకించబడిన రాగస్వరూపము ఏర్పడదు. దీనిని లక్షణకారులందరూ 8వ మేళజన్యమనియే చెప్పియున్నారు. ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచనలు అచ్చటచ్చట కానవచ్చుచున్నవి. సంప్రదాయము నెరిగిన విద్వాంసులు తోడి జన్యముగానే పాడుచున్నారు.

**భూపాళం — త్రిపుట**

ఏమని విన్నవించేనే యిక దనతో నేను
నేమాన వచ్చెగా నన్ను జిత్తగింపు మనవే || పల్లవి ||

మక్కువ దనపై నా మతి తలపోతలకు
చెక్కుపై నిడుకొన్న నాచెయ్యే సాక్షి
అక్కరతో విరహపు టసు రుసురులకును
ముక్కున బెట్టిన నా ముత్తెమే సాక్షి || ఏమని||

తన్ను బాసి నిద్రలేక తగవేగించి నందుకు
కన్నుల నుండిన యట్టి కాటుకే సాక్షి
వున్నతపు గోరికల నుమ్మగిలినందుకు
పన్నీటి చెమటల పయ్యదే సాక్షి || ఏమని ||

నిబ్బరపు బరపుపై నే బొరలాడినందుకు
గుబ్బల గంధపు బేంట్లగురు (తు) లే సాక్షి
పబ్బ యలమేల్మంగపతి శ్రీ వేంకటేశుడు
అబ్బురాన నన్నుగూడే యానందమే సాక్షి || ఏమని ||

శృం : 24-277

ప. - - స రి | గా పా ద ప || గ ప ద ప | గా గ రి రీ ||
- - ఏ - | మ ని - - || వి న్న - - | విం చే - - ||

సా ధ ధ | స స రి గా || గ రి రి గ | గ రి రీ సా ||
నే ఇ క | త - - న || తో - - - | నే - - ను ||

సా స రి | గా పా || గ పా - ద | సా దా ||
- సే - | మా న || వ చ్చె - - | గా న ||

పా గ | పా ద ప గ ప దా || ద ప పా - గ | గ రి రీ సా ||
న్న చి | త్త - - - - గిం || పు - - - - | మ - న వే ||

సా స రి | గా పా ద ప ||
- ఏ - | మ ని - - ||

చ. - - గ | గా గ రి రీ || స రి గా - ప | గా గ రి రీ ||
- - మ | కు్క వ - - || త న - - - | పై నా - - ||

సా ధ ధ | సా స రి గా || పా ద ప గా | గ రి రీ సా ||
- మ ది | త - - ల || పో - - - | త - ల కు ||

సా గ | పా - ద సా || రి స రి గా - | గ రి రీ సా ||
- చె | కు్క - - పై || ని - - డు - | కొ - - న్న ||

దా గ | పా - ద సా || పా ద ప గా | గ రి రీ సా ||
నా చె | య్యే - - - || సా - - - | - - - డి ||

- - ప | పా ద ప గ పా - ద || సా - | రి గ గ రి రీ ||
- - అ | క్కు - - - ర - - || తో - | వి ర హా - - ||

సా స రి | గా - ప గా - రి || రి రి గా - ప | గా - రి రి స ||
పు ట సు | రు - - సు - - || రు - ల - - | కు - - ను - ||

సా ప ద | స రి గా గ రి రీ || సా - | సా రి స ద ప దా ||
- ము - | క్కు - - న - - || జె - | ట్టి - - - - న ||

దా గ | పా - ద సా || పా ద ప గా | గ రి రీ సా ||
నా ము | త్తై - - మే || సా - - - | - - - డి ||

**అవతారిక :**

శ్రీ వైష్ణవులు ధనుర్మాసమునందు వేకువజామున నే మేల్కొని, నిత్యవిధులను ముగించుకొని, భగవన్నామమును కీర్తనలుగా పాడుకొని, నగర సంకీర్తనమును చేయుట, తదుపరి ఆలయమునకు వేంచేసి స్వామి సన్నిధిని పూజా విధులు నిర్వర్తించుకొని, ప్రసాదములు స్వీకరించి నిష్ఠతో ధనుర్మాసములు గడుపుచుండుట వాడుక. ఇట్టి వాడుకను పాటించి, స్వామి సేవలను చేసుకొని తరించుడని హరిభక్తులను అయ్యవారు హెచ్చరించుచున్నారు.

భూపాళం—చాపు

ముదమలర కాలముల మీరిటు మోసపోక
హృదయ మలర భజింపరో మీ
రిటు ధనుర్మాసముల విధులన్ || పల్లవి ||

వేగ నాలుగు ఘడియ లనగా
వేద వేద్యులు లేచి సరగున
నాగమోక్త విధులను తమ దేహాను గుణములుగా
వేగమున సంధ్యాదులొగి గా
వించి విమలాంభోధి శయనుని
బాగుగా బూజించరో యెడ
పక ధనుర్మాసముల విధులనె ఘనులు || ముద మలర ||

పరగు చీనాంబరములను నతి
పరిమళమ్ముల బుష్పముల కడు
వెరవుగా వేంకటపతి (కినై) వేద్య సంగతుల
అరుదుగా దూపముల బహు దీ
పాదులను తాంబూల విధులను
పరగ బూజింపుడు సమస్త
ప్రభు ధనుర్మాసమున విధులన్ ఘనులు || ముద మలర ||

అ : 11-45

ప. స రి గ | గ ప పా || ప ప ద | ప ద ద ద || ప గ ప | ప ద దా ||
ము ద మ | ల ర కా || ల ము ల | మీ - రి టు || మో - స | పో - క ||

స సరి | గ గ రి రి || సా స | స ద దా ||
హృ ద య | మ ల ర ఖ || జిం ప | రో - మీ ||

ప ప ద | ద ప ప గ || గ గ రి | గ రి సా ||
రి టు ధ | ను - రాత్మ - || స ము ల | వి ధు లన్ || || ముదమలర ||

చ. పా ద | ద ప ప గ || గ ప ప | ప ద దా ||
వే గ | నా - లు గు || ఘ డి య | ల న గా ||

పా ద | ద ప ప గ || గా రి | రి స స స ||
వే ద | వే - ద్యు లు || లే చి | స ర గు న ||

స ధ ధ | ధ స స స || సా రి | గా గా ||
ఆ - గ | మో - క్త వి || ధు ల ను | త మ దే ||

రి స రి | రి గ గ గ || గా గ | పా ప ప ||
హా - ను | గు ణ ము లు || గా - | వే గ ము ||

ప ద ప | ప గ గ రి || గా గ | పా - - ||
న సం - | ధ్యా - దు లో || గి - | గా - - ||

ద ప ప | ద ప ప ద || ద స స | స స స రి ||
విం - చి | వి మ లాం - || భో - ధి | శ య ను ని ||

సా రి | రి గ గ రి || గ రి గ | రి స స స ||
భా గు | గా - పూ - || జిం - చ | రో - యె డ ||

18

స̇ ద ద | ద ప ప గ || గ గ రి | రి రి గ రి ||
ప క్ష ధ | ను - ర్మా - || స ము ల | వి ధు ల నె ||

రి సా | - - - - ||
ఘ నుల్ | - - - - ||  || ముదములర ||

**అవతారిక :**

'అజ్ఞానము వంటి తిమిరము అలము కొనియున్నది. భోగిశయనమున యోగనిద్ర బోవుచున్నట్లున్న ఓ స్వామీ! కన్నులు తెరచి సూర్యచంద్రాదులను వెలయింప జేయుము. నీ శుభదృష్టి సోకినచో అజ్ఞాన తిమిరములు తొలగి, జ్ఞానభాస్కరుని తేజస్సులు భక్తుల హృదయముల యందు విరియగలవు,' అని అయ్యవారు స్వామిని మేల్కొలుపుచున్నారు.

**భూపాళం—ఆది**

భోగి శయనమున బుసకొట్టెడిని
యోగనిద్ర పాయును మేల్కొనవే || పల్లవి ||

కన్నులు దెఱవక కమల బాంధవుడు
వెన్నెల రేడును వెలయరిదే
అన్నువ మలసే నరుణోదయ మిదే
మిన్నక నీ విటు మేలుకొనవే || భోగి ||

తెల్లని కన్నులు దెరవక విరియగ
నొల్లక జలజము లున్న విపే
కల్ల నిదుర నిను గవియగ నియ్యక
మెల్లనాయ నిటు మేలుకొనవే || భోగి ||

తెరవగు రెప్పల దెల్ల వాఱవలె
తెలవక చీకటి దీరదిదే
తెఱగు వేంకటాధిప నీవెలుగుదు
మెఱుగులు చల్లుచు మేలుకొనవే || భోగి ||

ప. సా రి గ గ రి రి స | స ధ ధ ధ | స స సా ||
భో గి శ య న ము న | బు స కొ - | ట్టె డి నీ ||

స రి గ ప ప ప దా | ద ద పా | గ రి గా ||
యో - గ ని - ద్ర పా | యు ను మే | ల్కొ న వే || భోగి ||

చ. ప ప ద ద ద ప ప గ | గ ప ప ప | ద ద ద ద ||
క - న్ను ల దె అ వ క | క ము ల బాం | - ధ వు డు ||

గ ప ప ద ద స̇ ద ద | ప గ ప ద | పా - - ||
వె - న్నె ల రే - డు ను | వె ల య రి | దే - - ||

పా ద ద స̇ స̇ రి̇ రి̇ | స̇ స̇ రి̇ రి̇ | గ̇ గ̇ రి̇ రి̇ ||
అ న్ను వ మ ల సే - | న రు ణో - | ద య మి దె ||

స̇ స̇ రి̇ రి̇ స̇ స̇ ద ద | ప గ ప ప | దా - - ||
మి - న్న క నీ - వి టు | మే - ల్కొ న | వే - - ||

పా గా రి గ రి రి | పా రీ | గా - - ||
- - - - - - | మే ల్కొ న | వే - - ||

రీ స స ధా రీ | సా - - | - - - - ||
మే ల్కొ న వే - | - - - | - - - - || భోగి ||

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ. నాయకుని వలపు చేతలకు కరగుచు, ఆనందించుచు "నీకు సతినౌటకు తగిన దాననా, నావద్దకు నీవు వచ్చి నన్ను లాలించి, విడెమిచ్చి సరసము లాడినచో కాదనగలనా? కాని నా అంతస్థు నాకు తెలిసినదే. నాతో సరసనుండి నీవు రాకున్న నిన్ను రప్పించుకొని ఆనందించగలంతటి దాననా? నాకు చనవిచ్చి ఏలితివి. అంతేచాలు" అని గోముగా తన నాయకుని తనయందు ప్రేమ హెట్టింపగునట్లు తన తక్కువతనమును చెప్పుకొను చున్నది.

**రాగ లక్షణము :**

ధన్యాసి ప్రాచీన రాగము. ఇప్పటి పద్ధతి ప్రకారము ఇది 8వ మేళకర్తయగు తోడి జన్యము. స గ మ ప ని స | స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు పూర్వుల రచనలు, భక్తి రస ప్రధానములగు కీర్తనలు ఈ రాగమునందెన్నో కలవు.

**ధన్యాసి—రూపకం**

నీవు మన్నించగా నే నింతయితి గాక
కావరించి నీతో నవ్వగలనా నేను || పల్లవి ||

ఘనుడ విడె మియ్యగా కాదన రాదు గాని
చెనకి నీ సొమ్ములంట చెల్లునా నాకు
చనవిచ్చి మాటాడగా జాలు ననరాదు గాని
తనర నీతో నేకతాల దాననా || నీవు ||

వరుస నీవు రాగా వద్దనగ రాదు గాని
తర మెరిగి రప్పించ దగునా నాకు
వొరసి చేయి వేయగా నోప ననరాదు గాని
సరి నింత దీమసపు సతినా నేను || నీవు ||

నీవు కౌగిట గూడగా నేమనరాదుగాని
యీవేళ మందెమేళా వెమ్మెలా నాకు
శ్రీ వేంకటేశ నీవు సేసినట్టే సేతుగాని
చేవదేర మెచ్చి సంతసించకుండగలనా || నీవు ||

శృం : 26 109

ప సగమాపా || పనిసససనిదపా || గమపనిదప ||
నీవుమన్ని || చ - - గా - - - నే || - - ని - - తయి ||

పమగాపమగరిసా || ససమామా || మపపపమగమా ||
తి - - గా - - - క || కావరిం చి || నీ - తో - - - - ||

గమపపనిసనిద || పా - మపా - - ||
నవ్వగలనా - - - || నే - - ను - - || నీవు ||

చ. పనినీనిని || నిరిస నిదపా || మగపమనిప ||
ఘనుడవిదె || మి - య్యగా - - || కా - దనరా - ||

పమగాపమగరిసా || పనిసానీ || సమ మాపమగగా ||
దు - - గా - - - ని || చెనకినీ || సొమ్ములం - - - ట ||

గమపానిసనిద || పా - - - - || పనినీనీ ||
చెల్లునానా - - - || కు - - - - || చనవిచ్చి ||

నీ రిస నిదపమ || పనిసాసా || సారినిసాసా ||
మా - - లా - డగా || జాలునన || రాదు - గా ని ||

పనిసమ్ గగరి ॥ రి సరినిసా ॥ పనిసారిస సనిసని ॥
తనరనీ - నీ - ॥ తో - నే - క ॥ తా - ల - - దా - - - ॥

నిపనిప పమపమ గా ॥
న - - - నా - - - - ॥ నీవు ॥

**అవతారిక :**

ఇందలి నాయిక ఖండిత, జాణ. ఈమె నాయకుని చేష్టలకు వెరగు పడుచున్నట్లు నటించుచు వ్యంగ్యముగా ఎకసెక్కెము లాడుచున్నది. "నీవు వెరగుపడుచున్నావు, బెదరుచున్నావు, తలవంచుకొనుచున్నావు, తడబడుచున్నావు, కూటములయందు గొంకుచున్నావు. నిన్ను నేనైతే ఏమియు ననలేదు. నీ గుట్టు మట్టులు తెలుసుకొనుటకు రాలేదు. నీ మేనియందలి గురుతులను గమనించనూలేదు. నిన్ను పల్లెత్తుమాట అనలేదు. ఏల యిట్లుంటివి? నిజమునకు నీ చేతలు ఒకనాటికి తమంతతాముగానే వెల్లడికాగలవు సుమీ! అని అనుచున్నది.

ధన్యాసి—రూపకం

నేనైతే నేమీ నెరగ నీకు నీవే బెదరేవు
తానే బయట బడేని తగని నీ చేతలు ॥ పల్లవి ॥

కొండవంటి దొర నిన్ను గోరి వెంగె మాడుదునా
దుండగము నీకు నీకే తోచీ గాకా
అండకువచ్చి నీ గుట్టు అరయగ వచ్చితినా
వుండుండి నీకు నీవే వులికేవు గాక ॥ నేనైతే ॥

నడుమను నిన్నుజూచి నవ్వులు నవ్వితినా
వడి నీకు నీవే తలవంచేవు గాక
వెడ నీమేని చేతలు వెదకి చూచితినా
తడవి కప్పుక నీవే దాచేవు గాక ॥ నేనైతే ॥

నీవు గాగిలించుకోగా నేరము లెంచితినా
భావించ నీవే సిగ్గువడేవు గాక
యీవేళ శ్రీ వేంకటేశ యిట్టె నన్ను గూడితివి
కోవిదుడవై రతిగొంకేవు గాకా ॥ నేనైతే ॥

శృం : 17—193

ప. - గ మ పా పా || ని స ని ద ప ప మ గ రి స ||
- నే - నై తే || నే - మీ - - నె - ర - గ ||

- స గ రి స రి ని స || ని ధ ఫ నీ సా ||
- నీ - కు నీ - - వే || జె - ద రే వు ||

- గ మ ప ప ని ద ప || ప ని స గ రీ స గ రి స ||
- తా - నె జై - - ట || బ - డీ - ని - - - - ||

ప ని స రి ని స ప ని మ ప గ మ || ప ని స ని ద ప మ గ రి స ||
త - గ - ని - నీ - - - - - - || చే - - - - - - త - లు - || నేనై తె ||

చ. - ప ద ప మా మ || గ మా - గ మ ||
- కొం - డ వం టి || దొ ర - ని న్ను ||

- స గ మా ప ని ద ప మ గ || రి స స రి నీ సా ||
- కో - రి వెం - - - గె - || మా - డు - దు నా ||

- ఫ ని స స మా || మా ప వ మ గా ||
- దుం - డ గ ము || నీ కు నీ - కే ||

- గ మ పా ని స ని ద || పా - - - - ||
- తో - చి గా - - - || కా - - - - ||

- ప రి సా నీ రి స || ని ద పా ప మ గ మ మ ||
- అం - డ కు వ - || చ్చి - - నీ - - గు ట్టు ||

గ మ ప ప ని స రి ని స || ని ద పా నీ సా ||
అ ర య గ - వ - - - || చ్చి - - తి నా ||

- ప ని సా గా || ప మ గ రి సా రి ని సా ||
- వుం - డుం డి || నీ - కు - నీ - - వే ||

- ప ని స గ రి స ని ద పా || పా ని ప ప మ మా ప మ మ గ గ రి సా ||
- వు లి కే - - - వు - - || గా - - - - - - - - - క - - ||

- గ మ పా పా || ని స ని ద ప ప మ గ రి స ||
- నే - నై తే || నే - మీ - - నె - ర - గ ||

**అవతారిక :**

ఒక క్రమ పద్ధతిలో వారు వీరను విచక్షణలేనిదై, పూర్వకర్మ సంగ్రహమైన ఫలము సుఖ దుఃఖములను కలిగించుచున్నది. ఇందుకు నీవే యుదాహరణమవు. ప్రాణులను సంసార బంధములయందు బంధించి త్రిప్పటలు బెట్టుచు, నాటకమాడించుచున్న నీకు, ఒక భామను యురముపై పెట్టి కట్టి, దేవుడవని కూడ తలపక, మారుకు మారు తీర్చుకున్నారెవరో! సృష్టి యందలి జీవులను సంసార సాగరమున ముంచి ముంచి అలయించు చున్న నీపై పగ దీర్చుకొనుట కెవరో, ఆది దేవుడవనియైన తలపక, నిన్నే సముద్రమునందు వండుకొనబెట్టిరి. జీవనోపాయములకు కొండలు కోనలు త్రిప్పి జీవులను కష్టపెట్టుచున్న నిన్ను ఏడు కొండలపై నిలుపుకొన్నారు. "నేనుండను" అని నీవనుటకు వీలులేదు కదా! ఓ కొండలరాయా! "చేసుకున్న వారికి చేసుకున్నంత" అనునది యెప్పటికిని సత్యము సుమా అను చున్నారు అయ్యవారు.

ధన్యాసి—ఝంపె

సామాన్యమా పూర్వ సంగ్రహంబగు ఫలము
నేమమున బెనగొనియె నేడు నీవనక ॥పల్లవి ॥

జగతి ప్రాణులకెల్ల సంసార బంధంబు
తగుల బంధించు దురితంపు గర్మమున
మగుడ మారుకుమారు మగువ నీ వురముపై
తెగి కట్టి రెవ్వరో దేవుండ వనక ॥ సామాన్యమా ॥

పనిలేక జీవులను భవసాగరంబులో
మునుగ లేవగ జేయు మోహ దోషమున
పనిపూని జలధిలో బండబెట్టిరి నిన్ను
వెనకెవ్వరో మొదలి వేలుపనక ॥ సామాన్యమా ॥

ఉండనీయక జీవనోపాయమున మమ్ము
కొండలను గొబలతలిగొని త్రిప్పు ఫలము
కొండలను నెలకొన్న కోనేటి పతివనగ
నుండవలసెను నీకు నోపలే వనక ॥ సామాన్యమా ॥

ప. సా గా మ । పా పా మ ॥ ప ని స సా । స ని స ని ద ప మ ॥
సా మా న్య । మా పూ ర్వ ॥ సం - గ్ర హం । బ - గు - ఫ ల ము ॥

1. ప ని స స స । స ని స ని ద ప మ ॥ గ మ ప ప మ । గ రి సా - ॥
నే - మ ము న । బె - న - గొ ని యె ॥ నే - డు నీ - । వ న క - ॥

2. ప ని స గ రి స ని । ద ప గ మ ప ని స ॥ ప ని స రి స ని ద ప ప మ । గ గ రి సా - ॥
నే - - - మ ము న । బె న గొ - ని - యె ॥ నే - - - డు - నీ - - - । వ - న క - ॥

॥ సామాన్యమా ॥

చ. స గ మ పా । ప ప పా మ ॥ గ మ పా మ । గా రి స స ॥
జ గ తి ప్రా । ణు ల కె ల్ల ॥ సం - సా ర । బం ధం - బు ॥

స గ మ మా । మా ప మ గ ॥ స గ మ పా । ని స ని ద పా - ॥
త గు ల బం । ధిం చు దు రి ॥ తం - పు క । ర్మ - ము - న - ॥

మ గ మ పా । ని ని ని ద ప ॥ ప ని స సా । స రి ని సా ॥
మ గు డ మా । రు కు మా - రు ॥ మ గు వ నీ । వు ర ము పై ॥

ప ని స సా । స ని స ని ద ప మ ॥ మ ప మ గ రి । సా - - - ॥
తె గి క ట్టి । రె - - - వ్వ రో - ॥ దే వు డ వ న । క - - - ॥

॥ సామాన్యమా ॥

**అవతారిక :**

శ్రీ వేంకటేశ్వరునకు జరిపెడి సేవలు, నిత్యోత్సవములు అలంకారములు మొదలగు వైభవములను ఇందు అయ్యవారు వర్ణించుచున్నారు.

**ధన్యాసి — ఆది**

సందడి విడువుము సాసముఖా
మందర ధరునకు మజ్జనవేళా || పల్లవి ||

అమరాధిపులిడు డాలపట్టముల
కమలజ పట్టుము కాళాంజి
జమళి చామరలు చంద్రుడ సూర్యుడ
అమర నిడుడు పరమాత్మునకు || సందడి ||

అణిమాది సిరుల నలరెడు శేషుడ
మణిపాదుక లిడుమతి చెలగా
ప్రణతింపు కడిసి భారతిరమణ
గుణాధిపు మరుగురు బలుమరును || సందడి ||

వేదఘోషణము విడువక సేయుడు
ఆదిమునులు నిత్యాధికలు
శ్రీదేవు డగు శ్రీవేంకటపతి
ఆదరమున సిరులందీ వాడె || సందడి ||

అ : 5—12

ప. గా మ మ ప ప ని ని । సా రి ని । సా - - ॥
సం ద డి వి డు వు ము । సా స ము । ఖా - - ॥
నీ స స రి స స ని । ద ప ప మ । గ రి సా ॥
మం ద ర ధ రు న కు । మ - జ్జ న । వే - ళా ॥ ॥ సందడి ॥

చ. ప ని సా స స రి స । నీ స ని । ద ప ప మ ॥
అమ రా ధి పు లి డు । డా ల ప । - ట్ట ము ల ॥

ప ని స̇ స̇ సా̇ రి̇ స̇ । ని ద ప ని । సా̇ - - ॥
క మ ల జ  ప ట్టు ము । కా - శిం - । జి - - ॥

ప ని స̇ స̇ మ̇ గ̇ రి̇ స̇ । స̇ గ̇ రి̇ స̇ । రి̇ ని స̇ స̇ ॥
జ మ ళి చా - మ ర లు । చ - ద్రు డ । సూ - ర్యు డ ॥

ప ని స̇ ని స̇ ని స̇ ని ద ప । ప మ గ రి । సా సా ॥
అ మ ర ని డు - డు - ప ర । మా - త్మ న । కు ను ॥ ॥ సంధడి ॥

**అవతారిక :**

"ఇందు పరిపరి విధముల పరుగిడుపోవు మనసు నుద్దేశించి, "నీవు చంచలమగు స్వభావ మును విడిచి, మన్మథుని మాయలయందు చిక్కక, కావడికుండలవంటి వయసు, యౌవనము మొదలగువాని యనుభవములకు పరుగులిడినచో పడి చెడెదవు. సమయముండగనే మేలేదో కీడేదో తెలుసుకొని పున్నమి అమావాస్యల వంటి బ్రతుకులు చూచి సుఖదుఃఖముల అంతస్తుల యందు బడి కొట్టు మిట్టాడకుమీ! పంచేంద్రియములలో బలవత్తరములగు కనులు, చెవులు నిన్ను మోసగించును. సమస్త దేవతాధీశుడైన శ్రీ వేంకటేశ్వరుని చింతనజేసి ముక్తి సాధనకు ప్రయత్నించుటయే నీకుచితము సుమీ!" అని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

ఆహిరిరాగము అతి ప్రాచీనము. వెంకటమఖి సంప్రదాయమున నారీ రీతిగౌళ జన్యముగాను, భాషాంగముగాను, ప్రతిమధ్యమము తప్ప తక్కిన స్వరములన్నియు పలుకునదిగాను వివరించి యున్నారు. కాని ఇప్పటి పాడుక ప్రకారము వకుళాభరణము జన్యముగా నుండి 'ని ద ని స' అను సందర్భమున చతుశ్రుతి ధైవతమును, 'స గ స' అనునప్పుడు సాధారణ గాంధారమును పలుకుచు భాషాంగముగా యీ రాగము ఒప్పుచున్నది. దీనిని పూర్వాచార్యులు 8వ మేళముగా చెప్పి యున్నారు. ఇందలి గమక వరికాదులు గురుముఖమున అభ్యసించి పాడుకొనవలెను. ఇందుగల స్వరములయందు నొక్కు, జారు, కంపితము పలుకు విధము కొంత కష్టసాధ్యము. 'ని ద ని స' అనునప్పుడు మాత్రమే చతుశ్రుతి ధైవతము పలుకును. 'ద ని ద ప' అనునప్పుడు శుద్ధధైవతమే పలుకును. 'స గ మ ప' అను ప్రయోగము తరచు వచ్చును. స గ స ని' అను నప్పుడు సాధారణ గాంధారము ఛాయా మాత్రముగా తోచును.

**ఆహిరి — రూపకం**

పారకుమీ వో మనసా పంతము విడువకుమీ మనసా
పారిన నీవే బడగయ్యేదవు చేరువ నాడే చెప్పనె మనసా ॥ పల్లవి ॥

చింతించకుమీ శివునివైరిచే చిక్కువడకుమీ వో మనసా
కంతు వారకము వయసు బ్రాయములు కావటికుండలు వో మనసా
యెంతో మేలూ గీడేకాలము ఎప్పుడు నుండదు వో మనసా
సంతరించుకో వానిని మనసున సంతోషముగా వో మనసా ॥ పారకుమీ ॥

ఎన్నికలే తలపోయకుమీ యేమరకుండుమి వో మనసా
కన్న విన్న వారిలో నెప్పుడూ కాకుపడకుమీ వో మనసా
పున్నమ మాసలు పుడమిలో బదుకులు పోయివచ్చేవి వో మనసా
మిన్నో నేలని మన్న దినములో మీదు చూడకుమి వో మనసా ॥ పారకుమీ ॥

కన్నుల సంగాతము వేయకుమీ కళవళించకుమి వో మనసా
వన్నెలమాటల చెవుల బెట్టక వాసి విడువకుమి వో మనసా
మున్నిటి సురలు బ్రహ్మాదులకైనను ముక్తిసాధనము వోమనసా
వెన్నుని వేంకటగిరిపతి దలచుము వేసారకుమీ వో మనసా ॥ పారకుమీ ॥

అ : 11–59

ప. పా ద ని సా ॥ స ని ద ప ప మ ॥ మ గ మ ప ద ని ॥
పా ర కు మీ ॥ ఓ - మ న సా - ॥ పం - త ము వి డు ॥

ద ప ప మ గ స ॥ రి స సా - - ॥ స గ మ మ మ గ ॥
వ కు మీ - - - ॥ మ న సా - - ॥ పా - రి న నీ - ॥

గ మ ప ప పా ॥ ద ని ద ప పా ॥ ని ద ని ని సా ॥
వే - ప డ గ ॥ య్యో ద వు - - ॥ చే - రు వ నా ॥

రి స స ని ని ప ॥ ద ప పా - - ॥
డే - చె - ప్పె ॥ మ న సా - - ॥ ॥ పారకుమీ ॥

చ. మా మా మ మ ॥ మ గ మ గ స రి ॥ సా ని సా - ॥
చిం తిం చ కు ॥ మీ - - శి వు ని ॥ వై రి చే - ॥

సా మ మ గ మ ॥ పా ద ని ద ప ॥ పా - - - - ॥
చి క్కు ప డ కు ॥ ఓ మ న సా - ॥ - - - - - ॥

ద ని స సా స ॥ స స రి స స ని ॥ ద ని స స స ని ॥
కం - తు ఘా ర ॥ క ము వ య్య సు - ॥ క్షా - య ము ల్లు - ॥

స మ గ స రి స ॥ స ని ద ని స స ॥ సా - - - - ॥
కా - వ డి కుం - ॥ డ లు ఓ - మ న ॥ సా - - - - ॥

సా రి సా ని ॥ ని ద ని ద ప మ ॥ ప ద ని సా స ॥
ఎం త మే లు ॥ గీ - డే - కా - ॥ ల - - ము - ॥

నీ ని ద ద ని ॥ స రి స ని ద ప ॥ పా - - - - ॥
యె ప్పు డు నుం - ॥ డ దు ఓ - మ న ॥ సా - - - - ॥

ప ద నీ సా స ॥ స ని ద ప ప మ ॥ గ మ ప ప ద ని ॥
సం - త రిం చు ॥ కో - వా - ని ని ॥ మ న సు న సం - ॥

ద వ ప మ గ మ ॥ గ స రి స గ మ ॥ పా - - - - ॥
తో - ష ము గా - ॥ ఓ - - - మ న ॥ సా - - - - ॥

॥ పారతుమి ॥

**అవతారిక :**

సంసారము నందలి ఆకర్షణలు ముసిడిపండు వంటివని తెలుసుకొనలేక ప్రాణులు వ్యామోహమున పడి పడి వదలలేక, వదిలించుకొనలేక బాధపడుచుండును. పాములవంటివగు భావములతో బంధింపబడి వానితో చెలగాటము లాడుచు నిట్టూర్చు చుండును. తేనె పూసిన కత్తులను నాకుచు, జనులు వెత నొందుదురేగాని, వేంకటపతిని ఆశ్రయించి ఆ దేవుని కృపా కటాక్షములను పొందలేరు గదా!' అని అయ్యవారు ఈ కీర్తనమున చెప్పుచున్నారు.

ఆహిరి—ఆది

మాయలకగపడి మతి చెడి ప్రాణులు
రోయదలచియును రోయగలేరు ॥ పల్లవి ॥

మిస మిస మెరువగ మెల్లన చేరిరి
ముసిడి మాని ఫలములు చూచి
రసమని సంసారపు బాలకు లిదె
విసిగి చేదుగని విరుగగ లేరు ॥ మాయల ॥

బలువిష మొలికెడి పాము బట్టుకొని
అలరుచు నలుగడ నాడేరు
పొలసి యాస లూర్పులు నిగుడించగ
తెనిసియు నింకా దెలియగ లేరు ॥ మాయల ॥

తేనెదెచ్చి కత్తికి దార బెట్టి (న)
నానావిధముల నాకేరు
దీనత లణపెడి తిరు వేంకటపతి
చేని పంటలకు జెయి చాచలేరు ॥ మాయల ॥

అ : 11–163

ప. పా ద ని స̇ స̇ స̇ ని | ద ని స̇ ని | ని ప ద వ ||
మా య ల క గ ప డి | మ తి చె డి | ప్రా - ణు లు ||

మ గ మ ప ద ని ద ప | ప మ గ మ | గ స రి స ||
రో - య ద ల చి యు ను | రో - య గ | తే - రు - || || మాయల ||

చ. ప ప ద ప ప మ మ గ | మ గ మ గ | గ స రి స ||
మి స మి స మె రు వ గ | మె - ల్ల న | చే - రి రి ||

స గ మ పా ప ప ద | ని ప ద ప | పా - - ||
ము ని డీ మా ని ఫ ల | ము లు చూ - | చి - - ||

ద ప ద ని సా̇ సా | ద ని స̇ రి̇ | స̇ స̇ స̇ ని ||
ర స మ ని సం సా | ర పు బా - | ల కు లి దె ||

ని ని స̇ ని ప ద ప మ | మ గ మ ప | ద ని ద ప ||
వి సి గి చే - దు గ ని | వి రు గ గ | తే - రు - || || మాయల ||

**అవతారిక :**

బుద్ధి చంచలమైన దైనను భగవంతుడగు శ్రీ వేంకటేశ్వరునియందు లగ్నము జేసి యుంచుట వలన కర్మములు తొలగి, ముక్తిని సాధింపవచ్చును. ఇట్లు సాధించుట పరమ సుఖమగు బంధమోక్షమని పెద్దలవాక్కు. ఇట్లని తెలిసియు పాపముల పొంతకు పరుగులిడి కష్టములను కొని తెచ్చుకొని కడకు మంట గలసి పోయెడి కాయమును నమ్మి హరి దలంపక గాలికి పోయెడి పాటును పూర్వకర్మఫలమని పొందుచుండెడి జీవుల నుద్దేశించి, తరించుటకు మార్గమును తలంచి చరించు డని అయ్యవారు చెప్పుచున్నారు.

**ఆహిరి—ఝంపె**

ఎన్నాళ్ళుదాక దానిట్టె వుండుట బుద్ధి
కన్నపోవుట పూర్వకర్మ శేషం ॥ పల్లవి ॥

కలకాలమెల్ల దుఃఖమె కాగ ప్రాణికిని
వలదా సుఖము కొంత వడియైనను
కలుష బుద్ధుల ప్రజ్ఞగలదింతయును మంట
గలసి పోవుటె పూర్వకర్మశేషం ॥ ఎన్నాళ్ళ ॥

జాలి తొల్లియు బడ్డ జాలె నేడును గాక
మేలు వద్దా యేమిసైనను
తాలిమిలో హరి దలచక యెఱుకెల్ల
గాలి బోవుట పూర్వకర్మశేషం ॥ ఎన్నాళ్ళ ॥

తరగని నరక బాధయు నేడును గాక
దరిచేరవలదా యింతటనైనను
తిరువేంకటాద్రిపై దేవుని గొలువక
గరివడే భవమెల్ల కర్మశేషం ॥ ఎన్నాళ్ళ ॥

అ : 11—47

ప. పా దా ప | పా ప ప మ || గా మ గ స | రి స సా ని ||<br>
ఎ న్నా ళ్ళ | దా క దా - || ని ట్టె నుం - | డు ట బు ద్ధి ||

స స గ గ మ | ప ప పా మ || పా ద ని ప | ద ప పా - ||<br>
క - న్న పో - | వు ట పూ ర్వ || క ర్మ శే - | షం - - - || || ఎన్నాళ్ళ ||

చ. ద ని సా స | సా రి స ని || ద ని సా స | సా రి స ని ||<br>
క ల కా ల | మె ల్ల దుః - || ఖ మె కా గ | ప్రా ణి కి ని ||

ద ని సా స | స ని ద ప మ || ప మ గా మ | పా - - - ||<br>
వ ల దా సు | ఖ ము కొం - త || వ డి యై న | ను - - - ||

మ గ మ పా | ద ని ద ప మ || మ గ మా ప | ద ని ద ప మ ||<br>
క లు ష బు | ద్ధు ల ప్ర - జ్ఞ || గ ల దిం త | యు ను మం - ట ||

గ మ ప ప మ | గ మ గ స రి || సా గ మా | పా - - - ||<br>
గ ల సి పో - | వు చె పూ - ర్వ || క ర్మ శే | షం - - - || || ఎన్నాళ్ళ ||

**అవతారిక :**

ఇందలి నాయిక రూపగర్వితయై నాయకునితో కలహములు పెంచుకొని వలపునకు లోనైనది. చెలులు మందలించినను వినక, కొయ్యతనమున తెచ్చుకొన్న విరహమునకు వగచుచున్నది. నాయకునితో మేలముల హద్దు మీరకుమని వారుచెప్పినను వినక, వలపులు తెచ్చుకొన్నదీమె' అని అయ్యవారు చెప్పుచున్నారు.

**ఆహిరి—ఝంపె**

కొమ్మ దన ముత్యాలకొంగు జారంగం బగటు
కుమ్మరింపుచుం దెచ్చు కొన్నది వలపు ॥ పల్లవి ॥

ఒయ్యారమున విభుని వోరపుగనుంగొని రెప్ప
ముయ్యనేరక మహామురిపెమునను
కయ్యపుం గూటమికి కాలుద్రవ్వుచు నెంత
కొయ్యతనమునం దెచ్చుకొన్నది వలపు ॥ కొమ్మ ॥

పైపైనె ఆరగింపకుము పన్నీరు గడు
తాపమవునని చెలులు దలంక గానె
తొప్పలియుచుం గెంపు తొలంకు గన్నులకొనల
కోపగింపుచుం దెచ్చుకొన్నది వలపు ॥ కొమ్మ ॥

యెప్పుడునుం బతితోడ నింతేసి మేలములు
వొప్పరని చెలిగోర నొత్తంగానె
యెవ్వుడో తిరువేంకటేశు కౌగిటం గూడి
వొకొప్పు గులుకుచుం దెచ్చుకొన్నది వలపు ॥ కొమ్మ ॥

శృం : 3—459

ప. - ప ద ని ద ప ప మ | గ మ గ స రి స ని స ||
- కొ మ్మ - త - న - | ము - - - త్యా - - ల ||

- స ప పా ప మ గా | మ ప ద ని ద ప ||
-కొం - గు జా - - | ర గ బ - గటు ||

- ప ద ని సా - ని | ని స ని స ని ప ప ద ప ని ద ప మ ||
- కు - మ్మ రిం - - | పు - - - చు - తె - - - చ్చు - - ||

గ మ ప ద ప మ గ మ గ రి | స గ మా పా ద ప ప మ || గ మ ||
కొ - - - న్న - ది - - - | వ - ల పు - - - - || - - || కొమ్మ||

చ. - స రి స స ని ని ప | ద ని ద పా ప మ ||
- ఎ ప్పు - డు - నుం - | బ - తి తో డ - ||

- గ మ ప ద ప మ గ మ | మ గ సా రి స స ||
- నిం - తే - - - సి - | మే - - ల ము లు ||

- స గ మా ప ప | ప ప ద ప ప మ పా ||
- ఒ - ప్ప వ ని | చె లి గో - - - ర ||

పా - ద ని స రి స రి | సా సా - ||
నా - - త్త గా - - - | నే - - ||

- స రి గ మ గ రి | స రి సా స ని ||
- ఎ ప్పు డో - - - | తి రు వేం క - ||

ద ని స రి స ని ద ని స రి | స ని ద ని ద ప ప మ ||
టే - - - శు ఁ కొ - - - | గి - ట - గూ - డి - ||

గ మ ప ద  ని సఀ ని | ని సఀ ని సఀ  ని ప  ప ద ప ని  దా ప మ ||
- - కో - వ్వు కు లు | కు - - - చు - తె - - - చ్చు - - ||

గ మ ప ద  ప మ  గ మ గ రి | స గ మా  పా ద ప  ప మ || గ మ
కో - - - న్న - ది - - - | వ - ల  పు - - - - || - -  ||కొమ్మ||

**అవతారిక :**

పంచమ వేదము వంటిదగు సంకీర్తనము చేయుచు, రాధా మాధవులను భజించి తరించుట కలియుగమున ముక్తిమార్గమనియు, కలిదోషంబులను బాపి భవమును నశింపజేసి జీవులకు తరుణోపాయమును తెలియజేయు దివ్యౌషధము యీ సంకీర్తనమే అనియు అయ్యవారు యీ కీర్తనమున నొక్కి వక్కాణించుచున్నారు.

భారతీయ భాషలన్నిటియందును ప్రాచీనకాలము నుండియు సంకీర్తన పద్ధతి వైష్ణవ సంప్రదాయములయందు కనబడుచున్నది. ఇట్టి సంకీర్తన పద్ధతికి రూపురేఖలుదిద్ది లక్షణములు చెప్పి అన్నమయ్యవారు సంకీర్తనాచార్యులు, పదకవితాపితామహులు అని అనిపించుకున్నారు. రాధామాధవులు జీవాత్మ పరమాత్మ స్వరూపములనియు, పరమాత్ముడగు పరమ పురుషుని పొందుటకు జీవాత్మలగు స్త్రీలు రాధా మహాదేవివలె ఆ స్వామిని ఉపాసించ వలెననియు బోధించెడి తత్త్వమును 'మధురభక్తి' యందురు. తెనుగున యిట్టి రచనలకు ప్రారంభకులెవరో యెరుగముగాని, ఈ కోవకు చెందిన అన్నమయ్యవారి రచనలు మాత్రము అసంఖ్యాకములుగా గలవు.

**ఆహిరి — ఆది**

కలియుగంబునకు గలదిదియే
వెలసిన పంచమవేదమె కలిగె ॥ పల్లవి ॥

బోధల సారె సతి పొడమెను శూద్ర
సాస్యధని కలిదోషము మన్న
రాధామాధవ రచన సకలజన
సాధువేదమే జగమున గలిగె ॥ కలి ॥

పరమగు వేదము బహుళము చదివియు
హరినెరిగిన వా రరుదనుచు
తిరువాయిమొడియై దివ్యమంత్రమై
వెలసిన (?) పంచమ వేదమె కలిగె ॥ కలి ॥

బింకపు మనుజులు పెక్కులు చదివియు
సంకె దీరదెచ్చట ననుచు
సంకీర్తనమే సకలలోకముల
వేంకటేశ్వరుని వేదమె కలిగె ॥ కలి ॥

అ : 11—60

ప. స గ మ పా ప ప మ | ప ద ని ద | పా - - ||
క లి యు గం బు న కు | గ ల ది ది | యే - - ||

ప ద ని సఁ ని ద ప మ | గ మ ప మ | గ స రి స ||
వె ల సి న పం - చ మ | వే - ద మె | క లి గి - || || కలి ||

చ. స గ మ ప ప ప ప మ | ప ద ని ప | ద ప ప మ ||
బో - ధ ల హా రి మ తి | పొ డ మె ను | శూ - ద్ర - ||

ప ద ని సఁ సఁ సఁ సఁ ని | ద ని సఁ రిఁ | సాఁ - - ||
స్వా - ధ ని క లి దో - | ష ము మా - | న్పి - - ||

సఁ గఁ మఁ గఁ సఁ రిఁ సఁ నిఁ | ద ని సఁ సఁ | ని ద ప మ |
రా - ధా - మా - ధ వ | ర చ న స | క ల జ న |

మ గ మ ప ద ని ద ప | ప మ గ మ | గ రి సా |
సా - ధు వే - ద మే - | జ గ ము న | గ లి గె | || కలి ||

**అవతారిక :**

నీవు మా చెలిని యేలియు, ఆమె నిన్ను ఆరట పెట్టినదని లోకమునకు చాటుటకా నీవు లోనికి రాక వాకిలివద్దనే యుంటివి. నీవు చేసిన చేతలకు సిగ్గుపడి చెలులమైన నను చూచుటకు మోమాటమితో మాచెలి తెరవదలి రాకున్నది. నీవైనను లోనికివచ్చి ఆమెను లాలింపవయ్యా అని వేంకట రమణుని నాయిక దూతికలు వేడుకొను చున్నారు.

**రాగ లక్షణము :**

నాగవరాళి 8 వ మేళమగు హనుమతోడి జన్యమని లక్షణకారులు చెప్పియున్నారు. ఇది మంద్రధైవతమునుండి, మధ్యస్థాయి నిషాదమువరకు సంచారములు కలిగి యుండెడి రాగమని కొందరి మతము. తారస్థాయి సంచారములు ఉండినట్లు కొందరి మతము గనుక తారస్థాయి సంచారములు సందర్భానుసారముగ అన్నమయ్యవారి పదముల స్వరపరచుటలో చేర్చడమైనది. విళంబకాలమున స్వరములను నియతస్థానముల యందు తగు మాత్రపు గమక వరికాదులతో పట్టునప్పుడు రాగస్వరూపము కనబడుచున్నది.

స రి గ మ ప మ ద ని స | స ని ద మ ప గ మ గ రి స అనునవి ఆరోహణావ రోహణములు.

**నాగవరాళి — త్రిపుట**

లోనికి రావయ్యా లోకమెల్లా రట్టాయ
దీనికి గానే యింతి తెరలోనే వున్నది ॥ పల్లవి ॥

మగువ నీతో నిట్టె మాటలెన్నో ఆడగాను
చిగురుమోవి యెల్ల జిల్లులాయను
అగడుసేతురా నీవు ఆట దాని నింతలో
తెగువలు చూపలేక తెరలోనే వున్నది ॥ లోనికి ॥

నలినాక్షి సారెసారె నవ్వునీతో నవ్వగాను
తొలకి చెక్కులను చంద్రుడు నిండెను
వెలుచు సిగ్గు రేతురా ప్రియురాలి కింతలోనే
తెలిసెనంటా దాను తెరలోనే వున్నది ॥ లోనికి ॥

కామిని యేపొద్దు నిన్ను గాగిటనే కూడగాను
కామించి మేనెల్లా తీగె (గ) లు వారెను
దోమటి శ్రీ వేంకటేశ తొయ్యలినింత సేతురా
దీమసాన రతి బొక్కి తెరలోనే వున్నది || లోనికి ||

శృం : 19–423

ప. - - స రి | గా మా || ప గ మా - గ | గ రి రీ సా ||
- - లో - | ని కి || రా - - - - | వ - - య్యా ||

- స ని ద ని | ద మా || గ మ పా - గ | మా - గ గ రి రీ ||
- లో - క - | - మె || ల్ల - - - - | ర - - ట్టా - - ||

సా ధ ని | సా సా || సా రి స నీ | స రి స రి గా ||
య దీ - | ని కి || గా - - - | నే - - - యిం ||

మా ద ని | సా - ని ద మ || పా గ మా గ | గ రి రీ సా ||
తి తెర | లో - - నె - || వు - - - | న్న - - ది || || లోనికి ||

చ. - - మ | మ మ మా || మ ప గ | మా గా ||
- - మ | గు వ నీ || తో - - | ని ట్టే ||

రి స ని | నీ స రి గా || గ రి రీ స | స ని ధ నీ ||
- - మ - | ట లె - - || నొ్ర - - - | అ - - డ ||

సా స రి | సా రి స స ని || సా స రి | గా మా ||
గ చిగు | రు మో - - - || వి - - | యె ల్ల ||

- - గ మ | పా - గ మా - గ || గ రి రీ | సా - - ||
- - చి - | ల్లు - - లా - - || యె - - | ను - - ||

- - స రి | గా మా || ప మా | ద ని దా ||
- - అ గ | డు సే || తు రా | నీ - వు ||

- - ద ని | సా - ని ని ద దా || ద ని ద | మా మ గ మ ||
- - ఆ - | ట - - దా - - || ని నిం - | త లో - - ||

పా గ మ | ద ని ని ద || ద ని సా స ని | ద మ పా ||
నే తె గు | వ - లు - || చూ - - ప - | లే - - ||

పా ద ని | ద మ పా || పా గ మా గ | గ రి రీ సా ||
క తె ర | లో - నే || వు - - - | న్న - - ది || || లోనిక ||

**అవతారిక :**

ఇందు నాయిక ముగ్ధ. 'నీవు నన్ను వేరు దానిగా భావింపకుము. నేను ఇతరులవలె సింగారములు చేసుకొని నటనలతో నిన్ను భ్రమియింపను. నీకౌగిట నన్నదిమి పట్టితివి. నీకు మ్రొక్కెదమన్నను చేతులు స్వాధీనము కావు. నేను నీయందలి ప్రేమచే నీకు వశమైన అలమేలు మంగను, మఱువకువయ్యా స్వామి' అని తన నాథుడగు శ్రీ వేంకటేశ్వరునకు విన్నవించుకొను చున్నది.

**నాగవరాళి — రూపకం**

మఱవకువయ్య్యా నీవు మాట లెన్నైనా గలవు
తఱవాత జేసేటి తగవు నీ చేతిది || పల్లవి ||

మందలించి నీవు నన్ను మన్నించకున్నాడవు
యెందుకా విన్నపాలు నీకేమి సేసేది
యిందరి వలెనే నేను యెరవుల దాన గాను
పొందినట్టి నా పాలిటి పుణ్యము నీ చేతిది || మఱవకు ||

నిచ్చలు నామతిలోన నీవెనాకు గలవు
యెచ్చరించ సారెసారె నేటికి మాకు
బచ్చెన చేతల నిన్ను భ్రమియించే దానగాను
పచ్చిదీర నా కిచ్చిన బాసలు నీ చేతివి || మఱవకు ||

కొత్తకా కౌగిట నన్ను గూడితి విప్పుడే నీవు
యెత్తిన చేతులు నీకు నేడ మొక్కేది
అత్తిన శ్రీ వేంకటేశ అలమేలు మంగనేను
పొత్తులనుండిన నా భోగము నీ చేతిది || మఱవకు ||

శృం : 18—10

ప. స రి గ గ మా || ప గ మా మా || ప ద నీ ద మ పా ||
మ ఱ వ కు వ || య్యా - నీ వు || మా - - ట లె న్నై ||

ప ద మా వ గ మా || ప మ ద ని సా || ని స నీ ద ని దా మా ||
నా - - గ ల వు || త అ వా - త || చే - - సే - - టి ||

మ ప ప ని ని దా మ || ప గ మ గ రి స ||
త గ వు నీ - - - || చే - - తి ది - || || మఱువకు ||

చ. ప రి గా మా || గ మ గా గ గ రి రి స || స రి నీ స రి గా ||
మంద లిం చి || నీ - - వు న - - న్ను || ము - - న్నిం - చు ||

మా ప గ మ మ || - గ మ పా పా || ప మ ని ని ద ద ద ||
కు నా్న - డ వు || - ఎం - దా క || వి - న్న పా - - లు ||

ద మ పా పా || - గ మ ప మ ద ని || సా స ని ద ని సా ||
సే - సే ది || - ఇం - ద రి వ లె || నే నే - - - ను ||

స రి గ మ గ గ రి సా || రి స ని ద నీ సా || - స స ని స ని ని ||
యె - ర - వు - ల దా || న - ను - గా ను || - పొం ది న - - ట్టి ||

ద ని ద ద మ ప ప || మ ని ని ద దా ద ము || ప గ మ గ రి స ||
నా - - పా - లి టి || పు - ణ్యా - ము నీ || చే - - తి ది - ||

స రి గ గ మా || ప గ
మ రు వ కు వ || య్యా -

ఇందు అమాయకురాలగు నాయికను నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుడు మెప్పులు బలికి మనసు నుబ్బించి, గడ్డము బట్టుకొని బ్రతిమాలుచు తన దానిని చేసికొని పలుకొనరాగా ఆమె ప్రేమోత్కంఠితమై 'నీకు ప్రొద్దుపోనివేళ నేను కావలసి వచ్చితిని, పోనిమ్మ, నీవెట్లుండినను, ఏమి చేసినను, చాటుగానైన యెవరికేని నీపై ఏమేని చెప్పుకొందునా, నిన్ను కసరుకొందునా, నేను నీదానను, యీ వినయపు చేతలు చాలురా' అని వేడుకొనుచున్నది.

నాగవరాళి—రూపకం

పొద్దువోక నీవు నాతో బొంకవచ్చే వింతేకాక
గద్దించి నీవెట్టుండిన గాదు గూడదనేనా ॥ పల్లవి ॥

నన్నోడ బరచకుర నమ్మికలు సేయకుర
నిన్నేమయిన నంటినా నీవు గొంకేవు
అన్నిట లోకమువారు ఆడుకొందు రింతేకాక
విన్న నీ సుద్దులు నేను వెల్లవిరిసేసేనా ॥ పొద్దువోక ॥

యింత నన్నుబ్బించకుర యిచ్చకాలు సేయకుర
జంతనై నిన్నిక నే సాదించేనా
కాంతుడ నీ చుట్టాలు పక్కాలు నమ్మరింతేకాక
మంతనాన నీపై నింద మరివేసేనా ॥ పొద్దువోక ॥

గడ్డము పట్టకురా కౌగిట నించకురా
యెడ్డనై నీ మాటకు నే నెదు రాడేనా
వెడ్డువెట్టి యిట్టె శ్రీ వేంకటేశ కూడితివి
దొడ్డదొరవైన నిన్ను దూరు కెక్కించేనా ॥ పొద్దువోక ॥

శృం : 17–241

ప.  - స రి గా మ || పా ప మ ద దా || ద ని సా స ని స నీ ని ||
- పొ ద్దు వో క || నీ వు - నా తో || బొం - - క వ - చ్చే - ||

ద మ పా గ మ ప మ || - మ ద ని సా || స ని ద నీ స స ||
విం - తే గా - - క || - గ ద్దిం చి సీ || వె - ట్టుం - డి న ||

స రి స ని ద ని ద మ || ప ప గ మ పా - ||
కా - - దు కూ - - డ || ద నే - - నా - ||                || పొద్దు ||

చ.  - స రి గా మ మ || ప గ మ మ పా || - మ ద ని స ని ద మ ||
- న - న్నొ డ - || బ ర చ కు రా || - న మ్మి క - లు - - ||

ప గ మ మ పా || - ద ని సా స ని ద మ || ప గ మా ప గ మ మ ||
చే - య కు రా || - ని - న్నే మై - - - || నా - - యం - టి నా ||

- ప ద మ ప గ మ ప గ || గ రి రీ సా - - || - గ మ ని ని ద దా ||
- నీ - - వు గొం - - - || కే - - వు - - || - అ న్ని ట లో - - ||

ద మ దా నీ సా || - స రి గా గ || గ మ పా గ గ రి రీ స ||
క - ము వా రు || - ఆ డు కొం దు || రిం - తే - - గా - - క ||

- ని ని స రి గ రి స || ని స రి స ద ని స ని దా || స రి స ని ద ని ద మ ||
- ఎ న్న నీ - - - సు || ద్దు - లు - నే - - - ను || వె - ల్ల వి రి - సే - ||

ప ప గ మ పా - ||
నే - - - నా - ||                || పొద్దు ||

**అవతారిక :**

"లోకమునందెచ్చట గాంచినను నీ మహిమాతిశయములే వినబడుచున్నవి, కనబడుచున్నవి. లోకేశుడు నీ సుతులట. నీ సుతుల సిరులు ఎన్నుటకు వశముగాదట. నీ కూతురు లోకపావనియట. నీ ఆయుధములు అతి ప్రభావము గలవియట. నీ చేతియందలి శంఖు వేదములనే పలుకునట. నీ పానుపుయగు శేషువు భూమి యునికికే ఆధారమట. నీవు ఎచటనుండిన నదియే పరమపదమందురు. అలమేలుమంగకు నాధుడవైన ఓ శ్రీ వేంకటేశ్వరా నీ దాసులకు దాసుడగు నన్ను కాపాడుమయ్యా" అని అన్నమయ్యవారు యీకీర్తనమున స్వామి మహిమాతిశయములను కొనియాడుచున్నారు.

**రాగ లక్షణము :**

హెజ్జజ్జి ప్రాచీన రాగములలో నొకటి. స రి గ మ ప ద స | స ని ద ప మ గ రి స అను షాడవ సంపూర్ణములగు ఆరోహణావరోహణములు కలిగియున్నను క్రింది పంచమము నుండి పైస్థాయి షడ్జమము వరకు మాత్రమే వాడుట సంప్రదాయమని తెలియుచున్నది. దీనిని గేయహెజ్జజ్జి అనియు చెప్పుట కద్దు. సంపూర్ణ సంపూర్ణముగ నుండినచో ఇది 13 వ మేళ మగును. రాగములకు జన్యజనకముల ఏర్పాట్లు రాకపూర్వము ఎన్నో అందమైన స్వర సందర్భములుగల రాగములుండెడి వనియు, వీనిని జన్యజనకము లను పరిధులలోనికి తెచ్చి బిగించి నప్పుడు వాని అందములు స్వర స్వరూపములు మార్పుచెంది పాడుటకును, వినుటకును అనువుగాని కటువరితనము వచ్చి ఎన్నియో రాగములు అంతరించినవని కొందరు లక్షణకారుల అభిప్రాయము. పరిశీలనతో గమనించినచో వారి అభిప్రాయముతో ఏకీభవించక తప్పదు. హెజ్జజ్జి యందలి నిషాదము శుద్ధనిషాదము కన్న హెచ్చు పలికి రాగస్వరూపమును వ్యక్తము చేయుచున్నది. దీనిని శుద్ధనిషాదముగ పట్టినచో అపస్వరమువలె తోచును. శుద్ధనిషాదమును ఎంత హెచ్చుగా పట్టవలెను అనునది సంప్రదాయమెరిగిన గురువులవల్లనే ఎరుగవలసి యున్నది ఇట్లే గుమ్మ కాంభోజి, ఆహిరి, సామంతము మొదలగు రాగములలో వచ్చు స్వరములు షట్శ్రుతులు, చతుశ్శ్రుతులు, శుద్ధములు అని చెప్పుటవలన, వ్రాయుటవలన ప్రయోజనముండదు. అవి సూచన మాత్రమే యనుకొని గురు ముఖత అభ్యసించినచో శ్రవ్యవిద్యయగు సంగీతము నందలి మాధుర్యములు తెలియును. సంప్రదాయములు నిలుచును.

హెజ్జజ్జి—రూపకం

ఎచ్చట చూచినాను యివిగో నీ సుద్దులే
అచ్చుగ నీదాసులే భాగ్యవంతు లందరు ॥ పల్లవి ॥

అన్నిటా జక్కని వాడవని నిన్ను నందరు —
వెన్న నీ దేవుల సిరు లెక్కడందురు
సన్నుతి నీ నుతుల నెంచగ లోకేశులందురు
పన్ని నీ కూతురు లోక పావని యందురు ॥ ఎచ్చట ॥

అట్టె నీచేతి చక్రము అతి ప్రతాపి యందురు
పట్టిన సంకు వేదాల పాఠ మందురు
జట్టిగ నీపానువు సర్వాధా (ధా)ర మందురు
వొట్టి నీ వాహనము దేవోపకారియందురు ॥ ఎచ్చట ॥

పరగ నీవున్నచోటే పరమపద మందురు
యిరవై (శ్రీ) వేంకటాద్రి యిక్కువందురు
మరిగి యలమేలుమంగ మగడవు నీవందురు
ధరనన్ను నీదాసాన(ను) దాసుడందురు ॥ ఎచ్చట ॥

అ : 24–246

ప. ప ప ద పా ప మ ॥ గ మ ప ద ప మ గ మ గ రి సా ॥
ఎ చ్చు ట చూ చి - ॥ న - - - - - - - - - - ను ॥

ధ ధ ధా స స రి గ రి ॥ స రి గ మ ప మ గ మా ॥
ఇ - వి గో నీ - - - ॥ సు - - - - - - ద్దు లే ॥

స స స ని ని ధ ధా ॥ ధ ధ స స రి గ రి ॥
అ చ్చు గ - నీ - - ॥ దా - సు లే - - - ॥

గ మ పా ప మ ద ద ప మ గ మ || ప మ గ రి స రి గ మ ||
భా - - గ్య - వం - - - తు - || లం - - ద రు - - - || ॥ఎచ్చట॥

చ. - ప ద ప ద సా || ని ని ద పా ప || మ మ గ గ రి గ మా ||
- అ న్ని ట - - || చ క్క ని వా డ || వ ని - - - ని న్ను ||

పా ద ప మ గ మ పా - || - మ మ ప ద నీ || ని ద దా ద ప పా ప మ మా ||
నం - - - - ద రు - || - నె న్న నీ - - || దే - - వు - ల సి - రు ||

గ మ ప ద ని ద ప మ గ రి గ మ || ప మ గా - - - ||
లె - - - క్క - డం - - - డు - || రు - - - - - ||

- ప ప ద ద ప ప మ || ప ద స ని ని దా ప ||
- స న్ను తి ని - - - || సు తు ల నెం - చ గ ||

- ప ద సా స || స రి గ రి రి సా ||
- లో - కే శు || లం - - - డు రు ||

స రి సా - - || ప ద సా స ని ని ద దా ప ||
ప న్ని నీ - - || కూ - - తు - రు - లో క ||

మ ప ద ని ద ప ప మ గ మ || ప మ గ రి స రి గ మ ప మ గ మ ||
పా - - - వ - - - ని - || యం - - - డు - - - రు - - - ||

ప. ప ప ద పా ప మ || గ మ ప ద ప మ గ మ గ రి సా ||
ఎ చ్చ ట చూ చి - || న - - - - - - - - - - ను ||

**అవతారిక :**

ఇందు నాయకుని అనుగ్రహము పొంది పరవశయైయున్న నాయికను చెలికత్తెలు ఎకసెక్కము చేయుచున్నారు. అందమగు నుపమానములతో అయ్యవారు అలమేలుమంగ పారవశ్యమును మధురముగా వర్ణించినారు. వెన్నెలలు గ్రోలెడి చకోరాలు వెన్నెలలు ఉమియు చున్నవట. జలజములను వెదకుకొనుచుపోవు తుమ్మెదలు తమలో తాము సన్నలు చేసికొనుచు జలజమునుండి దూరముగా జారుకొనుచున్నవట. ఇవి అన్నియు వేంకటేశ్వరుడు అలమేలుమంగను కలసినప్పుడు మరల మొదటి స్థితికి వచ్చుచున్నవట. ఇందు కవి సమయములను వ్యాద్వ్యంగ మముగా చమత్కరించుట గమనార్హము. ఇది పెద తిరుమలాచార్యులవారి రచన.

హిజ్జిజి—ఝంపె

వెగటాయనో కాక విరసమో తమలోన
చిగురుగైదువ వాడు చేసినట్టి మాయలో ॥ పల్లవి ॥

వెన్నెలలు గోలుగాక వేడుక జకోరాలు
వెన్నెల లుమియ జొచ్చె విధ మేటిదే
పన్నపు దుమ్మెదలెల్లా జలజమే చేరుగాక
సన్నల నొకటొకటి జారిన దేటిదే ॥ వెగటాయె ॥

జలజమును లతలెల్లా సరిదా జేకొనుగాక
జలముతా గుమ్మరించే జాడలేటికే
మెలుపు సంపెంగ పూవు మీద గాలిమించు గాక
పొలసి సంపెంగలోన బొడము నాగాలి ॥ వెగటాయె ॥

జక్కవలు జంటగూడి సమ్మతించుగాక నేడు
జక్కవ లొండొకటితో జరసీ నేమే
యెక్కువ శ్రీవేంకటేశు డింతితో గూడగనేడు
వక్కణించు దొల్లింటివలె నాయు గాలమూ ॥ వెగటాయె ॥

శ్రుం : 23–539

ప. స రి గా రి | గా మా మ || గ మ ప దా | ప మ పా ప ||
వె గ టా య | నో గా క || వి ర స మో | త మ లో న ||

ప ద స సా | ని ని ద ప ప || మ మ ప ద ప | మ గ రి సా ||
చి గు రు కై | దు వ వా - డు || చే సి న - ట్టి | మా - య లో || ॥వెగటాయ॥

చ. - ప ప ప మ | గ మ గ గ రి || - స రి గ రి | గా మా మ ||
- వె న్నె ల లు | గో లు గా - క || - వే డు క చ | కో రా లు ||

- గ మ ప ద | ని ద పా ప || మ గ రి గ మ ప మ | పా - - - ||
- వె న్నె ల లు | మి య జొ చ్చే || వి - ధ మే - - టి | దే - - - ||

- ప ద స స | స రి గా రి || స రి మ గ మ ప మ | గ రి సా స ||
- ప న్న పు తు | మ్మె ద లె ల్ల || జ ల జ మే - - - | జే రు గా క ||

- స రి స స | ని ని ద పా || - మ మ ప ద ప మ | గ మ ప మ గ రి సా ||
- స న్న ల నో | క టొ క టి || - జా రి న - - - | దే - - - టి - కి ||
॥వెగటాయ॥

**అవతారిక :**

ఇందలి నాయిక చతుర- నాయకుని మనోభావములను చక్కగా గుర్తెరిగి అతనిని మందలించి వశపరచుకొను నేర్పుగలది, గనుకనే "నీ మాయలు నాకు దెలుసు. నీవు యెవతెనో మనసునందు తలచుకొనుచు దూరముగా నున్నప్పుడు నీకు కోపము వచ్చినదేమో అనుకొనుట, పిలిచినప్పుడు నీవు రాకుండిన దానికి అర్థము. ఇంట నెవ్వతెయో కాచుకొని యున్నదేమో నాపై కోపముతో రాలేదని అనుకొందునా! తెలియని వారట్లు భావించినను భావింతురుగాని నాకు నీ వగవెల్ల దెలుసునులే. అలమేలుమంగనగు నేను నీకు ఆలినై యుండగా నిన్నెవ్వరు దక్కించుకొనగలరు. వేషాలుమాని రావయ్యా" అని ప్రణయ కోపమును వ్యక్తపరచుచు పిలుచుచున్నది.

హెజ్జజి — రూపకం

నాకు తెలుసుగా నీ నాటకాలెల్లా
యీ కడ నేమి సేసేవు యింటికి రావయ్యా ॥ పల్లవి ॥

తలపోత లోకతెపై దగిలి నీకు డగాను
పిలిచితే బలికేవా ప్రియముతోను
యెలమి నీ మాయలు యెరగని సతులెల్లా
అలిగి వున్నాడవంటా నటు వేడుకొందురు ॥ నాకు ॥

యెడయ కెవ్వతో యింటికేగ గాచుకుండగాను
వొడి వట్టితే వచ్చేవా వూరకేనీవు
అడరి నీ వోజ దెలియని వనితలెల్లాను
కడు బంతగాడవంటా కాళ్ళకు మొక్కుదురు ॥ నాకు ॥

అక్కున నలమేల్ మంగ ఆలై నీకు నుండగాను
దక్కేవా శ్రీవేంకటేశ తరుణులకు
యిక్కడ నన్నేలితివి యేడనైనా నింత వార్గు
చొక్కి తగరివంటా సుద్దులు చెప్పుదురు ॥ నాకు ॥

శృం : 20—522

ప. స రి గ మ ప మ || పా - - ద మ ప మ || గ మ ప ద ప మ గ మ ప మ గ రి ||
నా - కు తె లు సు || గా - - నీ - - - || నా - ట - - - కా - - - - - ||

ప మ గ రి సా - - || - ప ద స స సా || స రి గ రి సా స ||
తె - - - ల్లా - - || - ఈ - క డ నే || మి - సే - సే వు ||

- ప ద స ని ని ద ప || మ ప ద ప ప మ గ రి సా ||
- ఇం - టి కి - - రా || వ - - - - - - - య్యా || ||నాకు తెలుసు||

చ. - స రి మా మ గ || స రి గా - - || - గ మ ప ద ని ద ప ||
- త లపో త లొ || క తె పై - - || - త గి లి - నీ - - ||

ద ప మ ప గా - || - స రి మ గ గ రి || స రి గ రి గా ||
కుం - - డ గా - || - పి లి చి తే - - || వ లి కే - వా ||

- రి గ మ ప ద ప ద || ప మ ప పా - - || - ప ద స స రి గ రి ||
- ప్రి య ము తో - - - || ను - - - - - || - యొ ల మి నీ - - - ||

స రి మా గ రీ || - స రి గ మా ప మ గ మ | గ మ ప మ గ రి సా ||
మా - - య లు || - యె రు గ ని - - - - | స తు లె - - - ల్ల ||

- ప ద సా సా రి గ రి స || సా స ని ని ద ద ప ||
- అ ల గి వు - - - - || నా్న డ - వం - - ట ||

మ మ పా ద ని ద ప || మ ప ద ప ప మ గ రి సా ||
న ట చే - - - డు || కొం - - - - - డు - రు || ||నాకు తెలుసు||

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ. తన నాయకునితో "నీవు నాతో నాడినది, నాకడ చేసినవి సవతు లందరకును ఎట్లు తెలిసినది, నన్ను చూచి వారందరును నవ్వుచున్నారు. ఇట్లు మన విధముల నెల్ల వెల్లడి పరచుట నీకు బాగున్నదా" అని శ్రీ వేంకటేశ్వరుని ఎత్తిపొడుచుచున్నది.

**రాగ లక్షణము :**

మాళవిగౌళ ప్రాచీన రాగము. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళగా వ్యవహరింప బడుచున్నది. సంపూర్ణ సంపూర్ణము. ఇందు ఇతర వాగ్గేయకారుల రచన లక్కడక్కడ కనబడుచున్నవి. సంగీత విద్యా ప్రారంభకులకు యీ రాగమునందు సరళి, జంట, అలంకారములు మొదలగు ప్రారంభిక రచనలు చెప్పుట పరిపాటి. ఇట్లు చెప్పెడి పద్ధతి ఎప్పటి నుండి ప్రారంభమైనదో ఇదమిత్థముగా చెప్పుటకు వలనుకాకున్నది. కాని అన్నమాచార్యుల వారికి సమకాలీనులగు పురందర దాసులవారు ఈ బోధనా పద్ధతిని ప్రవేశపెట్టిరని కర్ణ పరంపరగా వినవచ్చుచున్నది.

**మాళవిగౌళ—త్రిపుట**

వింటివా వోయి నీ వీనులు చల్లగాను
నంటున మోములు చూచి నవ్వులు నవ్వేరు ॥ పల్లవి ॥

మచ్చికతో నీవు నన్ను మన్నించిన సుద్దులెల్ల
అచ్చవు సవతులెల్ల నాడు కొనేరు
పచ్చిగా నీవు నాతో బలికిన పలుకులు
రచ్చల నందరిలోన రాపు సేసేరు ॥ వింటివా ॥

గోరి కొననంటి నీవు కొసరి వేడుకొనగ
చేరి తమలో సన్నలు సేసుకొనేరు
సారెకు నీవు నాతో సరసములాడినవి
కోరి వెల్లా విరులుగా గురులు సేసేరు ॥ వింటివా ॥

ప.  ప రి గ మ ప మ || పా - - ద మ ప మ || గ మ ప ద ప మ గ మ ప మ గ రి ||
నా - కు తె లు సు || గా - - నీ - - - || నా - ట - - - కా - - - - - ||

ప మ గ రి సా - - || - ప ద స స సా || స రి గ రి సా స ||
తె - - - ల్లా - - || - ఈ - క డ నే || మి - సే - సే వు ||

- ప ద స ని ని ద ప || మ ప ద ప ప మ గ రి సా ||
- ఇం - టి కి - - రా || వ - - - - - - - య్యా ||      ||నాకు తెలుసు||

చ.  - స రి మా మ గ || స రి గా - - || - గ మ ప ద ని ద ప ||
- త ల పో త లో || క తె పై - - || - త గి లి - నీ - - ||

ద ప మ ప గా - || - స రి మ గ గ రి || స రి గ రి గా ||
కుం - - డ గా - || - పి లి చి తే - - || ప లి కే - వా ||

- రి గ మ ప ద ప ద || ప మ ప పా - - || - ప ద స స రి గ రి ||
- ప్రి య ము తో - - - || ను - - - - - || - యె ల మి నీ - - - ||

స రి మా గ రీ || - స రి గ మా ప మ గ మ | గ మ ప మ గ రి సా ||
మా - - య లు || - యె రు గ ని - - - - | స తు లె - - - ల్ల ||

- ప ద సా సా రి గ రి స || సా స ని ని ద ద ప ||
- అ ల గి వు - - - - || న్నా డ - వం - - ట ||

మ మ పా ద ని ద ప || మ ప ద ప ప మ గ రి సా ||
న ట చే - - - డు || కొం - - - - - దు - ఢు ||      ||నాకు తెలుసు||

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ. తన నాయకునితో "నీవు నాతో నాడినది, నాకడ చేసినవి సవతు లందరకును ఎట్లు తెలిసినది, నన్ను చూచి వారందరును నవ్వుచున్నారు. ఇట్లు మన విధముల నెల్ల వెల్లడి పరచుట నీకు బాగున్నదా" అని శ్రీ వేంకటేశ్వరుని ఎత్తిపొడుచుచున్నది.

**రాగ లక్షణము :**

మాళవిగౌళ ప్రాచీన రాగము. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళగా వ్యవహరింప బడుచున్నది. సంపూర్ణ సంపూర్ణము. ఇందు ఇతర వాగ్గేయకారుల రచన లక్కడక్కడ కనబడుచున్నవి. సంగీత విద్యా ప్రారంభకులకు యీ రాగమునందు సరళి, జంట, అలంకారములు మొదలగు ప్రారంభిక రచనలు చెప్పుట పరిపాటి. ఇట్లు చెప్పెడి పద్ధతి ఎప్పటి నుండి ప్రారంభమైనదో ఇదమిత్థముగా చెప్పుటకు వలనుకాకున్నది. కాని అన్నమాచార్యుల వారికి సమకాలీనులగు పురందరదాసులవారు ఈ బోధనా పద్ధతిని ప్రవేశపెట్టిరని కర్ణ పరంపరగా వినవచ్చుచున్నది.

మాళవిగౌళ—త్రిపుట

వింటివా వోయి నీ వీనులు చల్లగాను
నంటున మోములు చూచి నవ్వులు నవ్వేరు ॥ పల్లవి ॥

మచ్చికతో నీవు నన్ను మన్నించిన సుద్దులెల్ల
అచ్చవు సవతులెల్ల నాడు కొనేరు
వచ్చిగా నీవు నాతో బలికిన పలుకులు
రచ్చల నందరిలోన రాపు సేసేరు ॥ వింటివా ॥

గోరి కొననంటి నీవు కొసరి వేడుకొనగ
చేరి తమలో సన్నలు సేసుకొనేరు
సారెకు నీవు నాతో సరసములాడినవి
కోరి వెల్లా విరులుగా గురులు సేసేరు ॥ వింటివా ॥

కందువ నీవు నన్ను గాగిట గూడినట్టి
పొందులు యెలుగుకెత్తి పొగడేరు
అందరి శ్రీవెంకటేశ అంకెలు నీ వేలినది
విందుల వేడుకలతో వెలయించేరు ॥ వింటివా ॥

శ్రం : 19—35

ప. - - స | స ని ద పా || మా ద ప మా - గ | మా పా ||
- - మి | టి - - వా || వో - - - - - - | యి నీ ||

- - గ మ | ప ద ప మ గ మ గ రి || సా రి స నీ | స రి గ రి గ మ ప ద ||
- - వీ - | ను - - - లు - - - || చ - - - | ల్లి - - - గా - - - ||

నీ సా | స ని సా రి స ని సా ని || ద ప ద | ప మ ప ప గ ||
ను నం | టు - - - - నా - - || మో - ము | లు - చూ - - ||

మా గ మ | ప ద ని స ని ద ప మ || గ మ ప మ గ రి | స రి గ రి గ మ ప ద ||
చి న - | వ్వు - - - లు - - - || న - - - - - | వ్వే - - - - - - - ||

నీ స | స ని ద పా ||
రు విం | టి - - వా ||

చ. - - మ | మ మ మా || ద ద ప మ గ మ | ప మ గ రి సా రి స ||
- - మ | చ్చి క తో || నీ - - - వు - | న - - - న్ను - - ||

రి స రి | గా మా ప మ || గా రి | సా రి ని సా ||
- మ - | న్నిం చి న - || సు ద్దు | లె - - ల్లి ||

- - స | ప ప మ గ మా || గ మ ప ద నీ | ద ప ప మ ||
- - అ | చ్చు - - - పు || స - వ - - | తు - లె - ||

గా గ మ | ప ద ప మ గ రి స రి || గా మ | పా - - ||
ల్లి ఆ - | డు - - - కొ - - - || నే - | రు - - ||

- - మ | ప ప మ గ మా || ద ప దా | ద ని సా ||
- - ప | చ్చి - - - గా || నీ - వు | నా - తో ||

- - స రి | గ మ గ రి సా || స ని ప దా - | నీ సా ||
- - ప లి | కి - - - న || ప - - లు - | కు లు ||

- - స రి | గ మ గ రి సా || సా స ని ప | ద మ ప గ ||
- - ర - | చ్చ - - - ల || నం ద - - | రి - లో - ||

మా గ మ | ప ద ని స ని ద ప మ || గ మ ప మ గ రి | స రి గ రి గ మ ప ద ||
న రా - | పు - - - జే - - - || - - - - - - | రు - - - - - - - ||

ని స | స ని ద పా ||
- విం | టి - - వా ||

**అవతారిక :**

ఇందలి నాయిక జాణ, స్వీయ. నాయకునికి తనయందు గల మక్కువను మెచ్చుకొనుచు, అతని దక్షిణ నాయకత్వమును ఖండిచుచు, "నీవు నాయందు మక్కువ చూపుచునే వేరొకతె ఇచ్చిన కానుక అందుకొనుచున్నావు. కొప్పుదువ్వి నన్ను మచ్చిక చేసుకొని, నాతో నుండి మరి యొకతె చేసెడి మట్టెల చప్పుడు నాలకించుచున్నావు. ఓ శ్రీ వేంకటేశ్వరుడా! అనలు బెట్టుకొని ఆప్యాయతలు చూపి నన్ను లాలించుచు వేరొకతెను మోము అటు త్రిప్పి చూచుచున్నావు. నీ యీ చేతలకు మనసు నొచ్చి గసరు కొన్నానే గాని నీ యందు నాకు కోపమున్నదా" అని నాయకుని లాలించుచున్నది

మాళవిగౌళ—త్రిపుట.

కోరి నీపై ద్రొల్లి నాకు గోప మున్నదా
ఆ రీతి అట్టు సేయగా నంటి నింతే కాక ॥ పల్లవి ॥

ఆన లేల పెట్టేవు అంత వేడు కొన నేల
కానీ వయ్యా నీ మాటకు గాదనేమా
నే నిట్టె మాటాడగాను నేరుపుతో నాపెచేతి-
కాను కందు కొన గాను కసరితిగాక ॥ కోరి ॥

కొప్పు దువ్వి యెంత నన్ను కొస రొడ బరచేవు
చెప్పి నట్టల్లా నీకు జేయ కుండేనా
యిప్పుడు నా వద్ద నుండి యెలమి నాపె మట్టెల
చప్పుడాల కించ గాను జరసితి గాక ॥ కోరి ॥

పీడెమిచ్చి చేయి నాపై వేసేవు శ్రీవేంకటేశ
కూడితి విందులకు వియ్యకొన వలదా
జాడ తోడ నన్నేలి సంగడి నున్నాపె మోము
చూడగా నందుకు నిట్టె సొలసితి గాక ॥ కోరి ॥

శృం : 25–180

ప. సా రి । గా మా ॥ గ మా పా - । ద ప ప మ పా ॥
కో రి । నీ పై ॥ దో - ల్లి - । నా - - - కు ॥

గ మ ప మ । మ గ రి ప మ గ రి ॥ సా - । రి స ప ధ నీ ॥
కో - - వ । ము - - న్న - - - ॥ దా - । - - - - - ॥

సా గ మ । పా దా ॥ ని సా । స ని దా ప మ ॥
- ఆ - । రీ తి ॥ ఇ ట్టు । సే - - య - ॥

గా గ మ । ప ద ని ద ద ప ప మ ॥ ద ప ప మ మ గ । ప మ గ రి సా ॥
గా నం - । టి - - - నిం - - - ॥ తే - - - - - । గా - - - ని ॥

సా రి । గా మా ॥
కో రి । నీ పై ॥

చ. - - ప । ప ప మ గ మా ॥ ప పా । ద ప ప మ ప ద ప మ ॥
- - ఆ । న - - - లే ॥ ల - । ఔ - - - ట్టే - - - ॥

పా గ మ । ప ద ని దా ॥ ద ని సా స ని । దా పా ॥
వు అం - । త - - వే ॥ డు - కో న - । నే ల ॥

- - గ మ । ప ద ని ద ప ॥ ప ప మ గ మ । గ రి గ మ ॥
- - కా - । నీ - - వ య్యా ॥ నీ - - - - । మా - ట - ॥

పా గ మ । ప ద ప మ గ మ గ రి ॥ స రి గా । మా పా ॥
కు కా - । ద - - - నే - - - ॥ మా - - । - - ॥

- - గ మ । పా ద ప ॥ ప ప ద । నీ సా ॥
- - నే - । ని ట్టే - ॥ ఘూ టూ - । ధ గా ॥

సా స రి̇ । గ̇ గ̇ మా ॥ గ̇ రీ । ప̇ మ̇ గ̇ రి̇ సా ॥
ను నే - । రు పు తో ॥ నా పె । చే - - - తి ॥

- - ప ద । ని̇ స̇ స̇ ॥ స̇ ని రి̇ స̇ ని స̇ । స̇ ని దా పా ॥
- - కా - । ను కం దు ॥ కో - న - - - । గా - - ను ॥

పా గ మ । ప ద ని ద ప ॥ ప మ గ మ గ రి । ప మ గ రి సా ॥
- క సి । రి - - తి - ॥ గా - - - - - । - - - - క ॥

॥ కోరి నీపై ॥

**అవతారిక :**

ఇందలి నాయిక స్వీయ, ముగ్ధ, చతుర, తన చేష్టలకు నాయకుడు 'కోపించుకొనె నేమో' అని చెలికత్తెతో చెప్పుకొని బాధపడుచున్నట్లు నటించుచున్నది సిగ్గుల భరిణయగు యీమె నాయకునికై వెన్నెల బయట వేగించు చున్నదట. అతనిని యింటికి రావద్దనెనట, చిప్పల రెప్పల జంకించినదట. దగ్గర చేరక అతడాడిన మాటలకు బదులీయక పరవశాన నుండిన యీమెను ఆతడు లాలించి యేలించిన విధమును తలచుకొని చెప్పుకొని ఆనందించుచున్నదని'' అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

మంగళకైశిక రాగము భాషాంగము. రెండు మధ్యమములు సందర్భానుసారముగ నిందువచ్చును. వెంకటమఖి సంప్రదాయమున చ్యుత మధ్యమము యీ రాగమున చెప్పినను ఏలనో దీనిని భాషాంగ మనలేదు. మాయామాళవ గౌళ జన్యముగా ఇప్పుడు దీనిని పరిగణింప వలసియున్నది. అతి ప్రాచీన రాగమగు ఈ మంగళకైశిక 72 మేళకర్తల పద్ధతి రాకమునుపే ఎంతో ప్రచారముననున్నది.

స రి గ మ ప మ ద ని స - స ని ద ప మ గ రి స అను ఆరోహణావరోహణములు కలిగియున్నను 'గ మ మ² మా మ² గ రి సా - స ని రి గ మా'- 'మ గ ద ప స ని రి స' అనునవి విశేష ప్రయోగములుగా గుర్తుంచుకొన వలయును. ఇచ్చట ఒక విషయమును మనము చెప్పుకొనవలసియున్నది. మేళకర్తల పద్ధతికి పూర్వముండిన రాగములు చాల వరకు ఆరోహణావరోహణములపై గాక కొన్ని ముఖ్యమైన స్వర సందర్భములుగల రాగపు ఛాయలతోనే ఎక్కువగా గుర్తింప బడుచుండెడివేమోనని అనుకొనవలసి యున్నది. ఇందుకు మంగళకైశిక, ఆహిరి, ఘంటాసైంధవి, నవరోజు, మారువ, ద్విజావంతి, గౌరిపంతు మొదలగు రాగముల స్వరూపములే ఉదాహరణములు.

**మంగళకైశిక — త్రిపుట**

తన్ను బాసి నేనింత దంటనట యీ
వెన్నెల బాయిట రేయి వేగుటింత చాలదా ॥ పల్లవి ॥

ఇంటికి రాకు మని నే నంటినట చూడవే
అంటుగాక వున్నదాన నంటినో యేమో
కంటికి నిద్దుర రాక కాకలనే పొద్దువోక
వొంటి నే బానుపున రేయుంటి నింత చాలదా ॥ తన్ను ॥

అప్పటి దగ్గరి నే రానైతినట చూడవే
కొప్పు జారి సిగ్గుతోడ గొంకితి నేమో
చిప్పల రెప్పల జంకించితినట చూడవే
చెప్పరాని మాట నీతో జెప్పుటింత చాలదా ॥ తన్ను ॥

ఊరకే మాటాడక నే నుంటినట చూడవే
ఆరడి పరవశాన నైతినో యేమో
గోరి కొన దను దక్కగొంటినట చూడవే
యేర వేంకటేశ నాతో నింత నీకు జాలదా ॥ తన్ను ॥

శృం : 12—38

ప. - - గ । మా దా ॥ ని దా । ద మ పా ॥
- - త । న్ను బా ॥ సి నే । నిం - త ॥

- - గ । మా గ మ మ మ ॥ మా మ గా - । రీ సా ॥
- - దం । ట స - - - ॥ ట - - - । యీ - - ॥

సా స ని । ధా రీ ॥ రి గ రి । రీ రీ ॥
- వె - । న్నె ల ॥ బా యి - । ట రే ॥

రీ గ మ । దా ద మ ॥ గ మ మ మ । మా - మ గా ॥ రీ
ఝు వే - । గు టిం - ॥ త - - - । చా - - ళ ॥ ధా ॥తన్ను॥

చ. - - మ గ | మా ద ప దా || ద మ పా | ప ప మ గ మా ||
- - ఊ - | ర - - కే || మా - - | టా - - - - ||

మా రి గ | మా - మ గ రి || స ని ధ ధా - | ని స రి గ ||
క నే - | నుం - - - టి || న - - ట - | చూ - డ - ||

మా గ మ | దా ని ని దా || ద ద మ | పా ప ప మ గ ||
వే అ - | ర డి - - || ప ర - | వ శా - - - ||

మా గ | రి గ రీ సా || మ గ మా | దా ద మ పా ||
న నై | - - - తి || నో - - | ఏ - - మో ||

- - గ మ | దా ని ని దా || స స ని రీ | సా సా ||
- - గో - | రి కో - న || ద ను - - | ద క్క ||

- - స రి | గ మ గ రి స స || స ని దా | సా - - ||
- - గొం - | టి - - - న ట || చూ - డ | వే - - ||

- - స రి | గ మ గ రి స స || స ని దా | రీ రీ ||
- - ఏ - | ర - - - వెంక || టే - శ | నా తో ||

సా - | స ని దా ద మ || పా - | మ గ మా మ మ గా || రి స
నిం - | త - - నీ - || కు - | చా - - ల - - || దా - ||తను||

**అవతారిక :**

తన నాథునితో తాను సంతోషముగా నుండిన వేళ తొంగి చూచి, తమ చర్యలను గమనించి, తాము చెప్పుకొను సుద్దులను విని, ఈర్ష్యను పెంచుకొను సవతితో 'నాథుడు నన్ననురాగముతో ఆదరించుచున్నాడు. నాపై ప్రేమను వ్యక్తము జేసి లాలంచుచున్నాడు. దంపతుల మధ్య జరుగు నిట్టి తెరలేని పనులు చూడ వచ్చునా? ఇట్టి సమయములలో ప్రేమికు లాడుకొను పలుకులు వినవచ్చునా? మా యిరువురి అనురాగమును, మందమిరియాలు చల్లియు, ఉప్పు పొంగించియు, పసుపునూరియు విరుపులు పెట్టుటకు ప్రయత్నించినచో నీ కేమి వచ్చునే!' అని నాయిక యగు అలమేలు మంగ చెలిని ప్రశ్నించుచున్నది.

**మంగళకైశిక — త్రిపుట**

తగ వెఱగ వద్దా తమకించి చెనకేవు
మగువల తలనేల మహి బూరి గట్టేవే ॥ పల్లవి ॥

కందువ నాతడు నాతో గతలు చెప్పగాను
సందుసుడి నీ మాటలు చవులౌనటే
యెందును మా వలపులు యేకములై యుండగాను
మంద మిరియాలు చల్ల మరియేటికే ॥ తగ ॥

ఇంగితాన నిద్దరము నే కతములాడగాను
తొంగి చూచి యెవ్వతెకు దొరలనేలే
చెంగటనే మా పొందు చెట్టు కట్టి వుండగాను
పొంగి పొంగి వుప్పువేసి పొత్తు గలయనేలే ॥ తగ ॥

చేరి శ్రీవేంకటేశుడు కోరి నాకు విడె మీగా
పోరచి వారు చెయి చాచ బొసగునటే
మేరతో నన్నేలె నలమేలు మంగ నైన దాన
సారె నడుమ బసపు నూర నీ కేటికే ॥ తగ ॥

శృం : 24-247

ప. - - స రి | గ గ మా || మా - | గ మ మ మ మా మ గ ||
- - త గ | వె అ గ || వ - | ద్దా - - - - - - ||

గా మ గ | మా ద ప పా ద మ || మ మ గ ప మ మ గ | రీ సా ||
- త మ | కిం - - చి - - || చె - - న - - - | కే వు ||

సా స ని | ధా రీ || గ గ రి గ | మ మ మా ||
- మ గు | వ ల || త ల - - | నే - ల ||

- - మ గ | రి గ మ మ మా మ గ || గ రి రీ | గా ప మ గ రి రీ || సా
- - మ హిం | బూ - - - రి - - || గ - - | ట్టే - - - - వే || -

చ. - - గ మ | దా ని ని దా || దా ద మ | పా ప ప మ గ ||
- - కం - | దు వ - - || నా త - | డు నా - - - ||

మా గ మ | దా ని ని దా || ద ద మ | పా పా ||
తో క త | లు చె - - || ప్ప - - | గా ను ||

- - మా | మ గ మ గ ప మ గ రి || సా - | స ని ధా రి స ||
- - సం | దు - - - సు - డి - || ని - | మా - - ట - ||

రీ స రి | గ మ ద మ దా || ద మా | పా - - ||
లు చ - | వు - - - లా || న - | చే - - ||

- - గ మ | ద మ ద ని || సా - | స ని ద రి స ||
- - ఎం - | దు - ను - || మా - | వ - ల పు - ||

రీ స రి | గ గ మా || మ గ రి రి గ రి | స ని ద ని సా ||
ళు ప - | క ము లై || యుం - ఢ - - - | గా - - - ను ||

స్పా ద | రీ స స || స నిదద | మ పా - ||
- మం | దీ మి రి || యా - - లు | చ - - ||

పా మ గ | మా - మ ద మ గ || గ రి రీ | గా ప మ గ రి సా ||
ల్ల మ - | రి - - - - - || యే - - | టి - - కి - - ||

ని స రి గ స రి | గ గ మా ||
- - - - త గ | వె ఆ గ ||

**అవతారిక :**

జీవుల భారమును భరించు వాడును, శత్రువులు మిత్రులు అను భేదమును పాటించక సర్వ జీవులకును పరమ బాంధవుడై యుండెడి వాడును, అగు పరమాత్ముని గురించి చెప్పుచు 'ఆయుధములు చేత గలిగినచో నిర్భయముగ నుండ వచ్చును. అట్లే అనంతుడగు ఆతనిని నమ్మినచో ఇంక భయమేల? సామాన్య మానవుడగు ఒక రాజుని కొలిచి, పొగిడి ఇహము నందు మానవులు సుఖజీవనమును సాధించుచున్నారు. భువనరక్షకుడగు ఆతనిని వేడినచో ఏమి కొదువ యుండును? శ్రీ వేంకటపతిని సేవించి, మనలను ఆతనికి అర్పించుకొనినచో నిశ్చింతగా మోక్షమును పొందవచ్చును గదా' అని అయ్యవారు చెప్పుచున్నారు.

మంగళకైశిక—ఆది

భారకు డతడే బంధువు డతడే
చేరితి మతనినె చెంచెలమేలా ॥ పల్లవి ॥

చెనకు నాయుధము చేతగలిగితే
ఘన నిర్భయుడై కడగినట్ల (ట)
అనంతాయుధు డాతుమ నుండగ
వెనుకొని యెందుకు వెఱవగ నేలా ॥ భార ॥

భువినొక రాజును బొందుగ గొలిచిన
యివల నచ్చికం బెరగడట
భువన రక్షకుడె పొదిగొని యేలగ
వివరించి యొరుల వేడగ నేలా ॥ భార ॥

తోవ నిధానము దొరకిన యప్పుడె
యే విధములు మరి యెంచడట
శ్రీ వేంకటపతి చేకొని కావగ
భావన నితరోపాయము లేలా ॥ భార ॥

ప. స రి మ మ మ మ మ గా | మ గ మ ద | ద ప పా ||
భా - ర కు డ త త డే | బం - ధు వు | డ త డే ||

దా స ని ద ద మ మ | గ మ మ మ | గా రి స ||
చే రి తి మ ప ని ని | చెం - చె ల | మే లా - || ||భారకు||

చ. ప ప ద ద పా ప మ | గ మ మ మ | గ రి రి స ||
భు వి నొ క రా జు ను | పొం - దు గ | గొ లి చి న ||

స ని ధ రీ రి సా | స రి మ మ | గా రి స ||
యి వ ల న చ్చి శం | బె రు గ డ | ట - - ||

స మ గ మ ద ద మ మ | ద ద ని ని | దా ద ప ||
భు వ న ర - క్ష కు డు | పొ ది గొ ని | యే ల గ ||

స స నీ ద ద ప ప | మ గ మ మ | గా రి స ||
వి వ రిం చి యొ రు ల | వె ర వ గ | నే లా - || ||భారకు||

**అవతారిక :**

'శరణని శ్రీ వేంకట నాధుని వేడుకొనుచు' తొల్లి యితడే గజ రాజును రక్షించెను. వేదమయుడును ఇతడే! దశ దిశల యందును నిండియున్న పరిపూర్ణుతడిడే! జీవులకు ఇహ పరములయందు అధిపతి ఇతడే ! దుష్ట దైత్యులను సంహారించి, శిష్టులను రక్షించి సుఖ శాంతులతో భక్తులకు సర్వ సంపదలనిచ్చెడి శ్రీకాంతుడగు దాత ఇతడే ! ఈతనినే శరణు వేడు చుంటిమి' అని తన మనసునకు అయ్యవారు చెప్పుకొనుచున్నారు.

**రాగ లక్షణము :**

మలహరి రాగము ప్రాచీనము. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళ జన్యము - స రి మ ప ద స - స ద ప మ గ రి స అనునవి ఆరోహణా వరోహణములు. మత భేదములు లేక లక్షణకారులందరును ఒకే విధముగా చెప్పిన రాగములలో నిది యొకటి. మహానుభావులైన పురందర దాసుల వారి పిళ్లెయారి గీతములు ఇప్పటికిని వాడుక యందున్నవి. ఇటీవలి వాగ్గేయకారులు యీ రాగమునందు రచనలు చేసినట్లు కాన వచ్చుట లేదు. ఈ రాగమునందు తాళ్ళపాక వారి రచనలు అనేకములు కనబడుచున్నవి. ముద్దుస్వామి దీక్షితులవారి రచన మాత్రము ఒకటి ఇప్పుడు పాడుచున్నారు.

**మలహరి — ఆది**

శరణం బితడే సకలము నాకును
వెరవున మనసా వెతకవో యితని ॥ పల్లవి ॥

అభయం బొసగెటి యతడెవ్వడు మును
ఇభ రక్షకు డతడెవ్వడు
ఉభయ విభూతుల కొడయం డెవ్వడు
ప్రభువతడే నా పాలి దేవుడు ॥ శరణం ॥

శరణాగతులకు సరిదాపెవ్వడు
యిరవుగ శ్రీపతి యెవ్వడు
అరి దుష్ట దైత్య హంతకు డెవ్వడు
వరమును నతడె నా పాలి దేవుడు ॥ శరణం ॥

ఆది శంఖ చక్రాయుధు డెవ్వడు
యే దెస బూర్ణుడెవ్వడు
వేదమయుడు శ్రీ వేంకటపతియై
పాదాయ నిదె నా పాలిదేవుడు ॥ శరణం ॥

అ : 11–108

ప. స రి మా మ ప ప మ | ప ద ప మ | గా రి స ||
శ ర ణం బి త డే - | స క ల ము | నా కు ను ||

స రి మ మ మ ప ప మ | ప ద ప మ | గా రి స ||
వె ర వు న మ న సా - | వె త క వో | యి త ని || ||శరణం||

చ. మ మ పా ద ద ప ప | మ మ పా | ద ద ṡ ṡ ||
అ భ యం బొ స గె టి | య త డె | వ్వ డు ము ను ||

ṙ ṡ ṙ ġ ġ ṙ ṙ | ṡ ṙ ṁా ġ ṙ | ṡా - - ||
ఇ భ ర క్షకు డ త | డె - - - వ్వ | డు - - ||

ṡ ṡ ṙ ṙ ṡా ద ద | ప ప దా | పా మ మ ||
పు భ య వి ఘా తు ల | కొ డ యం | డె వ్వ డు ||

రి మ ప ప ద మ పా | మా ప మ గ రి | రి గ రీ రి స ||
ప్రభు వత డే - నా | పా - - ల దే | - - వు డు - || ||శరణం||

**అవతారిక :**

ఇందు అయ్యవారు శ్రీ వేంకటేశ్వరుని కొన్ని విచిత్రములగు సందేహములను తీర్చుమని అడుగుచున్నారు. "పంచేంద్రియములతో పాటు పుట్టిన ఈ శరీరమును, ఇంద్రియముల నుండి వేరు చేయుట యెట్లు? ఒక దాని వెనుక ఒకటి పెంపొందించుచు, పోషించుకొనుచు వచ్చిన ఆశలను మనసు నుండి ఎట్లు దూరము చేయుట? నీటియందు నివసించు చేపలను నీరు వదలి పొమ్మనుట యెట్లు? తల్లి నుండి బిడ్డలను వేరు చేయుట యెట్లు? నాకు తెలియకున్న దయ్యా! నా మనసునందే పరమాత్మవై నీవు వెలుగుచు నుండగా నాకు పాపములెట్లు తగులును? ఇదంతయు విచిత్రముగా నున్న" దని చెప్పుకొనుచున్నారు.

**మలహరి — ఆది**

దేవ యీ తగవు దీర్చవయ్యా
వేవేలకు నిది విన్నపమయ్యా ॥ పల్లవి ॥

తనువున బొడమిన తతి నింద్రియములు
పొనిగి యెక్కడికి బోవునయా
పెనగి తల్లికడ బిడ్డలు భువిలో
యెనగొని యెక్కడి కేగుదురయ్యా ॥ దేవ ॥

పొదుగుచు మనమున బొడమిన యాసలు
అదన నెక్కడికి నరుగునయా
వొదుగుచు జలముల నుండు మత్స్యములు
పదపడి యేగతి బాసీనయ్యా ॥ దేవ ॥

లలి నొకటొకటికి లంకెలునివే
అలరుచు నేమని యందు నయా
బలు శ్రీ వేంకటపతి నా యాత్మను
గలిగితి వెక్కడి కలుషములయ్యా ॥ దేవ ॥

ఝ : 5–260

అ. మా పద సా దద | పమగరి | మా పా ||
దే వా - యీ తగ | వుదీ - ర్చ | వయ్యా ||

మా పా దదపప | మా ప ప | దద పా ||
వే వే లకునిది | విన్నప | మ - య్యా || ||దేవా||

చ. సరిమమగగరిరి | సరిగా | రిరిరిస ||
తనువున బొడమిన | తతినిం | ద్రియములు ||

సరిమమా పపమ | మపదద | పా - - ||
పొసగి యెక్కడికి | పో - వున | యా - - ||

దసంసంసరింరింరింసం | సందదసం | సంరింరిం ||
పెనగి త - ల్లికడ | బి - డ్డలు | భువిలో ||

సంసంరింగంరింరింసంసం | దదపమ | పా పా ||
యెనగొని యె - క్కడ | కే - గుదు | రయ్యా || ||దేవా||

**అవతారిక :**

"పక్వమునకు వచ్చిరాని స్థితియందున్న మనసునకు నిలకడ లేకున్నది. పదికోట్ల జన్మముల యందు చేసిన పాపములైనను క్షణములో పోగొట్టగల శక్తిగల శ్రీ వేంకటనాథుని చేరినను నిశ్చలుడను కాలేకున్నాను. సంసారకూపముల యందు పడి పొరలెడి జీవులు శరణనిన తృటిలో ముక్తిని ప్రసాదించగల వాడగు వేంకట విభుని చేరియు, కొలువ లేకున్నాను" అని అయ్యవారు చెప్పుకొనుచున్నారు.

మలహరి — రూపకం

పండియు బండదు చిత్తము పరిభవమెడయదు కాంక్షల
యెండలనే కాగితి మిక నేలాగో కానీ ॥ పల్లవి ॥

పదిగోట్లు జన్మంబుల బాయని కర్మపు బాట్లు
వదలక వొక విషయములో వడి దీరుచు నితడు
చెదరని నిజదాసులకును శ్రీహరి మాకిపు డ తక
హృదయము నిలువదు చంచల మేలాగో కాని ॥ పండియు ॥

కూపపు బహు నరకంబుల కోట్ల సంఖ్యల బొరలేటి
పాపములొక నిముషములో బాపగ గలడితడు
కాపాడగ దలచిన యా కమలాపతినే మీతని
యేపున గని మనలేమిక నేలాగో కాని ॥ పండియు ॥

జడిగొని యెన్నడు బాయని సంసారపు బంధంబుల
విడుమని వొక నిముషములో విడిపించును యితడు
కడు గొలిచిన వారికి వేంకటపతి నే మీతని
నెడయక కొలువగ లేమిక నేలాగో కాని ॥ పండియు ॥

అ : 5—177

ప. పా ద ద పా || ప మ గా రి స || స రి ప మ గ గ ||
పం డి యు పం || డ దు చి త్త ము || ప రి భ వ మె డ ||

రి రి సా స స || స ధ స స రీ || గా రి రి స రి ||
య దు కాం తు ల || యెం - డ ల నే || కా గి తి మి క ||

మా గా రీ || మా పా - - ||
నే లా గో || కా నీ - - || ||పండియు||

చ. ప ధ పా ప మ || గా రీ స స || స రి మ మ పా ||
వ ది కో టు ల || జ న్మం బు ల || బా - య ని క ||

మ ప దా పా || మ ప ద స స స || స స రి రి సా ||
ర్మ పు బా ట్లు || వ ద ల క వో క || ని మి ష ము లో ||

స స రి స ద ప || మ మ పా - - || ప ద స స స రి ||
వ డి దీ - రు చు || ని త డు - - || చె ద ర ని ని జ ||

రి మ గ గ రి రి || స రి మ మ గా || రి రి సా స స ||
దా - సు ల కు ను || శ్రీ - హ రి మా || కి పు డం త క ||

మ ప ద స ద ద || మ ప ద ద ప ప || మ గ రి మ పా ||
హృ ద య ము ని లు || వ దు చం - చ ల || మే - లా - గో ||

దా పా - - ||
కా నీ - - || ||పండియు||

**అవతారిక :**

"నాధుని యందు నీకు ప్రేమ యుండితే అన్నియు నీకే ఇష్టములగును. నీవు ఆ ప్రేమను కనబరచునప్పుడు కొసరి కొసరి మాటాడుట, అతని భావములను చెప్పించుకొనుట, నీవు కొంచెము చేవిడుట, అతనిచే తక్కినది చేయించుట, మొదలగునవి నేర్చుకొని, అతని వలన ఆనందమును పొందవే. నా మాట మన్నించితివి గనుక నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుడు నిన్నేలినాడు," అని చెలిమికత్తె నాయికను మెచ్చుకొనుచున్నది.

**రాగ లక్షణం :**

పూరబి అని తాళ్ళపాక వారి రచనలయందు కనబడుచున్న రాగమే పూర్వియై యుండునని తోచుచున్నది. పూర్వి భాషాంగముగా కొందరు చెప్పియున్నారు. పూర్వి యిప్పుడు ఉత్తర హిందుస్తానమున ప్రచారములోనున్నది. ఇందు రెండు మధ్యమములు వచ్చుచుండుట వలన ఇది భాషాంగము. స రి గ మ ద ప ద ని స । స ని ద ప మ గ మ గ రి స । అనునవి ఆరోహణావరోహణములు. ఇందు ఇతర వాగ్గేయకారుల రచనలు ప్రచారమునందు కనబడుటలేదు. దీనిని ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయామాళవగౌళ జన్యముగా కొందరు చెప్పియున్నారు. కర్నాటక సంగీత గమక వరికాదులతో పాడి చూచినచో రాజ స్వరూపము కొంత వరకు అవగాహన మగుటకు వీలన్నది. ఇందు 'ప మ గా' అనునప్పుడు ప్రతి మధ్యమమును విడిగా 'మ గ రి స' అనునప్పుడు శుద్ధ మధ్యమము పలుకు చున్నవి.

**పూరబి—రూపకం**

వెగ్గళించ జూచితేను వేసటలౌను అందు
వెగ్గళ మైతే వలపు వెల్లి విరిసీని ॥ పల్లవి ॥

సగము మాటాడవే వో సతి నీ వాతనిచేత
సగముదెలిసి కొనే జాడ యెట్టిదో
తగులు గొంత చూపవే తరవాత నాతనికి
దగులు గలిగితేను తమకించీనిపుడు ॥ వెగ్గళించ ॥

మొదల గొంత నవ్వవే మోహానకు నీ కతడు
మొదలు దుదా గలితే ముంచి నవ్వీని
యెదురు చూడవే యొక మెదురుకట్ల దాను
యెదురు చూచీ రతికి నితవు గలితేను ॥ వెగ్గళించ ॥

చేయి చాచవే నీవు (శ్రీ) వేంకటేశుడు రేడో
చేయి వట్టి తీసి నీ సిగ్గు వాసీని
యీ యడనుండి కూడితి విన్నిటా నా మాట విని
యీ యెడనే ఆతడు నిన్నిదివో మన్నించె ॥ వెగ్గళించ ॥

శ్రృం : 19–536

ప. - స రి గా మ ॥ ద ని సా స ని దా పా ప మ ॥ గ మ ని ని దా పా ప మ ॥
- వె గ్గ ళిం చి ॥ చూ - - చి - తే - ను - ॥ వే - స - ట లా - - ॥

గ మ గా రి స ॥ - సా స ని ధ నీ ॥ స రి స రి గా - - ॥
- - ను అం దు ॥ - వె గ్గ - ళ మై ॥ తే - - - - - - ॥

గ మ ద ని స ని ద ని ద ప ॥ ప మ గ మ గా రి స ॥
వ - ల - పు - వె - - ల్లి ॥ వి - రి - సీ ని - ॥ ॥వెగ్గళించి॥

చ. ప ద ప పా ప మ ॥ గా మ గ రి స ॥ స రి గా మా ॥
స గ ము మా - - ॥ టా డ వే వో - ॥ స తి నీ వా ॥

ద ప దా ని ని దా పా ॥ - ప మ గా మ గ రి ॥ గ రి స రి గా మ ॥
త - ని చెం - - త ॥ - స గ ము తె లి సి ॥ కో - నే - జా డ ॥

ని ని దా పా ప మ పా ॥ - - - - - - ॥
ఫ - - - ట్టి - ద్దో ॥ - - - - - - - ॥

- ప మ గ మ దా ని ॥ సా స ని సా - ॥ స రి గా మ గ ॥
- త గు లు - కొం త ॥ చూ ప - వే - ॥ త రు వా - త ॥

రి స ని ద ని ని సా ॥ - స స సా స ని స రి స ని ॥
నా - - - త ని కి ॥ - త గు లు క - లి - గి - ॥

ద ని స రి స ని ద పా ॥ పా ప మ గ మ గా ॥
తే ని - - - - - ను ॥ త మ - కిం - చీ ॥

ని ని ద ప మ గ మ గ రి స ॥
ని - ప్పు - - - డు - - - ॥

॥వెగ్గళించి॥

**అవతారిక :**

శ్రీ వేంకటనాథుని సర్వేశ్వరత్త్వమును, భూ నభోంత రాళముల నిండియున్న విశ్వరూపమును తలంచుకొనుచు అయ్యవారు ఆ మహానుభావునకు శరణని చెప్పుకొనుచున్నారు.

**రాగ లక్షణం :**

వసంతరాగము ప్రాచీనము. ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళజన్యము. రి స గ మ ద ని స । సా ని ద ని ద మ గ మ ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. సంగీత సంప్రదాయ ప్రదర్శినియందును, పూర్వాచార్యులును చెప్పియున్నారు. సర్వకళాకోవిదుడును, మహానుభావుడును యగు రామరాజ భూషణుడు పంచమ ప్రయోగమును చెప్పియున్నారు. ఐనను వాడుకయందు 'గ మ ద మ' అను ప్రయోగమే తప్ప, పంచమ ప్రయోగము వినబడుట లేదు. 'పూర్వ వసంత' అను నొక రాగము ఉత్తర హిందుస్థానమున వాడుకయందున్నట్లు తెలియుచున్నది. ఇది నేడు మనము పాడుకొనుచున్న వసంత వలె నున్నది. అన్నమయ్య వారి రచనలు యిందే స్వర పరుపబడినవి.

**వసంత—ఆది**

ఇతర మెరగ గతి యిదియె శరణ్యము
సతత పూర్ణునికి శరణ్యము ॥ పల్లవి ॥

సర్వ లోకముల సామై కాచిన
సర్వేశ్వరునకు శరణ్యము
ఉర్వికి మింటికి నొక్కటై పెరిగిన
సార్వభౌమునకు శరణ్యము ॥ ఇతర ॥

శ్రీకాంత నురము చెంగట నిలిపిన
సాకారునకును శరణ్యము
పైకొని వెలిగెటి పరం జ్యోతియై (యా)
సౌకుమారునకును శరణ్యము ॥ ఇతర ॥

తగ నిహపరములు దాసుల కొసగెటి
జగదీశ్వరునకు శరణ్యము
నగు (శ్రీ) వేంకట నాథుడ నీకు
సగుణ మూర్తి యిదె శరణ్యము || ఇతర ||

అ : 11–81

ప. స మ గ మ ద ద ద మ | గ గ మ గ | రి స ని ||
ఇ త ర మె ర గ గ తి | యి ది యె శ | ర ణ్యా ము ||

స రి స ని స ని ధ ధ | ని సా ని | సా - - ||
స త త పూ - ర్ణు ని కి | శ ర ణ్య | ము - - || ||ఇతర||

చ. దా ద ద ద మ గ మ | దా ద మ | మ గ మ మ ||
స్వ ర్గ లో - క ము ల | సా మై - | కా - చి న ||

స మ మ గ మ ద ద మ | గ మ గ మ | దా - - ||
స - ర్వే - శ్వ రు న కు | శ ర - ణ్య | ము - - ||

ద మ ద ద నీ ద ద | నీ స స | రి రి స స ||
ఉ - ర్వి కి మిం టి కి | నొ క్క టి | చె రి గి న ||

సా ని దా ద ద మ | గ మ గ రి | సా - - ||
సా ర్వ భౌ ము న కు | శ - ర ణ్య | ము - - || ||ఇతర||

**అవతారిక :**

"జనన మరణముల సందడి యందు తిరుగు లాడుచుండెడి జీవులు హరి స్మరణమను పట్టుకొమ్మను మరచి యేమరినచో ఇంకేమి గలదు ? సూర్య చంద్రులకు ఉదయాస్తమయములు నిర్ణీతములై నడుచుచునే యున్నవి. అద్దమునందలి నీడల వంటివగు జగద్వ్యాపారము లలో తగిలి యేమర వద్దు సుమీ ! లోపల, బయట నిండియున్న ఆ శ్రీహరి, వేంకటపతి, ఆతనిని మరువక కడతేరు మార్గమును వదలక సాధించు" మని తన మనసునకు, చెప్పుకొనుచున్నట్లు అయ్యవారందరికీ బోధించుచున్నారు.

**వసంత — ఆది**

మఱచితి మంటే మరి లేదు
తఱితో దలచవో దైవపు (ము) మనసా || పల్లవి ||

పుట్టుచు నున్నది పోవుచు నున్నది
పట్టపు జీవుల ప్రపంచము
నట్టనడుమనే నరహరి నామము
గుట్టున దలచవో గొనకొని మనసా || మఱచితి ||

పొద్దు వొడుచునదె పొద్దు గుంకునదె
తిద్దిన జగముల దిన దినము
అద్దపు నీడల యంతర్యామిని
వొద్దనె తలచెనొ నరవొ (తలచవొ వొనరగ) మనసా || మఱచితి ||

లోపల వెలుపల లోగొని వున్నది
శ్రీపతి మహిమల సృష్టి యిదే
యేపున శ్రీ వేంకటేశ్వరు డితడే
ధాపన్ని నమ్మిచు దలచవొ మనసా || మఱచితి ||

అ : 11–117

ప. స గ మ గ మా దా | మ గ మా | దా - - ||
మ ఱ చి తి మం శే | మ రి తే | దు - - ||

ద ని స ని స రి స ని | దా మ మ | గ రి సా ||
త ఱి తో - ద ల చ వో | దై వ ము | మ న సా || ॥మఱచితి॥

చ. మా మ గ గ రి రి స | స ని స గ | మా మ మ ||
పు ట్టు చు ను - న్న ది | పో - వు చు | ను న్న ది ||

మ గ మ మ దా మ మ | గ మ ద ద | దా - - ||
ప - ట్ట పు జీ వు ల | ప్ర పం - చ | ము - - ||

దా మ ద ద ని దా | ద మ ద ని | సా స స ||
న ట్ట న డు మ నే | శ్రీ - హ రి | నా మ ము ||

స ని స గ రి స ని ద | మ ద మ గ | రి రి సా ||
గు - ట్టు న ద ల చ వో | గొ న కొ ని | మ న సా || ॥మఱచితి॥

**అవతారిక :**

"శ్రీకాంతుడగు వేంకటనాథుడు కలియుగమునందు జీవులకు కొంగు బంగారమై శేషగిరి యందున్నాడు. ఈతని వైభవములే ముజ్జగముల యందలి ముదములు, ఆమోదములు. ఈతని ఆనందములే లోకముల యునికి, మనికి, వేదములను రక్షించుటకు మత్స్యమై, అమృతమును దేవతలకు ఇచ్చుటకు కూర్మమై, దైత్యులను సంహరించుటకు వరాహమై, ప్రహ్లాదుని రక్షించుటకు నారసింహుడై, బలి నణచుటకు వామనుడై, గర్వోద్ధతులైన దుష్ట క్షత్రియుల బారి నుండి శిష్టులను కాపాడుటకు పరశురాముడై, అనాథులను కాచుటకు సీతారాముడై, భూమి భారమును తొలగించుటకు శ్రీ కృష్ణుడై, లోకములయందు సుఖ శాంతులను నెలకొల్పుటకును, ధర్మమును కాపాడుటకును, ఆయా సమయముల యందు అవతరించి ఆనందించెడి ఆ పరమాత్ముని విభవమే యిది" యని అయ్యవారు శ్రీనివాసుని వైభవములను కొనియాడుచున్నారు.

**రాగ లక్షణము :**

పాడి ప్రాచీన రాగము. స రి మ ప ద ప ని స । స ని ప ద ప మ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 15వ మేళమగు మాయామాళవ గౌళ జన్యము. ఇందు ఆధునికుల రచనలు కానవచ్చుటలేదు. తాళ్ళపాకవారి రచన లనేకములు గలవు. ఒకప్పుడిది బహుళ ప్రచారమున గల రక్తి రాగములలో నొకటియేమో!

**పాడి — ఆది**

అందరి బ్రదుకులు నాతనివే
కందువెల్ల శ్రీకాంతు నిదే ॥ పల్లవి ॥

వేమరు జదివెడి విప్రుల వేదము
సోము (మ) కవైరి యశో విభవం
శ్రీమించు నమరుల జీవనమెల్ల సు
ధామ ధనుని సంతత కరుణే ॥ అందరి ॥

హితవగు నిలలో సిసుఖమెల్లను, దితి సుత దమనుడు దెచ్చినదే
ఖతి తల్లి దండ్రి తానై కాచిన, రతి ప్రహ్లాద వరదుని కృపే ॥ అందరి ॥

అలరిన యమ రేంద్రాదుల బ్రదుకులు, బలి బంధను కృప బరగినవే
బలసి మునుల యాపదలు వాపుటకు, బలునృప భంజను పరిణతలే || అందరి ||

పూని యనాథుల పొందుగ గాచిన, జానకీ విభుని సరసతలే
నానా భూ భరణంబులు నందుని, సూనుడు చేసిన సుకృతములే || అందరి ||

తలకొని ధర్మము తానై నిలుపుట, కలుష విదూరుని గర్వములే
నిలిచి లోకములు నిలిపిన ఘనుడగు, కలి యుగమున వేంకటపతివే! || అందరి ||

అ : 11–123(ii)

ప. ప మ ప ప ద ద ప ప | ప మ ప మ | మ రి రీ ||
అం - ద రి బ్ర తు కు లు | నా - త ని | వే - - ||
రి స రి మ మ ప ప మ | పా ద ద | పా - - ||
కం - దు వె - ల్ల శ్రీ - | కాం తు ని | దే - - || ||అందరి||

చ. ప మ ప ప ద ద ప ప | ప మ ప ప | ద ద ప ప ||
వే - మ రు చ ది వె డి | వి - ప్రు ల | వే - ద ము ||

ప ద ప ని స స స ని | స స రి రి | సా - - ||
సో - ము క వై - రి య | శో - వి భ | వం - - ||

స రి మ మ రి రి స స | స ని స రి | రి స స ని ||
శ్రీ - మిం చు న మ రు ల | జీ - వ న | మె - ల్ల సు ||

ప స స ని ప ద ప మ | ప ద ప మ | రి మ పా ||
ధా - మ ధ ను ని సం - | త త క రు | జే - - || ||అందరి||

**అవతారిక :**

విరహోత్కంఠిత యగు నాయికను వర్ణించుచు 'నీవు ప్రత్యక్షమై ఆమెకు వరమీవయ్యా. నీ యందలి విరహముచే తాప మధికమై నిట్టూర్పులు విడచుచు, నీ కూటముల తలపులు మనసు నిండి, కన్ను లరమోడ్చి, నులి వెచ్చని విరహమున, జడలు కట్టిన కురులతో అదనెరుగక, నిరాహారియై నీ తలపుల పులకరింతలో వనవాసమును చేయుచు నివ్వెరపాటున మౌనియై తపము చేయుచున్నది. ఈమెను కరుణించవయ్యా" అని చెలి నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునకు విన్నవించుచున్నది.

**పాడి—ఝంపె**

ఇదివో యింతట వరంబీవయ్యా
కదిసి ప్రత్యక్షంబు గావయ్యా చెలికి ॥ పల్లవి ॥

తరుణి నిను బెడబాసి తపము సేయగ దొడగె
విరహంపు నులిగరుల విరి జడలతో
అరమోడ్పు కనుగొనల ఆనందముల తోడ
బరువైన నిట్టూర్పు పవనము తోడ ॥ ఇదివో ॥

ముదిత నిను దలపోసి మునిమార్గమున జెలగె
మొదల నివ్వెరపాటు మోనంబుతో
వదలని పులగముల వనవాసములతోడ
అదనెరగని నిరాహారంబుతోడ ॥ ఇదివో ॥

ఉవిద నీతో గూడి యోగంబు సాధించె
వివరంబు తోడ శ్రీ వేంకటేశ
నవకమగు రతుల నానా విధంబులతోడ
కవగూడి యున్న చిరకాలంబుతోడ ॥ ఇదివో ॥

శృం : 13-290

ప. స రి మ పా | ద ప ని సా || రి రి స ని ప ద ప మ ప ద | పా ప మ రి స ||
ఇ ది వో ఇం | త టి వ రం || బీ - - - వ - - - - - | య్యా - - - - ||

స ని ప ద ప | నీ సా రి || మా ప ద ప మ ప | స ని ప ద ప మ రి స ||
క దీ సి ప్ర - | త్య క్షం బు || గా వ - - - య్య | చె - లి - కి - - - ||
||ఇదివో||

చ. ప ద ప ద ద | ప ద ద ప ప మ మ ||
త రు ణి ని ను | జె డ బా - - - సి ||

రి మ ప పా ద ప ప మ | రి రి స ని స ||
త ప ము సే - - - - | య గ దొ డ గె ||

ప ధ ప ని స | రి స స ని స రి ||
వి ర హం - బు | ను లి కు - రు ల ||

స రి మ మ మ | పా ద ప ప మ పా - ||
వి రి జ డ ల | తో - - - - - - - ||

ప ద పా ప మ | ప ద ప ని స ||
అ ర మో డ్పు - | క ను గొ న ల ||

స రి మా మా ప మ రి రి | స స ని సా స ||
ఆ - - నం - - - ద | ము ల - తో డ ||

- ప ని స రి రి | రి రి రీ రి ||
- బ రు వై - న | ని - ట్టూ ర్పు ||

స ని ప ద ప మ | పా ప మ రి స ||
ప - వ న ము ల | తో డ - - - ||
||ఇదివో||

**అవతారిక :**

వేంకటపతి సన్నిధి నుండి వచ్చిన చెలులు పద్మావతీదేవికి విభుని వినయములు వర్ణించుచు "దేవి ! స్వామి నీకు దాసుడట. నీ పనుపులను చేయు కింకరుడట, నీవు తన కడ లేకుండుటచే అహిపతి శయనంబు బహు తాపంబగుచు, తాను బహు వేదనలకు పట్టుపడుచున్నాడట. ఇవిగోనమ్మా, అతని రహస్యపు లేఖలు" అని చెప్పుచున్నారని అయ్యవారు శ్రీనివాసుని విరహమును వివరించుచున్నారు.

**పాడి—ఆది**

విభుని వినయములు వినవమ్మా నిను
నభయం బడిగే నయ్యో తాను ॥ పల్లవి ॥

రహస్యమున శ్రీరమణుడు పంపిన
విహారణ లేకలు వినవమ్మా
అహిపతి శయనంబతి తాపంబై
బహు వేదన కగపడెనట తాను ॥ విభుని ॥

ఆదిమ పతి నీయడుగుల కెరగిన
వేదాంత రచన వినవమ్మా
నీ దయ గానక నిమిషమె యుగమై
ఖేదంబున నలగేనట తాను ॥ విభుని ॥

కింకరుడట నీ కినుక సేతలకు
వేంకట పతి గతి వినవమ్మా
సంకె లేక నీ చనవున జగములు
కొంక కిపుడె చేకొనెనట తాను ॥ విభుని ॥

శ్రృం : 12—307

ప. - మ పా ద ద ద ప మ రి రి స | స ని ఫ ధ ఫ ని | సా - రి మ మ ||
- వి భు ని వి - న - య ము లు | వి - న - వ - | మ్మా - - ని ను ||

- ప దా ప నీ స ని సా | స ని ప ద ప మ రి స | స రి మ ప దా ||
- అ భ యం - బ డి గీ | న - - - యో్య - - - | తా - - - ను ||

||విభుని||

చ. ప దా ద ద ద దా | - ప దా ప మా | రీ రి స ||
ర హ స్య ము న శ్రీ | - ర మ ణు డు | పం పి న ||

- స రీ మ మా పా ద ద ప మ | మ ప ద ద ప మ | రి స రి మ పా ||
- వి హా ర ణ లే ఖ - లు - | వి న వ - - - | మ్మా - - - - ||

- ప దా ప నీ సా స ని సా | స రి మా రీ | రి స నీ సా ||
- అ హి ప తి శ య - నం | బ - తి తా | పం - - బై ||

- ప దా ప నీ స ని స స | స ని ప ద ప మ రి స | స రి మ ప దా ||
- బ హు వే - ద న క గ | ప - డె - న - ట - | తా - - - ను || ||విభుని||

**అవతారిక** :

శ్రీహరిని ఆదిదేవునిగా చెప్పుచు అవయవములయందు శిరస్సు, ఇంద్రియములయందు మనస్సు, గుణము లన్నిటియందు పరమజ్ఞానము యెట్లు ముఖ్యములగుచున్నవో, అట్లే మంత్రములన్నిటి యందలి సారమును శ్రీ వేంకటేశ్వరుని నామమునందే యున్నదని అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

ఈ బౌళి రాగము ప్రాచీన రక్తి రాగములలో నొకటి. దీనిని పూర్వాచార్యులు ఘనరాగ ఉత్తర పంచకమున చేర్చియున్నారు. ఇది మాయా మాళవగౌళజన్యముగా యిప్పటి గ్రంథకర్తలు వ్రాసియున్నారు. ఆరోహణ- స రి గ ప ద స, అవరోహణ- స ని ద ప గ రి స అని యుండుటచే ఇది 51వ మేళమయిన కామవర్ధని జన్యమనినను అనవచ్చును ఉత్తర దేశస్థులు ఇదే ఆరోహణావరోహణములు గల రాగమును 'త్రివేణి' యందురు. తాళ్లపాక వారి రచనర యందు యీ రాగము కొంచెమధికముగనే కనబడుచున్నది. దీనికి సన్నిహితములగు మాయామాళవగౌళ జన్యములును అగు రాగములు ఇప్పుడు వాడుక యందు లేనివి ఎన్నియో వీరి రచనలయందు కనబడుచున్నవి.

బౌళి—ఆది

వెదకిన నిదియే వేదార్థము
మొదలు తుదలు హరిమూలంబు ॥ పల్లవి ॥

మునుకొని అవయవములు యెన్నైనా
పనివడి శిరసే ప్రధానము
యెనలేని సురలు యెందరు గలిగిన
మునుపటి హరియే మూలంబు ॥ వెదకిన ॥

మోవని యింద్రియములు యెన్నైనా
భావపు మనసే ప్రధానము
యీవల మతములు యెన్ని కలిగినా
మూవురలో హరి మూలంబు ॥ వెదకిన ॥

యెరవగు గుణములు యెన్ని కలిగినా
పరమ జ్ఞానము ప్రధానము
యిరవుగ శ్రీ వేంకటేశ్వరు నామమె
సరవి మంత్రముల సారంబు ॥ వెదకిన ॥

అ : 11–141(i)

ప. గ ప ప ద ద స స ని | ని ద ద ప | ప ద పా ||
వె ద కి న ని ది యే - | వే - దా - | - ర్థ ము ||

గ ప ప ద ప ప గ రి | గ ప గ రి | సా - - ||
మొ ద లు తు ద లు హ రి | మూ - లం - | బు - - || ॥వెదకిన॥

చ. గ ప ప ప ప ద ద ప | ప గ గ ప | పా ద ప ||
ము ను కొ ని అ వ య వ | ము లు ఎ - | న్నై నా - ||

ప ప ద ప ప ప గ రి | గ రి రి | సా - - ||
ప ని వ డి శి ర సే - | ప్ర ధా న | ము - - ||

ప గ ప ప ప ద ద ప | ద స స రి | రి స స స ||
ఎ న లే - ని సు ర లు | ఎం - ద రు | క లి గి న ||

స రి గ ప గ రి సా | స ని ప ద | స ని ద ప ||
ము ను ప టి హ రి యే | మూ - లం - | బు - - - || ॥వెదకిన॥

**అవతారిక :**

నాయిక శ్రీ వేంకటేశ్వరుడగు తన నాయకునితో సల్లాపములాడుచు "సృష్టి యందలి వైచిత్ర్యము నేమనవచ్చునో! కొందరికి కొన్ని హితవులై ఆనందము కలిగించునవియై యుండగా, కొందరికి బాధలను కలిగించునవిగా నున్నవి. కర్పూరము విరహులకు బాధ కలిగించును. పుష్పములలోకెల్ల రాజువంటిదగు చంపకమునకు భ్రమరములు తొలగిపోవును. చందమామను చూచి కమలములు తలలు వంచుకొనును. ఇట్లే కామినుల నవ్వులు, జంకెనలు, సిగ్గు పడుటలు వంటివి నాయకులకు ఆనందముతో కూడిన తియ్యని బాధను కలిగించును. నీవు గనుక నేనంగీకరించి పొందితిని సుమా !" అని గోముగా చెప్పుకొనుచున్నది.

ఇందు అన్నమయ్యవారు చమత్కారములగు నుపమానములతో రాత్రి యంతయు తన ప్రియునితో నాయిక గడిపినట్లు సూచించుటకో యనునట్లు ప్రాతఃకాలోచితమగు బౌళి రాగమున ఈ పదమును పాడుకొన్నారు.

**బౌళి—త్రిపుట**

ఏమని చెప్పగవచ్చు యింతా నీ భాగ్యమే
వేమారునెంచి చూచితే వింతలై నిలుచును ॥ పల్లవి ॥

ధరలో కప్పుర మందరికి జల్లనై యుండు
విరహులకై తేను వేడై యుండును.
తరుణులకు నవ్వులు తగ వినోదమైయుండు
కెరలించి నీకవే వెంగములై పరగును ॥ ఏమని ॥

ఇమ్ముల సంపంగి పూవులిందరి కితవై యుండు
తుమ్మెదల కై తేనే దొరయకుండు
కొమ్మలకు జంకెనలు కోరి సింగారాలై యుండు
వుమ్మడి నీకై తే మర్మా లొరయుచుండును ॥ ఏమని ॥

భూమికెల్లా జందమామ పొసగించు వేడుకలు
తామరలకై తేనే తలవంపులు
కామించి శ్రీ వేంకటేశ గక్కన నన్నేలితివి
యీ మేలు నీకై తేను యియ్యకోలై యుండను (?,) ॥ ఏమని ॥

శృం : 13–150

ప. - - స రి | గా పా || గ పా ద ని ద | పా గ రి ||
- - ఏ - | మ ని || చె ప్ప - - - | గ వ - ||

సా గ | పా - ద సా || స ని ద ని దా | పా గ రి || సా
చ్చు యిం | తా - - నీ || భా - - - - | గ్య మే - || -

- - ప ద | సా సా || రి స రి గా స | రీ రీ ||
- - వే - | మా రు || ఎం - - చి - | చూ చి ||

రీ స | స ని పా ద ప || ప గ ద ప ద ప | గ ప గ రి సా ||
తే విం | త - - లై - || ని - లు - - - | చు - - - ను || ॥ఏమని॥

చ. - - స రి | గా గా || గ ప ద ప గ ప | గ రి రీ సా ||
- - భూ మి | కె ల్ల || చం - ద - - - | మా - - మ ||

- - స రి | సా స ని ధా || ప ధ సా | స రి స రి గా గా ||
- - పొ స | గిం చు - - || వే - డు | క - - - - లు ||

- - గ ప | దా సా || స ని ద ని దా | పా పా ||
- - తా మ | ర ల || కై - - - - | తే నే ||

గ రి స రి గా | ప గ దా పా || - - ప గ | పా దా ||
త ల వం _ - | పు - - లు || - - కా - | మిం చి ||

ప ద సా | స గ రీ రీ || రీ గ ప | గ రి స రి గా గ రి రీ ||
శ్రీ - వేం | క - - టే || శ గ - | కృ - - - - న - - ||

స సా | స ని ద ప దా || - - ప ద | సా సా ||
న న్నే | లి - తి - వి || - - యా - | మే లు ||

రి స రి గా స | రీ రీ || రీ స | స ని పా ద ప ||
నీ - - కై - | తే ను || - యి | య్యా - - కో - ||

ప గ ద ప ద ప | గ ప గ రి సా ||
లై - యుం - - - | డు - - - ను ||

॥పమని॥

**అవతారిక :**

జీవికి కలుగు సుఖ దుఃఖములు, తుది మొదలు లేని పుట్టుట, గిట్టుటలు మొదలగు వాటికి తాను బాధ్యుడ ననుకొనుట తక్క, నిజమునకు ఇవి యన్నియు శ్రీ వేంకటేశ్వరుని లీలలేయని తెలుసుకొను జ్ఞానము పొందుటకు ప్రయత్నించుటయే సార్థకత యగునని అన్నమయ్య వారు చెప్పుచున్నారు

బౌళి — ఝంపె

ఏది తుద దీని కేది మొదలు
పాదు కొను హరి మాయ బరగు జీవునికి ॥ పల్లవి ॥

ఎన్ని బాధలు తనకు నెన్ని లంపటములు
యెన్ని వేదనలు మరి యెన్ని దుఃఖములు
ఎన్ని పరితాపంబు లెన్ని తలపోతలు
ఎన్ని చూచిన మరియు నెన్నైన గలవు ॥ ఏది తుద ॥

ఎన్ని కొలువులు దనకు నెన్ని యనుచరణలు
ఎన్ని యాసలు మరియు నెన్ని మోహములు
ఎన్ని గర్వములు దనకెన్ని దైన్యంబులివి
ఇన్నియును దలప మరి యెన్నైన గలవు ॥ ఏది తుద ॥

ఎన్నిటికి జింతించు నెన్నిటికి హర్షించు
నెన్నిటికి సాధించు నెన్నిటికి దిరుగు
ఇన్నియును దిరువేంకటేశులీలలు గాగ
నెన్ని చూచినను దానెవ్వడును గాడు ॥ ఏది తుద ॥

అ : 11–(ii) 36

ప. ప ద స స రి ॥ సా స సా ॥ రి గ రి సా ॥
ఏ - ధి తు ద ॥ దీ ని కే ॥ ధి మొ ధ లు ॥

సా ఠి గ రి ॥ స స స ని ద ॥ ప ప ద ప గ ॥
పా డు కొ ను ॥ హా రి మా - య ॥ బ ర గు జీ - ॥

ప ద పా - ॥
పు ని కి - ॥ ॥ పదితుద ॥

చ. పా ద పా ॥ ద ప ద ప ద ॥ పా ద పా ॥
ఎ న్ని శా ॥ ధ లు త న కు ॥ నె న్ని లం ॥

ద ప ప గా ॥ గా ప ప ద ॥ ద ని ద ద ప ॥
ప ట ము లు ॥ ఎ న్ని వే - ॥ ద న లు మ రి ॥

పా ద పా ॥ ప గ పా - ॥ పా ద ద స ॥
ఎ న్ని దుః ॥ ఖ ము లు - ॥ ఎ న్ని ప రి ॥

రి స సా రి ॥ సా రి గ ప ॥ గా రి సా ॥
తా - పం బు ॥ లె న్ని త ల ॥ పో త లు ॥

సా రి స ని ॥ ద ద ప ప గ ॥ గా పా ప ॥
ఎ న్ని చూ - ॥ చి న మ రి యు ॥ నె న్నై న ॥

ద ని ద పా ॥ గా ప ద ప ॥ గ రి స రి గా ॥
గ ల వు - ॥ ఎ న్నై - న ॥ గ ల వు - - ॥ ॥ పదితుద ॥

**అవతారిక :**

"పద్మావతీదేవి పెదవులపై గల కస్తూరి గురుతులు, కనుకొలనుల యందలి కెంపుల తళుకులు, చెక్కులపై జారెడు చిరు చెమటలు మొదలగునవి గమనించిన చెలులు ఎకసక్కెము లాడుచు గద్దరి తిరువేంకట పతికి, ఆమె వ్రాసిన లేఖలా! ఆతని హృదయమున ఆమె నాటిన చూపులు వెనుకకు తీసుకొనగా అంటిన నెత్తుటి మరకలా! అతని కరుణా కటాక్షము తనపై ప్రసరింపగా పారవశ్యమున ప్రవహించిన ఆనందామృత ప్రవాహములా అని వేడుకగా మాటలాడుకొనుచున్నా'' రని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణం :**

నాదనామక్రియరాగము ప్రాచీనము. ని స రి గ మ ప దా - ద ప మ గ రి స నీ ఆరోహణావరోహణములు కలిగియున్నను మధ్యస్థాయి యందలి నిషాదమును కొంచెముగా సోకించెడి సంగతులను కలిగియున్నది. 'ప ని ద పా' అను ప్రయోగమున కించిత్ కైశికి నిషాదము కూడ వేయుట వైణికుల సంప్రదాయము గనుక దీనిని భాషాంగమనియే చెప్పుకొన వలెను. ఇది యిప్పటి మాయామాళవగౌళ మేళజన్యము. వెంకటముఖి సంప్రదాయమున ఈ రాగమును సంపూర్ణ సంపూర్ణముగా యెంచి మాయామాళవగౌళ మేళమునకును దీనికిని అంతగా భేదము లేదేమోనని తోచుచున్నట్లుగా చెప్పియున్నారు. క్షేత్రజ్ఞుని పదమునందు కనబరచిన రాగస్వరూపమే ఇప్పుడును వాడుకలోనున్నది. ఇందు పదములయందుగల రాగ స్వరూపము నిషాదాంత్యముగనే కనబడుచున్నది.

**నాదనామక్రియ - చతురశ్రఏక**

ఏమొకో చిగురు టధరమున యెడచెడ గస్తురినిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు గదా        ॥ పల్లవి ॥

కలికి చకోరాక్షికి గడ కన్నులు గెంపై తోచిన
చెలువం బిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యాకొన చూపులు
నిలువున పెరుకగ నంటిన నెత్తురు గాదుగదా        ॥ ఏమొకో ॥

పడతికి చనుగవ మెఱుగులు పై పై బయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలగ వేసవికాలపు వెన్నెల గాదు గదా ॥ ఏమొకో ॥

ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దికలాగు లివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల అందము గాదు గదా ॥ ఏమొకో ॥

శ్రీం : 12–82

ప. - స స స స రి స ని | ని స స రి | రి స స స ||
- ఏ మొ కొ చి గు రు ట | ధ ర ము న | యె డ సె డ ||

- రి ప మ గా రి స | - ని ని ని | స స రి రి ||
- క స్తు రి నిం డె ను | - భా మి ని | వి భు న కు ||

సా రి ప ప మ గ రి | గ మ గా రి రి | సా - - ||
వ్రా సి న ప - త్రి క | కా - - దు గ | దా - - ||

సా స రి గ మ గా రి రి | సా - - | - - - - ||
ఓ హో - కా - - దు గ | దా - - | - - - - || ॥ఏమొకో॥

చ. - మ మ మ మ మా మా | గ మ ప ద | పా ప మ ||
- క లి కి చ కో రా | క్షి కి క డ | క న్ను లు ||

పా దా పా ప మ | ప ప దా | పా ప మ ||
కెం పై తో చి న | చె లు వం | బి ప్పు డు ||

గా రీ సా సరి | స ని సరి | గా - - ||
దే మో చిం తిం - | వ రె చె లు | లు - - ||

- మ మ మ మ మా మా | గ గ మా ప మ | గా మ గ రి రి ||
- న లు వు న ప్రా ణే | శ్వ రు పై - - | నా - - టి న ||

గా మా ప మ గా మ గ రి రి | - స స స స | స రి స ని ||
యా కొ న - చూ - - పు లు | - ని లు వు న | పె రు క గ ||

సా రి ప ప మ గ రి | గా మ గ రి రి | సా - - ||
నం - టి న నె త్తు రు | కా - - దు గ | దా - - ||

నీ స రి గా మ గ రి రి | సా - - | - - - - ||
ఓ హో - కా - - దు గ | దా - - | - - - - || ||ఏమొకో||

**అవతారిక :**

ఇందు లక్ష్మీ నారాయణులగు నాయికా నాయకులను చూచి ఆనంద పరవశులై చెలులు "పున్నమి వెన్నెల, పూవుల వాసన వలెనున్నది మీ జోడు, పాలజలనిధిపై తేట బంగారు లోపల వన్నె వలె నున్నది మీ కలయిక, మన్మథుని పుట్టినిల్లు ఆపె నీ యురముపై నున్న సోయగమును చూచి ఏమని మెచ్చగలము! అందరిని కన్నతల్లి, ఆది మూలము అగు మీరు యిందు శ్రీ వేంకటేశ్వరుడు అలమేలు మంగలై అవతరించి మమ్మేలు చున్నారు" అని అయ్యవారు అనుచున్నారు.

**నాదనామక్రియ — రూపకం**

దేవర వైభవ విన్నిటా దేవులాయె నాపె నీకు
ఆవల మిమ్మిద్దరి నేమని పొగడేమయ్యా ॥ పల్లవి ॥

పున్నమ వెన్నెల జోడు పూవులలోని వాసన
ఉన్నతిమీరి నీ వురమెక్కెను.
మన్నన సంపదరాశి మదనుని పుట్టినిల్లు
వన్నెతో నీకు రాణివాసమాయను ॥ దేవర ॥

పాలజలనిధి తేట బంగారు లోపలికళ
కీలితముగా నీ కెంగేలు వట్టెను.
మేలుకో సాకారము మించులోకము భాగ్యము
తాలిమితో నీకు మూలధనమాయను ॥ దేవర ॥

అందరిని గన్నతల్లి ఆది మూలమైన లక్ష్మి
కందువ నీ ముంజేతి కంకణమాయెను
యిందునె శ్రీ వేంకటేశ యీపె సర్వమోహనము
కందువాయ నిన్ను గూడె (డి) కలిమెల్లా మెప్పె ॥ దేవర ॥

శ్లో : 13—8

ప. సా - రి | గ రి సా || రి స | స స ని సా ||
దే - - | వ ర వై || తి వి | - న్ని - టా ||

- స రి | మ మా మ || గ మ ప ద | ప మ గ మ ప మ గ రి ||
- దే - | వు లా యె || నీ - - - | పె - నీ - - - కు - ||

మ గ | మ పా ప మ || ద ప | ద ని ద ప ||
ఆ - | వ లా - - || మి - | మ్మి - ద్ద రి ||

మా | మ గ మ పా ప మ || ద ద ప మ | గ మ ప మ గ రి సా ||
నే | మ - ని పొ గ - || దే - - - | మ - - - - - య్యా || ||దేవర||

చ. - మ | మ మా ద ప ప || ప ప మ గ | గ రి గా మా ||
- పు | న్న మ - - వె || న్నె - ల - | లో - - డు ||

- మ | మ మ గ ప మ గ రి || స ని సా | - రి గ రి గా ||
- పు | వ్వు ల - లో - - - || ని - వా | - - స - నా ||

- స | రి స రి స ని || సా - రి | గ రి గా ||
- ఉ | న్న తి మీ - - || రి - - | నీ - - ||

మ ప | ప ప మ గ మా ప ద || పా | - - - - ||
యు ర | మె - - - - కె - || ను | - - - - ||

- గ | మ ప దా || ప ద | ని ప దా ||
- మ | న్న న సం || ప ద | రా - సి ||

మ ద | ప ద ని ప || ద మ | ప గ మా ||
మ ద | ను ని వు - || ట్టి ని | - - ల్లు ||

- మ | మ మా మ || గ మ ప | మ మ ప ద ద ||
- వ | న్నె తో - || నీ - - | కు రా - - ణి ||

మ ప | మ గా మ || ద ద ప మ | గ మ ప మ గ రి సా ||
వా - | స మా య || ను - - - | - - - - - - - ||

సా - రి | గ రి సా || రి స | స స ని సా ||
దే - - | వ ర వె || తి వి | న్ని - - టా || ॥దేవర॥

**అవతారిక :**

ఇందు నాయకుని చేతలను చెప్పిపొడుచుచు 'చెలి నీ తలనే పొద్దు పొడిచెనా. నీ వంటి వారు లోకమునం దెందరో కలరు. ఈల కూరలో వుప్పు చాలదని ఇల్లాలిని వేధించువారు లేరా! అట్లే యున్నవి నీ చేతలు' అని శ్రీ వేంకటేశ్వరునకు ఎక సక్కెముగా హెచ్చరించుచున్నది. ఇందు ఆనాటి సామెతలు కొన్ని అయ్యవారు చెప్పియున్నారు.

**నాదనామక్రియ—రూపకం**

నీ తలనే వేగెనా నిన్ను దూర బనిలేదు
జాతి బుల్ల దీగెలకు సారెనలుగుదురు ॥ పల్లవి ॥

తియ్యని మాటలెపో తెలుప మోవిగాదేది
కయ్యమడిచి వూరకే కారమనేవు
అయ్యరో నీవే కాదు ఆలి నొల్లనివారు
వొయ్యనె యీలకూరకు వుప్పు చాలదందురు ॥ నీ తలనే ॥

చల్లని చూపులెపో సతి కన్నుల జల్లేవి
వొల్లని వాడవై అవే వుడుకనేవు
మెల్లనె నీవు కాదు మేలు మేలు అంటే నీళ్ళు
బల్లిదులైన వారు పాటి గంప దెత్తురు ॥ నీ తలనే ॥

కూరిమి కౌగిలేకా కొమ్మ నిన్ను గూడినది
బీరాల నీ వేమిటికో బిగువనేవు
యీ రీతి శ్రీ వేంకటేశ యేకమైతి వితరులు
మేర మీరే వారి గంటే మిక్కిలి లోనౌదురు ॥ నీ తలనే ॥

ప. స రి | ప మ గా || రి స | రి గా - ||
నీ - | త ల నే || వే - | గె నా - ||

మ గ | మ పా మ || ద ప | ద మ పా ||
ని - | న్ను దూ ర || ప ని | లే - దు ||

మా | మ మా మ || గ మ | ద ప దా ||
జా | తి పు ల్లి || తీ - | గె ల కు ||

మ ప | మ గ రి గ || ప మ గ రి | సా - - ||
సా - | రె న లు గు || దు - - - | రు - - || || నీ తలనే ||

చ. - ప | ప పా - || ప మ ప | ద ప మా ||
- తి | య్యా ని - || మా - - | ట లె పో ||

గ మ | ప ప మ గ రి || స రి | గ రి గా ||
తె రు | వ మో - - పి || నా - | దే - ది ||

సా | రి స స ని || సా | రి గా - ||
క | య్యా మ డి చి || వూ | ర కే - ||

గ మ | ద ద ప మ గ రి || ప మ గ రి | సా - - ||
కా - | ర - మ - నే - || - - - - | వు - - ||

- గ | మ పా ప మ || ప ద ని | - ప ద ప ||
- అ | య్యా రో నీ - || వే - - | - కా - దు ||

పా | ద ప మా ప మ || గ రి | గా మా ||
ఆ | లి - నో ల్ల - || ని - | వా రు ||

- మ | మ మ మా || మ మ గ | మ ద ప దా ||
- వొ | య్యె నె యీ || ల కూ - | - ర - కు ||

- ప | ద పా ప మ || గ మ ప ద | ప మ గ మ ప మ గ రి ||
- వు | వ్వు చా ల - || దం - - - | దు - రు - - - - - ||

స రి | ప మ గా || రి స | రి గా - ||
నీ - | త ల నే || వే - | గె నా - ||

|| నీ తలనే ||

**అవతారిక :**

"చరాచరమయమగు సృష్టియంతయును నిండియున్న దెవరు? వేరు వేరు నామములతో వెలసియున్న యీ దేవతలందరును ఎవరు? అవాఙ్మానస గోచరుడవైన నీ వొక్క చోటనే యుందువనుకొన్నాను. సర్వజ్ఞుడై సంచరించు వాడెవ్వడు? జీవాత్మల వెంట పరమాత్ముడవై నీవున్నా వనుకొనినచో జగన్నాటక సూత్రమును త్రిప్పుచున్న వారెవ్వరు? విశ్వపరిపూర్ణులము, దైవములము అని చెప్పుకొనుచున్న వీరందరును యెవరు? శ్రీ వేంకటాద్రి యందు స్థిరమై నీ వుండగా యిది యంతయు యెట్లు జరుగుచున్నది?- ఈ మాయారహస్యమును విశదీకరింపుమయ్యా!" అని అయ్యవారు వేంకటాధీశ్వరుని ప్రార్థించుచున్నారు.

**నాదనామక్రియ — చాపు**

ఈ సుర లీమును లీచరాచరములు
ఈ సకలమంతయు నిదియెవ్వరు ॥ పల్లవి ॥

ఎన్నిక నామములిటు నీవై యుండగ
ఇన్ని నామముల వారిది యెవ్వరు
ఉన్న చోటనే నీ వుండు చుండగ మరి
యిన్నిటా దిరుగు వారిది యెవ్వరు ॥ ఈ సుర ॥

ఒక్క రూపై నీవు వుండుచుండుగ మరి
తక్కిన యీ రూపములు తామెవ్వరు
ఇక్కడ నక్కడ నీవు యిటు ఆత్మలలో నుండ
మక్కువ నుండు వారు మరి యెవ్వరు! ॥ ఈ సుర ॥

(శ్రీ) వేంకటాద్రిపై చెలగి నీ వుండగా
దైవంబులను వారు తామెవ్వరు
కావలసిన చోట కలిగి నీ వుండగా
ఈ విశ్వపరిపూర్ణు లిది యెవ్వరూ ॥ ఈ సుర ॥

ప. స్ని - | స స స రి || గ గా | రీ సా ||
యీా - | సు ర ళీ - || ము ను | ళీ చ ||

న్లి స | స స స రి || రి మా | మ మ ప మ ||
రా చ | ర ము లు - || యీా - | స క ల - ||

గా మ | గా రి రి || గా రి | సా - - ||
మం త | యు ని ది || యె వ్వ | రు - - || ॥ యీా సురళీ ॥

చ. రి మ మ | మా మా || గ మా | ప ద పా ||
ఎ - న్ని | క నా || మ ము | ళి టు నీ ||

మా ప | పా ప మ || మ ద ద | దా ద ప ||
వై - | యుం డ గ || యి - న్ని | నా మ ము ||

పా మ | గా మ మ || పా ద | పా - - ||
ల - | వా రి ది || యె వ్వ | రు - - ||

మ ద ద | దా ద ప || పా మ | గా రీ ||
వు - న్న | చో ట నె || నీ - | వుం డ ||

గా మ | పా మ గ || రీ రి | సా ని ని ||
గా - | మ రి - || యి న్ని | టా తి రు ||

సా రి | గా రి రి || గా రి | సా - - ||
గు - | వా రి ది || యె వ్వ | రు - - || ॥ యీా సురళీ ॥

**అవతారిక :**

"ఇరువదియైదు తత్త్వములు గల యీ దేహమున నుండెడి జీవాత్మ తన చెంతనే గల పరమాత్మను గుర్తింపనేరక అణువు మొదలు బ్రహ్మపర్యంతము నిండియున్న ఆతని యునికిని తెలుసుకొనలేక వెదకులాడుచు, దేవదేవుడగు వేంకటనాధుని సేవకులకు ఇది యంతయు జగన్నాటక సూత్రధారి యాడెడి నాటకమేనని తెలియును. ఈ తెరమరుగు తెలియనివారికే" నని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణం :**

గుండక్రియ ప్రాచీనరాగములలో నొకటి. ఇది ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయామాళవగౌళజన్యము. అవరోహణమునందు స ద ని ప ద మ ప మ గ రి స- ఆరోహణమునందు సంపూర్ణము కలిగిన యీ రాగమును పూర్వాచార్యులు ప్రథమ యామమున గానము చేయదగినదని చెప్పియున్నారు. అన్నమయ్యవారి తరువాత, మేళకర్తలు పుట్టి సంపూర్ణ సంపూర్ణమగు మాయామాళవగౌళ ప్రచారమునకు వచ్చి, వక్ర సంపూర్ణమగు యీ రాగము మరుగున పడిన దేమోనని తోచుచున్నది. ఇందు ఇటీవలి వారివి ఒకటి రెండు రచనలు తప్ప కానవచ్చుట లేదు. ఇది అయ్యవారి కాలమున ఎక్కువగా ప్రచారమునందున్నట్లున్నది. ఇందు తాళ్ళపాకవారి రచనలెన్నియో గలవు.

**గుండక్రియ — ఆది**

తెలియని వారికి దెరమరుగు
తెలిసిన వారి కి దిష్టం బిదియే ॥ పల్లవి ॥

కన్నుల యెదుటను గాంచిన జగమిది
పన్నిన ప్రకృతియు బ్రహ్మమునే
యిన్నిట నుండగ నిదిగాదని వారి
గన్నచోట వెదకగ బోనేలా ॥ తెలియని ॥

అగపడి యిరువదియైదై జీవుని
దగిలిన వెల్లా దత్వములే
నగవుల నిదియును నమ్మగజాలక
పగటున దమలో భ్రమయగ నేలా ॥ తెలియని ॥

అంతరంగుడును నర్చావతారము
నింతయు శ్రీ వేంకటేశ్వరుడే
చెంతల నీతని సేవకులకు మరి
దొంతి కర్మముల తొడసిన నేలా ॥ తెలియని ॥

అ : 11, i, –28

ప. స రి మ మ గ గ రి రి | స రి గ స | రి - - ||
తె లి య ని వా - రి కి | తె ర మ రు | గు - - ||

ప మ ప ని స ని స రి | స ని ప ద | ప మ పా ||
తె లి సి న వా - రి కి | ది - ష్టం - | బ ది యే || ॥ తెలియని ॥

చ. ప మ ప ప ని ని స స | స ని స స | రి రి స స ||
క - న్ను ల యె దు ట ను | కాం - చి న | జ గ మి ది ||

స రి మ మ గ గ రి రి | గ గ రి రి | సా - - ||
వ - న్ని న ప్రకృతి యు | బ్ర - హ్మ ము | నే - - ||

స ని స రి రి స స స | స ని స రి | రి స స ని ||
యి - న్ని ట నుం - డ గ | న ది గా - | ద ని హా రి ||

ప ని స స రి స స ని | ప ద ప మ | గ రి సా ||
గ - న్న చో - ట వె ద | క గ బో - | నే - ల || ॥ తెలియని ॥

**అవతారిక :**

"మనసును నిశ్చలముగా నుంచుకొనుట యను యోగమును సాధించిన వారు యోగులు. ఈ యనుభవమునందలి ఆనందము వారికే తెలియును. నిద్రయందు అవయవము లన్నియు తమ పనులను వదలి ఎట్లు నిశ్చలముగా నుండునో అట్లే పరమాత్మునిపై భారమునుంచి, చింతలను త్యజించిన వారికి భవ బంధములు తొలగిన ఆనందము కలుగుచున్నది. గతమునందు తాను పొందిన యనుభవములను తలచుకొని మానవులు సుఖదుఃఖములను మానసికముగా యెట్లు పొందుచున్నారో అట్లే పరమాత్ముని సాన్నిధ్యమును భావించుకొని, ఆ శ్రీహరి సన్నిధియందలి ఆనందమును పొందవచ్చును కదా! ఇట్లే జీవులు భావనా ప్రపంచమునందు ప్రయత్నించి తాము యెత్తిన అసంఖ్యాకములగు జన్మప లయందలి యనుభవములను యెట్లు పొందుచున్నారో యట్లే పరమాత్మునియందు లగ్నమనస్కులై, శ్రీ వేంకటనాథుని సేవించుట యందు గల ఆనందమును గ్రహించుకొని చింతలను దూరము చేసుకొని నిశ్చలత్వములోని పరమానందమును పొందుటకు ప్రయత్నించ వచ్చును కదా?" అని అయ్యవారు చెప్పుచున్నారు.

**గుండక్రియ—ఆది**

నిశ్చింతము పరమం సుఖమను మాటే నిజము నిజము తెలియరుగాని
ఆశ్చర్యంబిది పరమయోగులకు ననుభవులకు దృష్టాంతము సుండీ ॥ పల్లవి ॥

కర చరణాదులు గల చైతన్యము గక్కున బానువుపై నుండి
సరుగన సడిలిన నిద్రామందము సమకూడీ నరుల కటువలెనే
పరమాత్మునిపై సకలోద్యోగవు (గో) పాయంబులు దాదిగవిడిచి
ధరదానుండిన బ్రహ్మానందము తను దానే పైకొను జుండీ ॥ నిశ్చింతము ॥

ఉన్నతి దానొక దేశము లోపల నుండి క్రితము చూచిన నవియెల్లా
అన్నిదేశములు నటుదల పోసిన యంతకు గోచరమైనట్లు
ఎన్నగ బూర్వజ్ఞానంబున సర్వేశ్వరుడగు హరి దలచినను
సన్నిధియగు సుజ్ఞానానందము సత్యము సత్యంబదిసుండీ ॥ నిశ్చింతము ॥

ననిచిన ప్రపంచ కల్పములలో నానావిధముల జంతువులు
తనదా జూడగ రాని రూపులద్దములోపల గన్నట్లు
ఘనుడగు శ్రీ వేంకటపతి రూపము గక్కన నెదుటనె సేవించి
అనయము తనుధా సంతసించుట్లే యాత్మానందంబిది సుండీ ॥ నిశ్చింతము ॥

అ : 11 (1)–22

ప. మా - మా - ప ద ద ప మ | మ గ మా ప మ | గ స రీ ||
ని - శ్చిం - తం ప ర మం - | సు ఖ మ ను - | మా - డే ||

- స నీ ఫ ఫా స ని స రి | గ రి గా | మ - - ||
- ని జ ము ని జ ము తె లి | య రు గా | నీ - - ||

ప ద నీ స రి స ని | స స రి గ | మ గ రి స ||
ఆ - శ్చ ర్యం - బి ది | ప ర మ యో | - గు ల కు ||

ని ని స స ని ని పా | ద ప ప మ | గ రి గ మ ||
న ను భ వు ల కు దృ | ష్టాం - త ము | సుం - డీ - || ॥నిశ్చింతము॥

చ. మ మ మ మ గ మ గ రి | స రి స ని | స రి గ గ ||
క ర చ ర ణా - దు లు | గ ల చై - | త - న్య ము ||

మా మ మ గా రి రి | స ని స రి | సా సా ||
గ్ర క్కు న పా ను పు | పై - నుం - | డి - ||

ని ని స స రి రి స ని | స రి గా | మా మ మ ||
స ర గు న స డ లి న | ని - ద్రా | ము ద ము ||

స రి గా మా మ గ | మ ప ప ద | పా - - ||
స మ కూ డీ న రు | ల క టు ల | నే - - ||

మ మ పా ద ద పా | మ మ పా | దా ని ని ||
ప ర మా త్మ ని పై | స క లో | ద్యో గ వు ||

సా రీ గ గ రీ | స ని స రి | సా - - ||
పా యం బు లు దా | ది గ వి డి | చీ - - ||

ని ని సా రీ స ని | స రి స ని | ప ద ప మ ||
ధ ర దా నుం డి న | బ్ర - హ్మా - | నం - ద ము ||

ప ద ప ని స ని ప ద | ప మ గ రి | గా - - ||
క్క ను ధా - నే - పై - | కొ ను జు - | డీ - - || ॥నిశ్చింతము॥

**అవతారిక :**

'వూంకు ప్రాయములు, కాయములు యిచ్చి, అన్నలు, తమ్ములు, భార్యాబిడ్డలు మొదలగు రూపములలో బంధములు పన్నియుంచితివి. కాని నిజమునకు నీ వొక్కడివే నా వాడవు. ఈ చుట్టములు పక్కములు, సుఖములు, దుఃఖములు నాకు వలదు ఇందిరా రమణా! ఇది యంతయు నీ మాయ! తల్లి దండ్రులు, అన్నదమ్ములు మొదలగు వేషములు వేయించితివి. నా చేతను తప్పులను చేయించితివి. ఏది యేమైనను ఇవి యన్నియు నీ చేతలని నమ్మిన నాకు నీవు దక్క వేరేమియు వలదు.' అని అయ్యవారు లోక వ్యాపారమంతయు శ్రీ వేంకటేశ్వరుని మాయా విలాసములతో కూడిన ఒక నాటకమని వర్ణించుచున్నారు.

**రాగ లక్షణం :**

గుజ్జరి ప్రాచీన రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయామాళవగౌళజన్యముగా చెప్పుకొనవలెను. కాని యీ రాగ స్వరూపమును గమనించినచో మాళవగౌళకు పూర్వమే ఇది అత్యంత ప్రధానమగు రాగములలో నొకటిగా నున్నట్లు తోచుచున్నది. సంపూర్ణ సంపూర్ణములుగా నుండినను కొన్ని వక్ర సంచార ప్రయోగముల వలన రాగములు వేరు వేరు పేర్లతో గుర్తింపబడుచున్నట్లు ప్రాచీనుల వ్రాతల వలన తెలియుచున్నది. స రి గ మ ప ద ని స - స ద ని ప మ గ రి స అని ఒకరును, స ని స ద ని ప ద మ ప మ గ రి స అని ఒకరును చెప్పి ఇందు గల గీతకీర్తనాదులను గమనించి ఆరోహణావరోహణములు తెలుసుకొనవలెనని చెప్పియుండుటచే, ఈ రాగమును అధ్యయనము చేయుటకు కొంత ఇబ్బంది కలుగును. ఐనను ఇందు మనకు దగ్గరి వారగు త్యాగరాజస్వామివారి కీర్తనలు గమనించినచో రాగస్వరూపము కొంత విశదమగును.

**గుజ్జరి — చాపు**

పాయ మంటా ముది మంటా బహురూపము యిక
నే యెడ గాచెదు మము నిందిరారమణ ॥ పల్లవి ॥

అన్నలంటా తమ్ములంటా ఆండ్లంటా బిడ్డలంటా
పన్నుకొని తిరిగేరు బహురూపాలు
ఎన్నిక దినములలో నెవ్వరికి నేనేమి గల
రిన్నిటికి నీవే నాకు నిందిరా రమణ ॥ ప్రాయము ॥

చుట్టమంటా పక్కమంటా సుఖమ్మంటా దుఃఖమంటా
పట్టులేక తెచ్చుకొన్న బహురూపము
వట్టి వెతల బడి వాడు దేరేను
ఎట్టు సేసినను జేయు మిందిరా రమణ                    ॥ పాయము ॥

తల్లులంటా దండ్రులంటా తప్పులంటా నొప్పులంటా
బల్లిదుల జేయలేని బహురూపాలు
వెల్లిగొన్న కృపతోడి వేంకటేశుడ నాకు
నెల్లనాడు నీవే కల విందిరా రమణ                    ॥ పాయము ॥

అ : 11(2)55

ప. పా ద | దా ప మ || గ మా | గా రీ ||
పా య | మం టా _ || ము ది | మం టా ||

మ గ మ | పా ప మ || గ రీ | సా సా ||
బ హు - | రూ - - || ప ము | యిం కా ||

నీ ని | సా స రి || గ మా | గా రీ || గా మ | గా రి రి || సా - | - - - - ||
ఏ మె | డ గా - || చె దు | మ మ్మి || యిం ది | రా ర మ || ణా - | - - - - ||
॥ పాయ ॥

చ. మా మ | మా మ గ || మా ప | పా ప మ ||
అ న్న | లం టా - || త మ్మి | లం టా - ||

మ దా | దా ద ప || ప మ ప | పా పా ||
ఆం - | డ్లం టా - || బి - డ్డ | లం టా ||

మా ప | ప ద ద ప || దా ని | స స స రి ||
ప న్న | కొ ని తి రు || గే రు | బ హు రూ - ||

రి సా | సా సా || సా రి | గా రి రి || స సా | స ని సా ||
పా - | లు - || ఎ న్ని | క ది న || ము ల | లో - - ||

స̇ రి̇ ని | స̇ ద ని ప || ద మ ప | గ మ ష ప ||
నె - వ్వ | రి కి నే - || నే - - | మి - గ ల ||

మ ద ద | ద వ ప మ || మ ప మ | గా రి ||
ది - న్ని | టి కి నీ - || వే - - | నా కు ||

గా మ | గా రి రి || సా - | - - - - ||
యిం ది | రా ర మ || ణా - | - - - - ||

॥ పాయ ॥

**అవతారిక :**

ఇందు 'ఋణాను బంధ రూపమున మానవులు బంధితులు కాకుండునట్లు చేసుకొను'డని చెప్పుటకు అయ్యవారు కొన్ని యుదాహరణలు యిచ్చియున్నారు. "అప్పులేని సంసారము, తప్పులెన్నుచు, తగ్గింపబడని జీతము, కంతలు లేకుండ నుండెడి గుడిసె, చింతలు లేని మనసుతో త్రాగుటకు అంబలి, తిరుగుబోతు కాని తరుణి, వింత వింత అడ్డంకులతో నుండెడి సంపద, ఇతరులచే తిట్లు తినకుండెడి బ్రతుకు, అవుసరము లేని వారిచే తాకబడక శుచిగా నుండెడి కూడు, రట్టు కాకుండ నుండెడి గుట్టు గల జీవితము, శుష్కప్రియములకన్న ఇచ్చినంత దానము, 'ఈతకాయ యిచ్చి తాటికాయ పుచ్చుకొను' సామెత వంటి మేలు, రంపపు కోతల వంటి కోరిక- ఇటువంటి వాటియందు చిక్కుకొనక తృప్తి గలిగి వేంకటాచలపతియందు లగ్నమైన మనసుతో జీవించుట మానవులకు సుఖ మనుచున్నారు.

ఇందు అయ్యవారు వాడిన వాక్యము లొక్కొక్కటియు సామెతల రూపమున వారి కాలమునందు వాడుక యందుండి యుండవచ్చును. ఇందలి సామెతలు ఇప్పటికిని మనకు వినబడుచునేయున్నవి.

**గుజ్జరి—తిశ్రఏక**

అప్పులేని సంసారమైన పాటే చాలును
తప్పు లేని జీతమొక్క తారమైన జాలు ॥ పల్లవి ॥

కంత లేని గుడి సొక్క గంపంతయిన జాలు
చింతలేని యంబలొక్క చేరెడే చాలు
జంతగాని తరుణి యే జాతైన నదె చాలు
వింత లేని సంపదొక్క వీసమే చాలు ॥ అప్పు ॥

తిట్టు లేని బ్రదు కొక్క దిన మైన నది చాలు
ముట్టు లేని కూడొక్క ముద్దెడే చాలు
గుట్టు చెడి మను కంటె కొంచెపు మేలైన జాలు
వట్టి జాలి బ్రదుకంటె వచ్చినంతే చాలు ॥ అప్పు ॥

లంపట పడని మేలు లవలేశమే చాలు
రొంపి కంబమౌకంటె రోయుటే చాలు
రంపపు గోరికకంటె రతి వేంకట పతి
పంపున నాతని జేరే భవమే చాలు ॥ అప్పు ॥

అ : 11(2)–48

ప. గా మ పా ద | పా పా ప మ || గా మ పా ద | పా - పా - ||
అ ప్పు లే ని | సం సా ర - || మై న పా టే | చా - లు - ||

పా ద పా మ | గా మ గా రి || గా మ గా రి | సా - సా - ||
త ప్పు లే ని | జీ త మొ క్క || తా ర మై న | చా - లు - || ॥అప్పు॥

చ. మా మ మా మ | గ మ పా పా || మ ద దా దా | ద ప పా పా ||
కం త లే ని | గు డి సొ క్క || గం - పం తై | నా - చా లు ||

మా ప దా ని | సా స సా ని || సా ఠి ఠి గా | రీ - సా - ||
చిం త లే ని | అం బ లొ క్క || చే రె డే - | చా - లు - ||

సా ఠి గా ఠి | స స ఠి సా ని || సా ఠి గ ఠీ | స స సా సా ||
జిం త గా ని | త రు ణి యే - || జా తై - న | న దె చా లు ||

సా ఠి సా ని | సా ద నీ ప || దా మ పా గ | మా ద పా - ||
విం త లే ని | సం ప దొ క్క || పీ స మే - | చా - లు - || ॥అప్పు॥

**అవతారిక :**

మానవులు సాధించవలసిన పరమావధి నిన్ను శరణు వేడుటయే! వారు పొందదగిన యోగము, నీ యందు మనసును లగ్నము చేయుటే! చరా చర మయమగు సృష్టి యందంతటను నీవే యనియు, నీ యందే సృష్టియున్నదనియు, జీవులను వారి శరీరములును నీ యధీనమునందే యున్నవనియు నీవే మాయను సృష్టించినను, మాయ యందు జారవని, అణువుకన్న చిన్నవైయె బ్రహ్మముకన్న యెక్కువై పూసలలో దారము వలె నున్న నీవే తన యందు గల పరమాత్మవని జీవాత్మ తెలుసుకొనుటయే వేదాంతమనియు, ఆత్మకు లోపల, బయట ఉండెడి నీ యునికియే వైకుంఠమనియు, యీ ఆనందమును తెలిసి నిన్ను భజించెడి వారమగు మమ్ము కాపాడుమని పరమ సత్యమును, వేదసారమును అగు పరమాత్మ తత్త్వమును ఇందు అయ్యవారు చెప్పుచున్నారు.

**గుజ్జరి — ఆది**

ప. ద ప ద మ ప గ మ గ | పా మ గ | రి స స ||
హరిహరి నినుసక | లాంత - | ర్యామివి ||

సా రి గ గ మ ప మ | మ ద దా | పా - - ||
ఆత్మద లచుచే - | యో - గం | బు - - ||

మ మ మా మ మ మా | గ మ ప ద | ప మ గా ||
శ ర ణా గ త ర | ణా - మ ణి | ని - న్నే ||

మ గ మ ద ప మ గా | గ గ రి రి | సా - - ||
శ ర ణ నియెడి దే | తు ది ప ద | ము - - || ॥ హరి ॥

చ. స రి రీ రి రీ | స రి గ మ | గ రి రి స ||
నీ - యం దేయీా | స చ రా - | చ ర ము ను ||

స్రీ స స రీ స రి | గా మ గ | - రి రి స ||
నీ వె చ రా చ ర | మం దు ని | - త్య ము ను ||

సా రి గ గా గ రి | రి మ మ ప | గా మ మ ||
పా య క వుం డు ట | గ ని త ల | పో యు ట ||

గ గ మా పా ప మ | మ ద దా | పా - - ||
ప ర మా ర్థం బు ల | సా - రం | బు - - ||

మా ప ప దా ని ని | స ని స ద | ని ప ద ప ||
కా య ము జీ వు డు | నీ - య ధీ | - న మై - ||

మ మ ప ప ద ద ని ని | ప ప ద ద | నీ స స ||
క లు గ గ ప్ర కృ తి యు | బు రు షు డా | - ని టు ||

స̇ రి̇ గ̇ మ̇ గా̇ రి̇ రి̇ | స̇ రి̇ గ̇ గ̇ | రి̇ రి̇ స̇ స̇ ||
మా - య అముంతు వు | మా - య కు | జొ ర వ ని ||

స̇ ని స̇ ద ని ప ద మ | పా మ గ | రి రి సా ||
మ తి ద ల పో - యు ట | సు జ్ఞా - | నం - బు || ॥ హరి ॥

**అవతారిక :**

ఎచట నుండియో ఇచటికి వచ్చి తిరిగి యెచటికో పోయెడి ఈ జీవునకు అశాశ్వతమగు ఇందును అందును పరమాత్మయొక్కడే శాశ్వతముగా పొందదగినవాడు అని చెప్పుచు 'భవకూపములో పడి బాధ పడుచున్నప్పుడు సన్నిహితుడగు బంధువు యితడే! స్వర్గనరకముల యందు ఈతని చేతనే త్రిప్పబడుచుందుము గనుక ఇతనినే దిక్కని నమ్మినచో యిక కష్టములుండవని, పశు పక్షి, మృగాదులయందు జన్మించి నోరెత్తి బాధలను చెప్పుకొనలేక తనను తాను తన కంటె బలవంతుల బారి నుండి రక్షించుకొనలేక, దుఃఖములు బాధలు పొందుచుండెడి వేళ దిక్కై, మనలను కాపాడెడి వాడితడేనని, మానవ జన్మమెత్తినను శిశువుగా వృద్ధుడుగా ఇతరుల దయాధర్మములకు తలయొగ్గి యుండవలసిన నాడును, కామ సుఖములలో చొక్కిమై మరచిన సమయముల యందును, యీవల నావల సర్వమునకును దిక్కని నమ్మిన ఇతడు నన్ను చేరదీసి కాపాడుచున్నాడు. మరువక శ్రీ వేంకటేశ్వరుని సేవించుట మంచిది— అని తన మనసునకు చెప్పుకొనుచున్నట్లు అయ్యవారు లోకులకు విశదీకరించుచున్నారు.

**గుజ్జరి—ఆది**

ఇతరము లన్నియు నడు మంత్రములే యెంచి చూచినను యింతాను
హితవగు బందుగు డీశ్వరుడొకడే యీతని మరవకు మీ జీవాత్మ ॥ పల్లవి ॥

భవ కూపంబుల బడలెడి నాడు పాయని బంధువు డితడొకడే
దివి స్వర్గంబును దేలెడినాడు తిరుగబాయకె (డె) పుడితడొకడే
నవ నరకంబుల నలగెడినాడు నటనల బాయ డితడొకడే
యివల నవల హృదయేశుడు విష్ణుడు యీతని మరవకు మీ జీవాత్మ ॥ ఇతర ॥

పశు మృగాదుల వొడలెత్తినవ్పుడు పాయని బందుగు డితడొకడే
విశదపు దుఃఖపు వేళలనైనా విడువని బంధుగు డితడొకడే
శిశువైనప్పుడు వృద్ధైనపుడు చిత్తపు బందుగు డితడొకడే
దశావతారపు విష్ణుడొకడె యీతడని తలచు మీ జీవాత్మా ॥ ఇతర ॥

భావజ కేలిని జొక్కినప్పుడు ప్రాణబంధువు డితడొకడే
యీవల నావల నిహపరములలో నిన్నిటి బంధువు డితడొకడే
దైవము దానని శరణనియెడు నను దగ్గరికాచెను యితడొకడే
(శ్రీ) వేంకటగిరి నాయకు డితడే చేరి భజించుము జీవాత్మ ॥ఇతర॥

అ : 11(1)-104

ప. స ని స ద ని ప ద మ । ప ప మ గ । మ మ పా ॥
ఇ త ర ము ల - న్ని యు । న డు మం - । త్ర ము లే ॥

మా గ మా ప ద మ । మ ప ద ని । సా - - ॥
యెం చి చూ చి న ను । యిం - తా - । ను - - ॥

స రి గ మ గా రి రి । స రి గ గ । రి రి సా ॥
హి త వ గు బం ధు గు । డీ - శ్వ రు । డొ క డే ॥

స ని స ద ని ప ద మ । పా మ ప । ద ని సా ॥
యీ - త ని మ ర వ కు । మీ జీ - । వా - త్మ ॥ ॥ ఇతర ॥

చ. ద ద దా పా ప మ । మ ప ప మ । గా మా ॥
భ వ కూ పం బు ల । బ డ వె డి । వా డూ ॥

గా మ మ పా ప మ । మ ప ద ద । పా - - ॥
పా య ని బం ధు వు । డి త డొ క । డే - - ॥

మ మ మా మా మ మ । మ గ మ ద । పా ప మ ॥
ది వి స్వ ర్గం బు ను । దే - లె డి । నా డు - ॥

మ గ మ మ ద ప ప మ । గ గ రి రి । సా - - ॥
తి రు గ బా - య డె వు । డి త డొ క । డే - - ॥

స రి గ మ పా ప మ । ప ద ని ని । సా సా ॥
న వ న ర కం బు ల । న ల గె డి । నా డూ ॥

స̇ ని స̇ ద ని ప ద మ । ప ప ద ని । సా̇ - - ॥
న ట న ల ణా - య డు । ఇ త డొ క । డే - - ॥

స̇ రి̇ గ̇ మ̇ గ̇ గ̇ రి̇ రి̇ । సా̇ రి̇ స̇ । ని స̇ స̇ ॥
యు వ ల న వ లహ్లా ద । యే శు డు । వి ష్ణు డు ॥

స̇ రి̇ స̇ ద ని ప ద ప । పా మ ప । ద ని సా̇ ॥
యూ - త ని మ ర వ కు । మీ జీ - । వా - త్మ ॥

॥ ఇతర ॥

**అవతారిక :**

"వగామై దయ పుట్టి మమ్మేలితివి. మేలిమి గల దెల్ల మెరిసెను. అందము, జాణ తనము గలిగిన మా చేయి పై నాయెను. మాకు చనవులిచ్చితివి. ఓ వేంకటేశ్వరుడా రావయ్యా మావద్దకు." అని రూప గర్వితులగు సుందరీమణులు స్వామిని ప్రార్థించుచున్నారు.

**రాగ లక్షణం :**

సింధు రామక్రియ ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయామాళవగౌళ జన్యముగా వినబడుచున్నది. ప్రాచీన లక్షణకారులు దీనిని 45వ మేళమగు శివ పంతువరాళి జన్యమని చెప్పుచున్నారు. కాని యిందు రచనలు మాత్రము కానవచ్చుటలేదు. 15వ మేళ జన్యముగా నున్న సింధురామక్రియ యందు త్యాగరాజస్వామి వారి కీర్తనలు ఒకటి రెండు కనబడుచున్నవి గనుక యిట్లే తాళ్ళపాక వారి రచనలు స్వరపరుచుట జరిగినది.

స గ మ ప ద ని స ఆరోహణ
స ని ప ద ప మ గ రి గ స అవరోహణ

**సింధురామక్రియ — త్రిపుట**

మేలు గలంతాను మెరసేను
తాలిమితో నిట్టే మా దండకు రావయ్యా ॥ పల్లవి ॥

మన సొక్కటాయ నింక మామాట వింటివి
నన్నుపై నా సెలవికి నవ్వు వచ్చెను
చెనక గానే నాకు చేయి మీదాయ నేడు
తనిసితిమింకాను మా దండకు రావయ్యా ॥ మేలు ॥

చలమెల్ల నీడేరె చనవు మాకిచ్చితివి
కళలు నా మోమున గడునిండెను
కొలువులో నుండగానే కూటములు దైవారె
తలకొని యిపుడు మా దండకు రావయ్యా ॥ మేలు ॥

నిండెను సంతోసము నెమ్మది నన్నేలితివి
మెండుగ (శ్రీ) వేంకటేశ మెచ్చితి నిన్ను
పండు మోవి తేనె తోనె ఫలమొందె రతులెల్లా
దండియై యున్నాడవు మా దండకు రావయ్యా ! ॥ మేలు ॥

శృం : 19–123

ప. - - స ని | సా గా || మ ప మా - గ | మా పా ||
- - మే - | లు గ || లం - - - - | తా ను ||

- - ద ద | పా - మ గ మ ప ద || ప మ గ మ ప మ | గా రి గ ||
- - మె - | ర - - సే - - - || - - - - - - | ను - - ||

సా గ మ | ప ద ని సా || స ని సా రి స ని స | స ని ప ద పా ||
- తా - | లి - - మి || తో - - - - - - - | ని - - - ట్టే ||

పా స ని | ప ద ప మ పా || గ మ ప ద ప మ | గ రి గా || సా
మా దం - | డ - - - కు || రా - - - - - - | వ - య్యా || - ॥ మేలు ॥

చ. - - ప ద | పా పా || ప మ గ మ ప ద | ప మ గ రి గా ||
- - మ న | సొ క్క || టా - - - య - | నిం - - - కా ||

మా గ మ | పా ద ప ప మ గా || స ని ధ ధ ప | ధ ని సా ||
- మా - | టా - - - - - ట || విం - - - - | టి - వి ||

- - స గ | మా పా || ప ద ని ప ద మ | ప ప మ గ మా ||
- - న ను | పై నా || నె - - ల - - | వి - - - కి ||

- - గ మ | పా  ని ద ని సా స ని || ప ద మ ప గ మ | పా పా ||
- - న - | వ్వు - - - - - - - || వ - - - - - - | చ్చె ను ||

- - గ మ | పా ద ని || సా - | సా రి స ని సా ||
- - చె న | క గా - || నే - | నా - - - కు ||

సా స గ | మా గ రి గా || స సా రి స ని | సా సా ||
- చే - | యి మీ - - || దా - - - యె | నే డు ||

- - స గ | మ గ స రి సా || స ని స ప ద వ | ద ని సా ||
- - త ని | సి - - - తి || మిం - - కా - - | ను - మా ||

- - స ని | ప ద ప మ పా || గ మ ప ద ప మ | గ రి సా ||
- - దం - | డ - - - కు || రా - - - - - - | వ - య్యా ||

సా స ని | సా గా ||
- మే లు | గ లం ||

**అవతారిక :**

నాయిక ముగ్ధ, స్వాధీనపతిక, ఆమె చిలిపి చేతలను మందలించుచు 'నీవు జాణవు, తెలివైనదానవు నీ కన్న అనుభవము గల దాననైన నా మాటలు వింటివా నీ నాథుడు ఇంకను నీకు పరవశుడై యుండును నీవు చిలిపి చేతలు మాని ఆతని కిష్టములు, అనుకూలములునగు పనులను జేసి ఆనందింప జేయుము.' అని చెలికత్తె బుద్ధులు గరపుచున్నది. ఇందు ఓర్పు, నేర్పు, సిగ్గు యెగ్గు లెన్నని తనను, మొదలగు మంచి గుణములు గల నాయిక నాయకుని యెట్లు వశపరుచుకొనగలదో అయ్యవారు హృద్యంగముగా చెప్పియున్నారు.

సింధురామక్రియ — రూపకం

యింకనైన రావే యిదే వచ్చె రమణుడు
మంకు లేకుండితేను నీ మగడిట్టె మెచ్చును ॥ పల్లవి ॥

సిగ్గు గల దానికి చెల్లును పంతము లెల్లా
యెగ్గు పట్టని దానికి నెనయు బొందు
వొగ్గి వినయపు దాని కొన గూడు వేడుకలు
వెగ్గళించక నా బుద్ధి వింటె బతి మెచ్చునే ॥ యింక ॥

వోరిచి వున్న దానికి వొద్దికా జుట్టరికము
నేరిచిన దానికి నిండు సిరులు
మేరతో నవ్వేదానికి మిక్కుటమౌ రాజసము
యీ రీతి నా బుద్ధి వింటే నీ విభుడు మెచ్చునే ॥ యింక ॥

గుట్టున నున్న దానికి గుణము లోజకువచ్చు
దిట్టయైన దానికి తేకువ గల్గు
నెట్టన శ్రీ వేంకటేశ నిలయుడు నిన్ను నేలె
యిట్టినా బుద్ధి వింటే నీతడింకా మెచ్చునే ॥ యింక ॥

శ్లో : 18—268

అ. - ప । గ మా ప ॥ ద ప మా । పా - - ॥
- ఇం । క నై న ॥ రా - - । వే - - ॥

స స ని । ప ద పా - మ ॥ గ మ ప ద । ప మ గ మ గ రి గా ॥
ఇ దె - । వ - చ్చె - - ॥ ర - మ - । - - ణు - - - డు ॥

- మ । ప పా ద ప మ గ మ ॥ ప ద । ప ని సా ॥
- మం । కు తే - - - - కుం ॥ డి తే । - ను నీ ॥

సా స ని । ప ద పా ॥ గ గ ప ద । ప మ గ మ గ రి గా ॥
మ గ - । డి - ట్టె ॥ మె - - - । - - చ్చు - - - ను ॥ ॥ ఇంక ॥

చ. - మ గ । మ ప పా ॥ ప ద ని । ప ద మ ప ॥
- గు - । ట్టు న ను ॥ న్న - - । దా - ని కి ॥

- గ మ । గ సా స ని ॥ ప ధ । ప ధ ని సా ॥
- గు ణ । ము లో జ - ॥ కు - । న చ్చు - ను ॥

- గ । మ పా ద ॥ ప ద ని ద । ప మ ప ప మ గ మా ॥
- ది । ట్ట యె న ॥ దా - - ని । - - కి - - - - ॥

గ మ ప మ । గ రి గా - ॥ స గ । మ పా - ॥
తే - - - । కు - వ - ॥ క - । ల్గు ను - ॥

- ప । ద ప ని ॥ సా । స ని స గ గ ॥
- నె । ట్ట న ట్టి ॥ వేం । క - టే - శ ॥

- గ మ । - గ రి గా ॥ ప మ గ । మ గ స స ॥
- ని లు । - యు - డు ॥ ని - - । న్ను సే - రె ॥

\- సం । సం సా సం ని ॥ పద । పద ని సా ॥<br>
\- ఇ । ట్టి నా - - ॥ బు - । ద్ధి విం - శే ॥

\- సం ని । పద పమ ॥ గ మ ప ద । ప మ గ మ గ రి గా ॥<br>
\- నీ - । త డిం కా - ॥ మె - - - । - - చ్చు - - - నే ॥ ॥ ఇంక ॥

**అవతారిక :**

"నేను ఆతని చిన్నెలు చేతలు చూచి మేల మాడుకొనగా, నీవు ఇవన్నియు నాతనికి చెప్పి, నాపై కోపము తెప్పించి, పుణ్యము కట్టుకొనుచున్నావు ఇంకను ఆతనికి బుద్ధులు చెప్పి నాపై మనసు విరచుటకు చూచుచున్నావు." అని చెలిమికత్తెను దెప్పి నాయిక కోపగించుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

సావేరి పూర్వ ప్రసిద్ధములగు రక్తి రాగములలో నొకటి. ఇది మేళకర్తల ఆవిర్భావమునకు ముందు నుండియు వాడుకయందున్న రక్తిరాగము. ఐనను ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయామాళవగౌళ జన్యముగా చెప్పుకొనుచున్నాము. స రి మ ప ద స । స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. తారస్థాయి యందు స రి ప మ గ రి సా అను ప్రయోగము గలదా అనియు, 'స ని స' మ గ మ అను ప్రయోగములు కలవా అనియు, విద్వాంసుల మధ్య వాదోపవాదములు గలవు. కాని ఇప్పుడు లభ్యమగుచున్న రచనలలో ప్రాచీనములగు క్షేత్రజ్ఞులవారి పదములలో ఇట్టి ప్రయోగములు గలవు. కనుక వాటిని పాటించినచో తప్పేమియు లేదు. ఆరోహణావరోహణములపై ఆధారపడక రాగచ్ఛాయలను గమక వరికాదులను తెలిసి పాడుకొన దగిన అఠాణా, ఆహిరి, సైంధవి, హుసేని వంటి రాగములలో నిదియొకటి అని తెలిసికొనినచో ఇట్టి వాదోపవాదములకు తావుండదు.

**సావేరి—త్రిపుట**

కానీవమ్మా యీ పుణ్యము గట్టుకోవమ్మా
పూని యాతని కెంతేసి బుద్ధులు చెప్పేవు ॥ పల్లవి ॥

నే నాతడు రాకుండగా నేరము లెంచిన వెల్లా
కానుకగా బట్టితివి కాంతునికి
మేనిపై మచ్చము చూచి మెల్లనే నే నవ్వితేను
నిక్కిగా నాతని షంతము రేచేవు ॥ కానీ ॥

తక్కి వుండిన యాతని దప్పులు వట్టినవెల్లా
దక్కన బోసి చూపితి వాతనికి
వెక్కసపు జెమటకు వెంగెము నేనాడితేను
వక్కణ చెప్పె (ప్రియ) తనికి వాసి పుట్టించేవు ॥ కాని ॥

దిమ్మరై రై తిరుగగా నేదిట్లు దిట్టినవెల్లా
అమ్మరో పూసగుచ్చి నట్లప్పగించితి
వుమ్మడి శ్రీ వేంకటేశు డొనగూడి నన్ను నంటె
ఇమ్ముల నిది చెప్పుమనె (నియె) మ్మెలు సేసేవు ॥ కాని ॥

శృం : 19–581

ప. - - స రి । పా - మ గ స ॥ రీ - । సా స ని ఫా ॥
- - కా - । నీ - - వ - ॥ మ్మా - । యీ పు - - ॥

ధ స స రి । పా - మ ద ప ॥ మ ప ద సా - । ని ద ప మ గ రి ॥
ణ్యము క - । ట్టు - - కో - ॥ వ - - - - । మ్మా - - - - - ॥

సా మ ప । దా సా ॥ సా రి గా స । రీ సా ॥
- పూ - । ని యా ॥ త - ని - । కేం తే ॥

సా ప ద । స ని ద పా ॥ మ ప ద ద ని మ । గ రి సా ॥
సి బు - । ద్ధు - - లు ॥ చె - - - - - । ప్పే - వు ॥ ॥కాని॥

చ. - - ద । పా ప ప ॥ ద ద పా - మ । గ స రీ ॥
- - నే । నా త డు ॥ రా - - - - । కుం - డ ॥

సా స రి । ప మ గా రీ ॥ సా స । స ని పా ధా ॥
గా నే - । ర - - ము ॥ లెం చి । న - - ధి ॥

సా స రి । మ మ మా ॥ మ ప మ గ స । రి మా ॥
ల్లా కా - । ను క గా ॥ బ ట్టి - - - । తి పి ॥

- - స రి । మ ప ద ని ని ప ద ॥ పా ప మ । పా దా ॥
- - కాం - । తు - - - - - - ని ॥ కి మే - । నీ పై ॥

స సా । సా రి స ని ప దా ॥ సా ప ద । స రి గ రి స ॥
మ చ్చ । ము - - - - చూ ॥ చి మె - । - - ల్లె - నే ॥

రి సా । స ని పా దా ॥ సా స రి । ప మ గా రి ॥
నే న । న్వి - - తే ॥ ను దా - । ని - - కి ॥

సా స । స ని పా దా ॥ పా మ । ప ద స ని ద ప ॥
గా నా । త - - ని ॥ వం త । ము - - - రే - ॥

మ ప ద సా - । ని ద ప మ గ రి ॥ సా స రి । పా - మ గ స ॥
చే - - - - । వు - - - - - ॥ - కా - । నీ - - వ - ॥

**అవతారిక :**

"ప్రియం బనురాగము గలిగి నీవే నా ప్రాణపతివని నమ్మియున్న దానను. పెదవులపై యిచ్చకములు పలికి నవ్వుతాల మాటలాడి నన్ను మైమరపింపకు. చనవరివై ఊడిగాలు చేసి ముచ్చట లాడి నన్ను మభ్యపెట్టకు. ఓ శ్రీ వేంకటేశ్వరుడా! నీకు ప్రియ అలమేలు మంగనై యున్నదానను. నీవే యోచించి తగవులు బెట్టక నీ తరుణినగు నన్ను పలుకొనుము," అని అమ్మవారు స్వామివారికి విన్నవించుకొనుచున్నారు.

**సావేరి—రూపకం**

వేవేలకు నీకు నీవే విచారించి మన్నించు
భావించె యెన్నడును బాయకుమీ నన్నును ॥ పల్లవి ॥

చిగురు మోవి మాటలు చిత్తాన బట్టినా
నగు తానాడిన వల్లా నమ్మికయ్యీనా
మొగివిచ్చని నా లోని మోహము చూతువు గాని
తగవుల బెట్టకు మీ తరుణి నే నీకు ॥ వే వేలకు ॥

మునుకొన్న వినయాలు ముచ్చటలు దెలిపినా
చనవరి వూడిగాలు చవి లేచినా
అనువైన నా తగులాయము లెంతువు గాని
పెనగించు కొనకు మీ ప్రియురాల నేను ॥ వే వేలకు ॥

జవ్వనపు మదములు నందిమాటలాడినా
కువ్వలైన గుణములు కొంగు వట్టినా
యివ్వల శ్రీ వేంకటేశ ఇటు నన్ను గూడితివి
మవ్వమైన అలమేలు మంగ జుమీ నేను ॥ వే వేలకు ॥

రేకు : 19—241

ప. - స రి | మా మ మ || ప దా ద | ప మ గా - రి సా ||
- వే - | వే ల కు || నీ - కు | - - నీ - వే - ||

ప ధ | - సా రి || మా | - ప మ గ రి స రి ||
వి చా | - రిం చి || మ | - న్నిం - - - చు - - ||

స రి | మ ప ద ప దా || ప ద మా | ప ద సా ||
భా - | విం - - - చి || ఎ - - | న్న డు ను ||

ప ద సా | స ని దా ప మ || ప ద మా | గ రి సా ||
బా - - | య - కు మీ - || న - - | - న్ను ను || ||వే వేలకు||

చ. - మ మ | మ మా మ || ప ద ప మ | గ గ రీ సా ||
- చి గు | రు మో వి || మా - - - | టె - - లు ||

- స రి | పా - మ ద ప || మ ప ద స | ని ద ప ద మ పా - ||
- చి - | త్రా - - - న || బ - - - | - - ట్టీ - - నా - ||

- మ మ | మా మ మ || ప ద ప మ | గా రి స ||
- న గు | లా నా - || డి - న - | వ ల్లా - ||

- స రి | మా ప మ దా || మ ప ద స | ని ద ప ద మ పా - ||
- న - | మ్మ క - య్యా || - - - - | - - నా - - - - ||

- ప మ | ప ద స స || స రి గ | రి స రీ ||
- మొ గి | వి - చ్చ ని || నా - - | లో - ని ||

- స రి | ప మ గా || రి రి | సా సా ||
- మో - | హా ము చూ || తు వు | గా నీ ||

- ప ద | - గ రీ సా || స ని పా | దా మ ప దా ||
- త గ | - వు ల బె || ట్ట - కు | మీ - - - ||

ప ద | సా స ని దా || ప మ ప ద | - ప మ గ స రీ ||
త రు | ణి నే - - || నీ - - - | - కు - - - - || ||వే వేలకు||

**అవతారిక :**

ఇందు నాయిక జాణ, నాయకుని యందు గల తన యనురాగమును తలచునో యనుచు తనయందు ప్రేమ గలిగి వచ్చిన అతనిని దండింపనేలయని చెలులకు చెప్పుచున్నది. ఊహగల వారికి ఉపమానములు తోచును. ఇష్టమైన వారి పొందు ఇంపేయగును. మనసు కలిసితే మాటలన్నియు చవులే యగును. ఇట్లు నా యందు కరుణ గలిగి వచ్చిన స్వామిని వెగటులాడి వంచించి నొప్పింపనేల అని వక్కాణించు చున్నది.

**సావేరి — రూపకం**

తన చిత్తము వచ్చితే తానే కరుణించీ గాక
ఘనుడైన రమణుని గక్కసించ నేటికి ॥ పల్లవి ॥

వూహ గల వారికి నుపములు దోచును
దాహమణచే వారికి దప్పి(దే) దీరును
మోహము గల వారికి మునుకొను సంతోసము
వోహో రిత్తవారికి నోడబాటు లేటికి ॥ తన ॥

మనసు వచ్చినప్పుడు మాట లెల్లా జవులౌను
తనిసి వున్నయప్పుడు తాలిమినిండు
ననిచిన యప్పుడు నవ్వులు తానే వచ్చు
పనిలేని యప్పుడు పచారించ నేటికి ॥ తన ॥

కూటములు గలిగితే గుణములు చక్కనౌను
పాటించి పొంద గలిగితే బంత మీడేరు
యీటున (శ్రీ) వేంకటేశు డిదివో నన్ను నేలె
మేటా మేటి రతులలో మెఱయగ నేటికి ॥ తన ॥

ప. - ప ద | పా పా ప మ || గా | రి స రీ ||
- త న | చి త్తము - || వ | చ్చి తే - ||

- మ ప | ద సా - స ని దా || పా | ప మ ద ద ప మ గ రి ||
- తా - | నే - - క - రు || ణిం | చీ - గా - - - - - - ||

మ ప ద | సా సా || స స రి | గ స రీ ||
క ఘ ను | డై న || ర మ - | ణు - ని ||

గ గ రి స | ని ద రి స ని ద ప మ || ప ద స | - ని ద ప మ గ రి ||
గ - - - | క్క - - సిం - - - చ - || నే - - | - టి - - - కి - || ||తన||

చ. - ప | ద ప పా - మ || ద ప | ద ప దా ||
- వూ | హా గ ల - - || వా - | రి - కి ||

- మ మ | మా ప ద ప మ గ స || రి స | రి మా - ||
- వు ప | మ లు - - - - - - || తో - | చు ను - ||

- స రి | మ మ మా || ప ద ప మ | గా రి స ||
- దా - | హా మ ణ || చే - - - | వా రి కి ||

- స రి | మా పా ప మ || దా | పా - - ||
- ద - | ప్పి దే - - || రు | ను - - ||

- ప ద | స సా స || స రి గ | స రి స స ||
- మో - | హా ము గ || ల - - | వా - రి కి ||

స రి ప మ | గ రి సా || స ని దా | మ ద సా ||
ము - ను - | కొ ను సం || తో - - | - స ము ||

ప ద | స̇ రి̇ గ̇ రి̇ || స̇ స̇ | స̇ ని పా ద ద ||
వో - | హో - రి త్త || వా - | - - - రి కి ||

గ̇ గ̇ రి̇ స̇ | ని ద రి̇ స̇ ని ద ప మ || ద ద ప మ | గ రి స రి మా ||
నొ - డ - | - - బా - - - టు - || లే - - - | టి - కే - - || ||తన||

**అవతారిక :**

"ఒకరినొకరు విడువరాని తమకముతో చూచుకొనుచు ముచ్చటల నాడుకొనుచు నుండెడి ఓ వేంకటేశ్వరుడా! నీకును అలమేలు మంగమ్మకును గల అనురాగపు సంపదలు ఎవరికిని తెలుసుకొనుటకు వలనుపడదు" అని చెలిమికత్తెలు అమ్మవారికిని స్వామికిని సేవలు చేయుచు ఆడుకొనుచున్నారు.

**రాగ లక్షణం :**

గౌళ ఘనరాగ పూర్వపంచకమునందు రెండవది. ఇది ప్రాచీనరాగములలో నొకటి. ఇందలి స్వర సముదాయము శృంగార పదములకు ఒదుగునట్లు నప్పించుట అతి కష్టము, మధ్యకాల, దురిత కాలములలో తప్ప ఈ రాగమును నేడు మనము వినుచుండుట లేదు. అభినయ ప్రధానములగు పదములు ఇందు విళంబకాలమున పాడినచో ఎట్లుండునో ! ఇట్టి రస సృష్టి చేసిన తాళ్ళపాక వారికి జేజేలు !

స రి గ మ రి మ ప ని స ।

స ని ప మ రి గ మ రి స । అనునవి ఆరోహణావరోహణములు.

ఇది ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళకర్త మాయామాళవగౌళ జన్యము.

గౌళ—త్రిపుట

ఏమేమి మర్మములో ఇద్దరికే తెలుసును
వేమారు పులకలతో విఱ్ఱవీగేరు ॥ పల్లవి ॥

నిలువు గొప్పల తోడ నీవు నాకె మాటలాడి
సెలవుల నవ్వులతో చిమ్మిరేగేరు
కొలదికి గలువలు కొప్పుల నుండి జారగ
మెలుపున మిమ్ము మీరే మెచ్చుకొనేరు ॥ ఏమేమి ॥

సందడించే సొమ్ములతో సరసము లాడుకొంటా
కందువ సిగ్గులతోడ గడుమించేరు
గందపు లప్పలు మేన గల గల పై రాలగ
విందులుగ నొండొరులు వేడుకల మించేరు ॥ ఏమేమి ॥

ఘుమ్మెలతో (శ్రీ) వేంకటేశ యలమేల్మంగతో
వుమ్మడి రతుల ననురుసు రనేరు
దొమ్మి చెమట మేనుల దొట తొట వడియగా
చిమ్ముచును ముత్తేల సేసలు చల్లేరు || ఏమేమి ||

శ్రృం : 19–108

ప. - - ప | ప మ గ మ రీ || స ని పా | ని ని సా ||
- - ఏ | మే - - - మి || మ - - | ర్మ ము లో ||

- - ఫ ని | స రి రీ || సా ని స రి స | రీ రీ ||
- - ఇ - | ద్ద రి కీ || తె లు - - - | సు ను ||

- - రి మ | పా నీ || స స ని ప | ని స రి స రీ ||
- - వే - | మా రు || పు ల - - | క - ల - తో ||

రీ స | స ని ప ప మ || రి గ మ రీ - | స ని ఫ ని స రీ ||
- వి | ఱ్ఱ - - వీ - || గే - - - - | - - - రు - - ||

సా - | - - - - ||
- - | - - - - || || ఏ మేమి ||

చ. - - ప ప | పా పా || ప మ గ మ | రి రి సా ||
- - ని లు | వు గో || వ్వు - ల - | తో - డ ||

- - ప | నీ సా || రీ మ | పా నీ ||
- - నీ | పు నా || కే మా | ట లా ||

పా స ని | పా వ మ || ప ని సా రి స ని స | రీ రీ ||
డి సె ల | వు ల - || న - వ్వు - - - - | ల తో ||

- - స రి | ప మ గ మ రీ || స ని ప ని స రి | సా సా ||
- - చి - | మ్మి - - - రే || గే - - - - - | రు - ||

- - ప ని | సా సా || రి రి సా స ని | స స ని ప ని ని ప మ ||
- - కొ ల | ది కి || క - లు - - | వ - - - లు - - - ||

పా రి మ | పా ని సా || సా రి స ని స రీ | సా సా ||
- కొ - | ప్పు - ల || నుం - - డి - - | జా ర ||

సా ప ని | సా సా || స ని పా | ప మ పా ||
గా మె లు | పు న || మి - మ్ము | మీ - రే ||

- - రి మ | ప ని స రి స ని ప మ || రి గ మ రీ - | స ని పా ని స రీ ||
- - మె - | చ్చు - - - కొ - - - || నే - - - - | - - - - - - ||

సా ప | ప మ గ మ రి ||
రు ఏ | మే - - - మి ||

**అవతారిక :**

ఇందలి నాయిక బాల ముగ్ధ. తన భావములను చనువు గల నాయకునితో చెప్పుకొనును "ఏమియు నెరుగని నన్ను తెచ్చి ఒకటొకటియే నేరిపి నాకు ఆశలు కల్పించితివి. మా యింటికి వచ్చి నన్ను కూడితివి. చిన్నతనము నుండి నాచే సేవలు చేయించుకొంటివి. ఇప్పుడు నన్ను దూరముచేసితి వేని అపకీర్తిని నేను భరింపలేను. నా యాశలు రక్షించుటయే నీకు పుణ్యము సుమీ" అని నాయకుడగు (శ్రీ) వేంకటేశ్వరునితో చెప్పుకొనుచున్నది.

**గౌళ—రూపకం**

ఓసరించి యేమిటికి నోపినట్టి దాన గాను
ఆసల రక్షించు పుణ్యమదే సుమ్మీ యికను ॥ పల్లవి ॥

ఊరకున్న నన్ను దెచ్చి వొకటొకటే నేరిపి
యీ రీతినె చనవిచ్చి యింత సేసితి
నేరుపు నేరా లెంచవు నీవు గాచే వాడవే
గోరపెట్టి విరహాన గుమ్మకుమీ నన్నును ॥ ఓస ॥

చిన్ననాడే నన్ను దెచ్చి సేవలు సేయించుకొని
యిన్నిటా బెద్దరికాన యింత సేసితి
వన్నెలు యెప్పుడు సేసేవే వలపు నే నెరుగుదు
వున్న మాయలకు నన్ను వొడ్డకుమీ యికను ॥ ఓస ॥

మా యింటికి విచ్చేసి మంతనాన నమ్మికిచ్చి
యీ యెడనే నన్ను గూడి యింతసేసితి
పాయపు (శ్రీ) వేంకటేశ బదికించే దెఱగనా
చాయల అపకీర్తికి చాల సుమ్మీ యికను ॥ ఓస ॥

శ్లం : 13–86

ప. - స | రి సా స ని || స ని పా | ని స రి స రీ ||
- ఓ | స రిం చి - || ఏ - - | మి - టి - కి ||

- రి | గ మా రి || ప మ గ | మ రి స ||
- ఓ | పి న ట్టి || దా - - | న గా ను ||

- రి | మ పా మ || పా | స ని సా రి ||
- ఆ | స ల ర || తిం | చు - పు ణ్య ||

స ని ప | - మ రి గ మా || రి రి | సా - - ||
ము - దే | - సు మ్మి - - || ఇ క | ను - - || || ఓసరించి ||

చ. - రి | రి రీ రి || ప మ గ | మ రి స ||
- ఊ | ర కు న్న || న - - | న్న తె చ్చి ||

- స | రి స ని ధ || నీ | సా రి స రి రి ||
- ఒ | క్క టొ - క్క || టే | నే - - రి పి ||

- స రి | మా ప మ || ప స ని | పా మా ||
- ఈ - | రీ తి నె || చ న - | పి చ్చి ||

- రి | మ ధ ని ప మ రి గ || మ రి | సా - - ||
- ఇం | త జే - - - - - - || - సి | తి - - ||

- స రి | మ పా మ || పా | ప ని స స ||
- నే - | రు పు నే || రా | వెం - చ వు ||

- రి̇ | రి̇ రీ̇ - || రి̇ గ̇ మా̇ | రి̇ రి̇ స̇ స̇ ||
- నీ | వు గా - || చే - - | వా - డ వే ||

- స̇ | రి̇ సా̇ ని || ప ని | స̇ రి̇ స̇ ని సా̇ ||
- గో | ర పె ట్టి || వి ర | హా - - - న ||

స̇ రి̇ స̇ ని | ప ని స̇ రి స̇ ని పా || ప మ రి గ | మ రి సా ||
కు - - - | మ్మ్రె - కు - మీ - - || న - - - | న్ను ను - || ||ఓసరించి||

**అవతారిక :**

నీవు బొంకదలచినచో యెన్నియైనను చెప్పవచ్చును. కాని నీ మొగము చూచినచో నాకు నీవు అబద్ధము లాడుచుంటివనియు, వానిని నిజములవలె ఒప్పించుటకు ప్రయత్నించుచుంటివనియు తెలిసిపోయి నవ్వు వచ్చుచున్నది, ఇంక యీ నటనలు చాలించి మా యింటికి రావయ్యా, నేను సేయు ఉపచారములు గైకొనవయ్యా, ఇప్పటికే అలసిపోయితివి, ఆకు మడుపులందుకొని పవళించవయ్యా" అని ప్రౌఢ, జాణయగు నాయిక నాయకుడగు (శ్రీ) వేంకటేశ్వరునితో ముచ్చటలాడుచున్నది.

**రాగ లక్షణం :**

సాళంగ నాట ప్రాచీనరాగములలో నొకటి. ఇందు శృంగార రస ప్రధానములగు పదములు చెప్పిన ఘనత తాళ్ళపాక వారిదే. ఘనరాగములు, గంభీరములగు నడకలతో నుండి స్వర సంచారములయందు మహావేగముగా పరుగులిడు సెలయేళ్ళ వలె నుండుట సహజము. అట్లే పెద్దలును చెప్పియున్నారు. ఇందు లలితములగు మనో భావములను వ్యక్త పరుచుట కొంత కష్టసాధ్యమగు పనియే. సాళంగనాట 15వ మేళమగు మాయామాళవగౌళ జన్యము. స రి మ ప ద స । స ని ప ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. సావేరి మొదలగు సన్నిహితరాగముల నుండి దీనిని వేరు పరుచుకొను గమక వరికాదుల ప్రయోగములు అధ్యయనము చేయవలసి యుండుటవలననేమో, ఇందు తరువాతి వాగ్గేయకారులు రచనలు చేసినట్లు కనబడదు.

**సాళంగనాట — రూపకం**

నాకు నీ మొగము చూచి నవ్వు వచ్చీని
కాకు సేయ కికనైన గతి గూడవయ్యా ॥ పల్లవి ॥

పలుకులెన్ని గలవు పాటించి బొంకకపో(బో)తే
అలరీనా నీ వంటి అందగానికి
చలము సాధించితివి చక్కనాయ బనువెల్ల
వెలయ మా యింటికి విచ్చేయవయ్యా ॥ నాకు ॥

ఆనలైనైన గలవు అటమటించే నంటే
యీనె పాన నీ వంటి యెమ్మెకానికి
నీ నేర్పు లీడేరె నిన్ను నిందరు మెచ్చిరి
వీనుల చల్ల నాయను పీడె ఖుందవయ్యా ॥ నాకు ॥

వాడ బాశైన గద్దు వోపిక గలిగితేను
విడువక నీ వంటి వేసదారికి
తొడ బడ గూడితివి దొమ్మితో శ్రీ వేంకటేశ
బడలితివి రతుల బవ్వళించవయ్యా ॥ నాకు ॥

శృం : 17–428

ప. - స । రి మ ప ద ప ద ॥ స ని । ప ద ప మ ॥
- నా । కు నీ - - - - ॥ మొ గ । ము చూ - చి ॥

- ప । ద ప పా - మ ॥ ప మ గ రి । ప మ గ రి సా ॥
- న । వ్వు వ చ్చి - - ॥ ని - - - । - - - - - ॥

- న । స రి స ని ప ధ ॥ ప స ని । స రి సా ॥
- కా । కు - సే - - య ॥ కి క - । నై - నా ॥

రి మ । ప ద ప మ ప ద ॥ స ని ప ద । ప మ గ రి సా ॥
గ తి । గూ - - - - డ ॥ వ - - - । - - - - - య్యా ॥ ॥నాకు॥

చ. - మ మ । మ మ మా ॥ ప ద ప మ । ప మ గ రి సా ॥
- ప లు । కు లె న్ని ॥ గ - ల - । - - - - - వు ॥

- స । స ని̣ ప̣ ధ̣ ప̣ ॥ స స ని̣ । స రి సా ॥
- పా । టిం - - చి బొం ॥ క క - । బో - తే ॥

- స రి । మా ప మ గ రి ॥ స రి మ । - పా ద ॥
- అల । రి నా - - - ॥ నీ - - । - వం టి ॥

సం ని ప । ద ప మ గ రి మ ॥ పా । - - - - ॥
యం - - । దగా - - - ని ॥ కి । - - - - ॥

- ద మ । ప ద సా ॥ సం రిం మ గ । రిం సం రిం గా ॥
- చ ల । ము సా - ॥ ధిం - - - । చి - తి వి ॥

- సం రిం । పం మ గ రిం సం రిం గా ॥ రిం రిం । సా సా ॥
- చ - । క్క - నా - - - య ॥ ప ను । తె ల్ల ॥

- ప ద । సాం సా ॥ సం రిం సం ని । ప ద ప ప ॥
- వె ల । య మా ॥ యుం - - - । - టి కి ని ॥

- మ । ప ద సా ॥ సం ని ప ద । ప మ గ రి సా ॥
- వి । చ్చే - య ॥ వ - - - । - - - - య్యా ॥ ॥నాకు॥

**అవతారిక :**

నాయికా నాయకుల భావముల నెరిగిన నెరజాణలగు సఖులు వెంకటరమణునితో "మా సఖి నిన్ను తిట్టినదని పాదములతో తన్నినదని జడతో కొట్టినదని, నీ యెదనెక్కినదని యేమేమో సిగ్గువిడిచి చెప్పుచున్నావు. ఆమెను గయ్యాళియనుచున్నావు. సర్వజ్ఞుడవు సరసుడవునగు నీకు అగ్గలపు మోహమున చెలి చేయు ఇట్టి చేతలయందలి భావములు తెలియవా ? ఆమె నిన్నేలుటకే కదా ఇట్టిపనులు చేయుటయని స్వామికి విన్నవించుచున్నారు." అని అయ్యవారు చెప్పుచున్నారు

**రాగ లక్షణం :**

సౌరాష్ట్రి రాగము ప్రాచీనము. ఇందు రెండు నిషాదములు వచ్చుచుండుట వలన ఇది భాషాంగము 'ని సా ని' అనునప్పుడు కాకలి నిషాదమును 'ద నీ ద పా' అనునప్పుడు కైశిక నిషాదమును పలికించుట సంప్రదాయము ఇందలి ధైవతములన్నియు చతుశ్శ్రుతి ధైవతములే. గనుక దీనిని వాడుకలో చక్రవాకజన్యమని చెప్పుట యుచితము.

వెంకటమఖి సంప్రదాయమున దీనిని మాయా మాళవగౌళ జన్యముగానే చెప్పియున్నారు. సరిగమపమదనిస । సనిదనిదపమగరిస అనునవి ఆరోహణావరోహణములు. ఇది రక్తిరాగము. నిజమునకు సూర్యకాంతము (17) జన్యమా, చక్రవాకం (16) జన్యమా అనునది వివాదాస్పదమగు విషయము. మాయామాళవగౌళ జన్యమనుటకు అవకాశమే యిప్పుడు కనబడకున్నది. ఏలననగా ఇందు చతుశ్శ్రుతి ధైవతము మాత్రమే పలుకుచున్నది. కైశికి, కాకలి నిషాదములు రెండును సమముగానే వచ్చుచున్నవి. గనుక దీనిని 16–17 మేళకర్తలలో దేని జన్యమన్నను అనవచ్చును.

**సౌరాష్ట్రి—ఝంప**

అయ్యయో వెంకటారమణా ఆడుకొందురా చెలిని
గయ్యాళి యని సారె కాకు సేతు రటరా ॥ పల్లవి ॥

సిగ్గు పడక చెప్పేవు చెలి నిన్ను ధిట్టే నని
దిగ్గున వలపుల తిట్టు దీవెనే గాదా
యెగ్గులెన్న వచ్చేవు యింతి జెడ గొట్టె నని
అగ్గలంపు మోహమున కది గుర్తు కాదా ॥ అయ్యయో ॥

పలుమారు దూరేవు పాదమున తన్నెనని
పొలతినను గూడుటకు అదె పొత్తు గాదా
కొలదెరుగ కాడేవు కొనగోర జీరెనని
వలపు నిలుపుటకదే వారకము గాదా ॥ అయ్యయో ॥

పట్టి పట్టి పెనగేవు పంటికొద్ది నొక్కెనని
వెట్ట తీర మోవి తేనె విందు అది గాదా
యిట్టె అలమేల్మంగ యెదనెక్కెనంటాపు
యెట్టైన వేంకటరమణ యేలుటకె కాదా ॥ అయ్యయో ॥

ప. సా రి గ మ । పా ద స ద ప ॥ మ గ రి - । సా రి స ని ॥
అ య్య యో - । వెం క - టా - ॥ ర మ ణా - । ఆ డు కొం - ॥

ధా ధ స ని । స రి సా - ॥ ద ని సా రి । స ని దా ప ॥
దు రా - - । చె లి ని - ॥ గ - య్యాళి । య ని సా రె ॥

ద స ద పా । మ గ రి సా ॥
కా - కు సే । తు ర ట రా ॥ ॥అయ్యయో॥

చ. గ మ ప ద ని । దా పా మ ॥ గ మ పా మ । గా రి స ని ॥
సి గ్గు ప డ క । చె ప్పే వు ॥ చె లి ని న్ను । ది ట్టె న ని ॥

స రి స ని ధ । స ని రి రి ॥ గా మ ప మ । దా దా ప ॥
ది గ్గు న వ ల । పు ల తి ట్టు ॥ దే వె నే - । కా దా - ॥

ద ని సా ని । సా రి స రి ॥ సా రి మ గ । రి స స ని ॥
యె గ్గు లె న్న । వ చ్చే - వు ॥ యిం తి బె డ । గొ ట్టె న ని ॥

ద ని సా రి । స ని ద ప మ ॥ గ మ పా మ । మ గ రి సా - ॥
అ గ్గ లం పు । మో - హా ము న ॥ క ద్ది గు ర్తు । కా - - దా - ॥ ॥అయ్యయో॥

**అవతారిక :**

"ఇందలి నాయిక రూప గర్వితా, ప్రౌఢ, స్వాధీన పతిక, తాను పతిని దైవము వలె చూచుకొనునట. అతని మనసునకు నచ్చిన రీతిని మాటలాడునట తనకు కోపము వచ్చినను, జాణ తనమున అతనిని మందలించి యదుపులోనుంచుకొనునట. నాయకుడేదైనను తనకు ఇష్టములేని పనిచేసి పట్టుబడినను యీమె తేట చూపులనే చూసి తెలుసుకొనునట. తన మీద వలపున నాతడే రావలెనట. బలవంతమున రప్పించుకొనదట ఈమె సరసురాలు గనుక కోపాలు తాపాలు మాని తళుకు నవ్వులతో తన నాథుని వలపించుకొనగల సమర్థురాలు అని అయ్యవారు చెప్పుచున్నారు.

**సౌరాష్ట్రి—చాపు**

పతి మాత్రమా నా పాలి దైవమతడే
అతనికి యిచ్చకములే ఆదే నింతే గాక ॥ పల్లవి ॥

నీటున తానే అన్నియు నేరవలే నింతే
మాటలాడ వచ్చునా మగవానినీ
తేలు చూపులనే తెలుసుకో వలె గాక
తాటించి జంకించ తగునా యిల్లాలికి ॥ పతి ॥

వలపులనే నా వద్దికి రావలెగాక
యెలయించ వచ్చునా యేలిన వానిని
తళుకు నవ్వులనె దయ రేచ వలె గాక
చల పట్టి దగునా సరసురాలికి నీ । పతి ॥

ప - - గ మ | పా - ప మ || దా - | ద సా ని స రి స రి ||
- - ప తి | మా - త్ర - || మా - | నా - - పా - - - ||

సా - | స ని ద ప || మ గ గ | ప మ గ రి సా ||
లి - | దై - వ - || మ త - | డే - - - - ||

- - స రి | సా సా || స స ని ధ | స ని రీ ||
- - అ త | ని కి || యి చ్చ - - | క ము తే ||

- - గ మ | ద ప ప మ || మ గ ప మ గ మ | మ గ రీ సా ||
- - ఆ - | దే - నిం - || తే - - - - - - | గా - - క || ||పతి||

చ. - - గ మ | ద ప ప మ || మా ప దా ప | మా మ గ ||
- - నీ - | టు - న - || తా - - - | నే - - ||

మా గ | ప మ గ రి రీ || - - రి | సా స ని ధా ||
అ - | న్ని - - - యు || - - నే | ర వ - - ||

ధ స ని | సా రి స రీ || - - స | రీ గా ||
తే - - | నిం - - తే || - - మా | ట లా ||

- మా | గా మా || పా - | ద ప మ గ రి స ||
- డ | వ చ్చు || నా - | మ - - - గ - ||

మ గ మ గ మ | పా - - ||
వా - - - ని | నీ - - || ||పతి||

- - ద | ద స ని సా || రి సా | సా రి స రి స రి స ||
- - తే | ట - - మా || పు ల | నే - - - - - - ||

రీ స రి | రి మ గ రి స || సా ని దా ప | మా - గ రి ||
- తెలు | సు - - కో - || వ - ల - | గా - - క ||

- - స రి | సా స ని ధా || ధ స ని | సా రి స రి స రి స ||
- - ఞా - | టిం చి - - || జం - - | కిం - - చ - - - ||

రి గ మ | ద ప ప మ || మ గ ప మ గ మ | మ గ రి సా ||
- త గు | నా - యి - || ల్లా - - - - - | లి - - కీ || ||పతి||

**అవతారిక :**

ఇందు ద్వంద్వములగు విషయములను తీర్చినట్లు చెప్పుచు "ఊరు లేని పొలిమేర, పేరులేని బ్రతుకు, గారవింపబడని ప్రేమ, విరహవేదనలేని పొందు, యెండలేని నీడ, తమకము లేని తాలిమి, అర్థభావములు ఒక్కటిగా నుండని రచన, మెప్పులేని చోట మేలు, చనవులేని చోట మంచి మాటలు, హెచ్చించుకొనలేని ప్రియము, కలియుటకు కోరిక లేని నాటి అందములు, తనను మురిపించని వానితో చెలిమి, అడ్డు అపులు లేక కలుసుకొనగల కూటమిని ప్రసాదించిన వేంకటాద్రివిభుని వంటి నాయకుడు లేని వేడుకలు యేలనే" అని ప్రౌఢ, రూపగర్విత యగు నాయిక చెలికత్తెతో పలుకుచున్నట్లు అయ్యవారు చెప్పుచున్నారు.

ఇట్టి యుదాహరణలను యేర్చికూర్చిన యందము, చమత్కారము తాళ్ళపాకవారికే చెల్లినట్లు తోచుచున్నది,

**సౌరాష్ట్ర—త్రిపుట**

పూరు లేని పొలిమేర పేరు పెంపు లేని బ్రదుకు
గారవంబు లేని ప్రియము కదియనేటికె ॥ పల్లవి ॥

ఉండరాని విరహవేదన వుండని సురత సుఖమేల
యెండ లేని నాటి నీడ యేమి సేయనే
దండి గలుగు తమక మనేటి దండలేని తాలిమేల
రెండు నొకటి గాని రచన ప్రియము లేటికే ॥ పూరు ॥

మెచ్చులేని చోట నెంత మేలు గలిగి నేమి కెలవు
మచ్చిక లేని చోట మంచి మాట లేటికి
పెచ్చు పెరుగ లేని చోట ప్రియము గలిగి యేమి ఫలము
ఇచ్చలేని నాటి సొబగు లేమి సేయనే ॥ పూరు ॥

బొంకు లేని చెలిమి గాని బొంకులేల మనసులోన
శంక లేక కదియలేని చనవులేటికె
కొంకు గొసరులేని మంచి కూట మలరనిట్ల గూడి
వేంకటాద్రి విభుడు లేని వేడుకేటికే ॥ పూరు ॥

అ : 3—55

ప. - - రి | సా - రి గా || మా - | పా - మ మ గ మా ||
- - ఊ | రు - - లే || ని - | పొ - - లి - - ||

ద పా | దా ద ని || సా రి | సా స ని దా ||
మే - | ర పే - || రు పెం | పు లే - - ||

ద ని ద పా - | ప మ గ మ రీ ||
ని - - - - | బ్ర - తు - కు ||

- - రి | సా స ని ధా || ధ నీ ధ పా | ధా - ని సా ||
- - గా | ర వం - - || బు - - - | లే - - ని ||

రీ గ మ | ప ద ని ద ప మ గ రి || ప మ గ రీ - | సా - ని ధ ని || సా
- ప్రి య | ము - - - క - - - || ది - య - - | నే - - - టి || కే

||ఊరు||

చ. - - ప | పా - మ మ గ మా || మ గ రి స | స స ని ధా ||
- - బొం | కు - - లే - - || ని - - - | చె లి - మి ||

ద సా - ని | సా - - || - - గ మ | ద ప ప మ ||
గా - - - | ని - - || - - బొం - | కు - లే - ||

మ గ మ గ | రి రి సా - ని || ద సా - ని | సా - - ||
ల - - - | మ న సు - - || లో - - - | న - - ||

- - రి | స రి గ మ || పా ప మ | ద ప దా ||
- - శం | క - లే - || క - - | క ది య ||

- - రి | సా - ని ధ ప || పా మ దా ప | ప మ గ రి సా ||
- - లే | ని - - చ న || వు - లే - | టి - - - కే ||

- - ద | ప మ గ మ ద ప || దా - | రీ సా ||
- - కొం | కు - - - కొ న || రు - | లే ని ||

సా రి గ | రి స సా సా || స ని దా | రి స రీ ||
మం - - | చి - - - || కూ - ట | మ ల ర ||

సా రి గ | రి స సా సా || - - స రి | గ మ గ స రి ||
ని ట్ల - | గూ - - డి || - - వెం క | టా - - - ద్రి ||

రి స ని ద | రి స రీ || స ని దా | ని ద పా ద ప మా ||
వి భు - డు | లే - ని || వే - - | డు - - కే - - ||

ప మ గ మ గ రి | సా - - ||
టి - - - - - | కే - - ||

||ఊరు||

**అవతారిక :**

ఇందలి నాయిక రూపగర్వితస్వాధీన పతిక ఈమె. చేతలకు పరవశుడైన నాయకుడు 'కాటుక కన్నులతో నన్ను బెదరించకు. ఆ వేడికి తాళలేక నా వెన్నెలమోము నవ్వులను విసరుదును. నీవు కిన్నెర మీటులవంటి చేతితో నన్ను గిలిగింతలు పెట్టకు. నా ధైర్యమును వెదజల్లుదును. నీవు సగము సగము మాటలాడి నాకు మత్తెక్కించకుము. మోవి తేనెలతో నీ పెదవుల కదలిక లాపివైతును. నీవు సరసాలు విరసాలు వెదజల్లినచో నా వినయాలు పలికించి మెప్పించెదను' అని పొలయలుకలు పోయిన నాయికను సరసోక్తులతో మెప్పించి నాయకుడగు శ్రీ వేంకటనాథుడు అనునయించుచున్నాడు.

ఇందలి 'చెరుసగము మాటలాడి' అను వాక్యము తెలుసుకొనియే 'అరసొంపు మాటలాడే వానికి' అని క్షేత్రజ్ఞులవారు చెప్పుకున్నారో యేమో !

సౌరాష్ట్ర—రూపకం

నేనొకటి సేయగాను నీ వొకటి సేయకువే
మానిని నీ చేతలకు మారు మలసెను ॥ పల్లవి ॥

కన్నుల కాటుక తోడ కసరకువే నా
వెన్నెల మోము నవ్వుల విసిరేను
కిన్నెర మీటుల గిలిగించకు వేనా
సన్నపు ధైర్యము వెదజల్లేను ॥ నేనొకటి ॥

చెరుసగము మాటలు పై జిమ్మకువే నీకు
యిరవైన మోవితేనె లిచ్చేను
సరసాల విరసాల సాధించకువే నా
మెరవడి వినయాల మెప్పించేను ॥ నేనొకటి ॥

పానుపుపై నన్ను గూడి భ్రమయించకువే కాన
గానే గోర దారుకాణించేను
అని శ్రీ వేంకటేశుడ నలయించకువే
పూని పట్టి నిన్ను నిట్టె బుజ్జగించేను ॥ నేనొకటి ॥

శృం : 26—89

ప. మ గ ః | ద ప దా || ప మ | మ గ రి సా ||
సే - - | నొ క టి || సే య | గా - - ను ||

మ గ మ | ద ప దా || ద ని స రి | స ని ద ని ద ప ||
నీ - - | వొ క టి || సే - - - | య - కు - వే - ||

మ గ మ | ద ప ప మ గ రి || స ని ధా | ని స రి సా ||
మా - - | ని న నీ - - - || చే - - | త - ల కు ||

స రి గ మ | ప మ గ మ దా || ద ని స రి | స ని ద ని ద ప ||
మా - - - | రు - మ - ల || సే - - - | - - ను - - - ||

||నే నొకటి||

చ. స ద | ప దా - || ప మ | ప మ గ రి సా ||
క న్ను | ల కా - || టి కి | తో - - - డ ||

స ని ధా | సా స ని సా || - - - | - - ప మ గ రి ||
క - స | ర కు - వే || - - - | - - నా - - - ||

- స | ద ప దా || పా ప మ | గ మ మ గ రి ||
- వె | న్నె ల మో || ము న - | - వ్వు ల - - ||

స రి | గ మ ప ద ని ద ప మ || పా - | - - - - ||
వి సి | రే - - - - - - - || ను - | - - - - ||

- ద | ని స సా || ని స రి స | ని స రి స రి ||
- కి | న్నె ర మీ || - - - - | - - టు - ల ||

గ మ | మ గ రి స ని || ద ప | ద ని స రి సా ||
గి లి | గిం - - చ కు || వే - | - - - - నా ||

- ద | ని స సా || సరిసని | దసదపదదపమ ||
- స | న్న పు డై || ర్యా - ము - | వె - ద - చ - - - ||

గ మ గ రి | స రి స ని ధ ని స రి || గ మ ప మ | గా - - ||
త్తే - - - | - - - - - - - - || - - - - | ను - - || ॥నే నొకటి॥

**రాగ క్షలణం :**

శ్రీ వేంకటాచలపతి యగు శ్రీనివాసుని యందు ఆ స్వామి మున్ను గైకొన్న యవతారములను కూడ దర్శించి, స్తుతించి ఆయా అవతారముల యందు స్వామి కాపాడిన భక్తులను, హరిదాసులను తలచుకొని ఆనందించుట జరుగుచునే యుండును. ప్రహ్లాద వరదుడగు నరశింహస్వామిని శ్రీ వేంకటేశ్వరుని యందు దర్శించి అయ్యవారు పాడుకొన్నటువంటి రచనయేయిది. ఇందు స్వామిని కీర్తించి అయ్యవారు ఆనందించుచున్నారు.

**రాగ లక్షణం :**

లలిత ప్రాచీనరాగములలో నొకటి. దీనిని 17వ మేళమగు సూర్యకాంతమునకు జన్యముగా పాడుకొనుట వాడుకలోనున్న పద్ధతి. ఒకే విధమగు ఆరోహణావరోహణములు కలిగియుండుటవలన వసంత రాగమును కూడ ఈ 17వ మేళజన్యముగానే చెప్పెడి వారును కలరు. కాని శుద్ధ ధైవతముతో స్వతంత్రముగా ఒప్పుచుండెడి వసంత, చతుశ్శృతి ధైవతముతో ప్రత్యేకముగా కనబడుచున్న లలిత రాగమును వేరు వేరుగా పాడుకొని ఆనందించెడు అవకాశమును పోగొట్టుకొనవలసిన యవుసరము కానరాదు. ఈ రెంటికినీ ప్రాచీన సంప్రదాయములుండనేయున్నవి లలితకు స గ మ ద ని స । స ని ద మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇప్పుడు వాడుక యందుగల 72 మేళములలో 17వది యగు సూర్యకాంతమునకు ఇది జన్యము. ఇట్లే స గ మ ద ని స । స ని ద మ గ రి స అను ఆరోహణావరోహణములు గలిగి 15వ మేళమగు మాయామాళవ గౌళ జన్యముగా వసంతమును నేడు వాడుచున్నారు.

అన్నమయ్యవారి రచనలు 17వ మేళమగు సూర్యకాంత జన్యముగా నుండెడి లలిత యందే స్వరపరుప బడినవి.

**లలిత — ఆది**

కంటి మినేడిదె గరుడాచలపతి
యింటి వేలుపగు యీశ్వరుడితడు ॥ పల్లవి ॥

శ్రీ నరశింహుడు చిన్మయకాంతుడు
దానవాంతకుడు దయానిధి
నానా మహిమల నమ్మిన వారిని
పూనుక కాచే పోషకుడితడు ॥ కంటి ॥

దేవాదిదేవుడు దినకర తేజుడు
జీవాంత రంగుడు శ్రీవిభుడు
దైవశిఖామణి తలచిన వారిని
సేవలు గొని కాచే విభుడితడు ॥ కంటి ॥

పరమమూర్తి హరి ప్రహ్లాద వరదుడు
కరుణానిధి బుధ కల్పకము
పరగు శ్రీ వేంకటపతి తన దాసుల
నరుదుగ గాచేయనఘుండితడు ॥ కంటి ॥

అ : 11–209

ప. - గ మా ద దా నీ ద మ । - గ గా మా - । మ గ సా రి స ॥
- కం - టి మి నే డి దె । - గ రు డా - । చ - ల ప తి ॥

- సా ని ధా - ధ ని స స । - స గా మ దా । మ మ మా ॥
- యుం టి వే - - లు ప గు । - ఈ - శ్వ రు । డి త డు ॥ ॥కంటిమి॥

చ. - మ మా గ గా రి రి స స । - ని నీ ధ ధా । ని ని స స ॥
- శ్రీ - న ర సిం - హు డు । - చి - న్మ య । కాం - తు డు ॥

- ధ నీ స సా గ రి స ని । స ద మ మ । గా - - ॥
- దా - న వాం - త కు డు । ద యా - ని । ధి - - ॥

- గ గా మ మా ద ద ని ని । - స సా రి రీ । స స ని ని ॥
- నా - నా - మ హి మ ల । - న - మ్మి న । వా - రి ని ॥

- ద దా ని నీ ద ద మ మ । - ద దా మ మా । మ గ రి సా ॥
- పూ - ను క కా - చే - । - పో - ష కు । డి - త డే ॥ ॥కంటిమి॥

**అవతారిక :**

నానా విధములగు సంసార బంధములలో పడి తిరుగుడు పడువారికి చిత్తజగురుడగు వేంకటనాథుని నామమే దివ్యౌషధము. పరి పరి విధములగు బాధలు దేహ ధారులకు కలుగు చుండుటయు కలగు గదా! 'నీవే తప్ప నితః పరం బెరుగ'నని హరి పాద తీర్థమును సేవించుట వలన సుఖము లభించును. పశ్చాత్తాపముతో భగవన్నామము చేయుచు, స్వామిని నమ్మికొన్న వారికి పాపముల బంధములు, పుట్టుట గిట్టుటుల వంటి కష్టములన్నియు దూరమగునని అయ్యవారు ఇందు శ్రీనివాసుని భక్తపరాధీనతను కొనియాడుచున్నారు.

**లలిత—ఆది**

అన్నిటికి నిదె పరమౌషధము
వెన్నుని నామము విమలౌషధము ॥ పల్లవి ॥

చిత్త శాంతికిని శ్రీపతి నామమె
హత్తిన నిజ దివ్యౌషధము
మొత్తపు బంధ విమోచనంబునకు
చిత్తజ గురుడే సిద్ధౌషధము ॥ అన్నిటి ॥

పరి పరి విధముల భవరోగములకు
హరి పాద జలమె యౌషధము
దురిత కర్మముల దొలగించుటకును
మురహరు పూజే ముఖ్యౌషధము ॥ అన్నిటి ॥

యిల నిహ పరముల నిందిరా విభుని
నలరి భజింపుటె యౌషధము
కలిగిన శ్రీ వేంకటపతి శరణమె
నిలిచిన మాకిది నిత్యౌషధము ॥ అన్నిటి ॥

అ : 11—63

ప.  సా స ని ద ద ద మ | గ మ గ రి | సా - - ||
అ న్ని టి కి దె ప ర | మౌ - ష ధ | ము - - ||

సా స ని స మ మ గ | గ మ ద మ | ద ద నీ ||
వె న్ను ని నా - మ మె | వి మ లౌ - | ష ధ ము ||   ||అన్నిటి||

చ.  ద ద ద : మ మ మ మ | గ గ మ మ | గ గ రి రి ||
యి ల ని హా ప ర ము ల | యిం - ది రా | - వి భు ని ||

స స మ గ మ మ ద మ | ద ద ని ని | సా - - ||
న లి రి భ జిం - పు టె | యౌ - ష ధ | ము - - ||

స స స మ గ గ రి రి | స స రి స | స ని ద ద ||
క లి గి న శ్రీ - వేం - | క ట ప తి | చ ర ణ మె ||

ద ద స ని ద ని ద మ | గ రి స స | గ మ ద ని ||
ని లి చి న మా - కి ది | ని - త్యౌ - | ష ధ ము - ||   ||అన్నిటి||

**అవతారిక :**

సృష్టి యందు జరుగుచుండెడి వ్యాపారములన్నిటియందును, మనోవాక్, కాయ. కర్మలతో శ్రీహరిని తలచి ఆ జగన్నాటక సూత్రధారుని లీలలే ఇవి యన్నియు అని తెలుసు కొనిన వారికి ఇహ పరములను గెలుచుట యొక లెక్కా! వారే యోగులు, సిద్ధులు, మహానుభావులు అగుదురు— అని సర్వాత్మకుడగు శ్రీహరిని కొలిచెడి భక్తుల మహిమలను అయ్యవారు ఇందు గానము చేయుచున్నారు.

**లలిత — ఆది**

కన్నులెదుటిదే ఘన వైకుంఠము
వెన్నుని గొలిచిన విజ్ఞానికిని ॥ పల్లవి ॥

తలచిన దెల్లా తత్వ రహస్యమె
తెలిసిన యోగికి దిన దినము
పలికిన దెల్లా పరమ మంత్రములె
ఫలియించిన హరి భక్తునికి ॥ కన్ను ॥

పట్టిన దెల్లా బ్రహ్మాత్మకమే
పుట్టును గెలిచిన పుణ్యునికి
మెట్టిన దెల్లా మిన్నేటి నిధులె
అట్టడి తెగువ మెఱయు వానికిని ॥ కన్ను ॥

వినినవి యెల్లా వేదాంతములే
ఘనుడగు శరణాగతునికిని
యెనసిన శ్రీ వేంకటేశుడె యింతా
కొనకెక్కిన నిజకోవిదునికిని ॥ కన్ను ॥

ప. సా స మ మ మ మా | గ మ దా | ద మ మ మ ||
క న్ను లె దు టి దే | ఘ న వై | కుం - ఠ ము ||

దా స ని ద ద మ మ | గా మా | గ రి స ని ||
వె న్ను ని గో లి చి న | వి జ్ఞా | ని కి ని - || || కన్ను ||

చ. ద ని స ని ద ద మా | గా మ మ | గ గ రి స ||
పి ని న వి యె - ల్లా | వే దాం - | త ము లే - ||

ధ ని స స మ గ మ మ | గ మ ద మ | దా - - ||
ఘ ను డ గు శ ర ణా - | గ తు ని కి | నీ - - ||

ద ని స ని స గ రి స | ని ని స ని | ద ద మ ద ||
యె న సి న శ్రీ - వేం క | టే - శు డె | యిం - తా - ||

ద ని స రి స ని ద మ | గ మ గ రి | సా సా ||
కొ న కె - క్కి న ని జ | కో - వి దు | ని కీ || || కన్ను ||

**అవతారిక :**

అన్నమయ్య వారిని నారదాది మునులవలె మహా భక్తునిగను, వేదాంత విషయములను వెన్నునిపై పాడుకొనిన కోవిదునిగను గాన కళా విశారదుడగు సంకీర్తనాచార్యునిగను యీ రచనయందు పెదతిరుమలయ్య వారో, చిన తిరుమలయ్య వారో, కీర్తించుకొన్నారు !

**లలిత—ఝంపె**

శరణంటి మాతని సంబంధమున జేసి
మరిగించి మము నేలి మన్నించవే ॥ పల్లవి ॥

సకల వేదములు సంకీర్తనలు చేసి
ప్రకటించి నిను బాడి పావనుడైన
అకలంకుడు తాళ్ళపాకన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీ వేంకటనిలయ ॥ శరణంటి ॥

నారదాది సనకస నందనాదులవలె
పేరుపడి నిన్ను బాడి పెద్దలైనట్టి
ఆ రీతి దాళ్ళపాకన్నమాచార్యుల
చేరి యేలిన యట్టి శ్రీ వెంకటనిలయ ॥ శరణంటి ॥

సామవేద సామగాన సప్తస్వరములను
ధామముతో నీ సతి నిన్ను బాడిన యట్టి
ఆమకొన్న తాళ్ళపాకన్న మాచార్యుల
వేమరు మెచ్చిన శ్రీ వెంకటనిలయ ॥ శరణంటి ॥

శృం : 6–24

ప. మ మ మ గ రి రి | సా రి సా || స ని ధా సా ని | స రి సా స ||
శ ర ణం - - టి | మా త ని || సం - - బం ధ | ము న జే సి ||

గ మ దా మ | ద ని సా స ని || ద ని దా మ | గా రి సా ||
మ రి గిం చి | మ ము నే లి - || మ - న్నిం చ | వే - - || ||శరణంటి||

చ. మ మ మ మ గ | రి స స స ని || ధ ధ ని స రి | స స స స స ||
సా మ వే - ద | సా మ గా - న || స - ప్త - స్వ | ర ము ల ను - ||

స స మ గ మ | ద ద ద మ మ || మ గ మ ద ద | స ని స స స ||
జా - ము తో - | నీ - స తి ని || ని - న్ను జా - | డి న య - ట్టి ||

స ని స మ గ | రి స స స ని || ద ద మ ద ద | ని స రి స స ||
ఆ - ము క్రొ న్న | తా - ళ్ల పా - || క - న్న మా - | చా - ర్యు ల - ||

ద ని స స ని | ద ద మ మ గ || గ మ ద ద మ | గ రి సా స ||
వే - మ రు - | మె చ్చి న శ్రీ - || వెం - క టా - | ని ల యా - ||

||శరణంటి||

**అవతారిక :**

శ్రీ వేంకటేశ్వరునిలో అహోబిలమునందు వెలసిన శ్రీ నారసింహుని దర్శించి నరసింహస్వామిగా భక్తజనులను రక్షించుటకు స్వామి చేసిన లీలలను పొగడుచు భక్తజన మందారుడని అయ్యవారు కొనియాడుచున్నారు.

**లలిత — ఆది**

ఈతని మహిమలు యెంతని చెప్పెద
చేతుల మొక్కెద జెలగుచు నేను ॥ పల్లవి ॥

శ్రీ నరసింహుడు చిన్మయ మూరితి
నానా విధకర నఖరుడు
దారుణ దైత్య విదారుడు విష్ణువు
తానకమగు మా దైవంబితడు ॥ ఈతని ॥

అహో బలేశుడు ఆదిమ పురుషుడు
బహు దేవతా సార్వభౌముడు
సహజానందుడు సర్వ రక్షకుడు
యిహ పరములొసగు యేలిక యితడు ॥ ఈతని ॥

కేవలుడగు సుగ్రీవ నృసింహుడు
భావించ సుజనపాలకుడు
శ్రీ వేంకటేశుడు చిత్తజ జనకుడు
వే వేలకు నిలువేలుపు యితడు ॥ ఈతని ॥

అ : 11—282

ప. గ మ ద ద ని ని ద ద । మా గ గ । రి రి స స ॥
యీ - త ని మ హి మ లు । యెం త ని । చె - ప్పె ద ॥

గ మ ద ద ద ని ద మ । గ మ గ రి । సా సా ॥
చే - తు ల మొ - క్కె ద । చె ల గు చు । నే ను ॥ ॥ఈతని॥

చ. నీ స̇ ని దా ద మ | గా మ మ | గ రి రి స ||
శ్రీ న ర సిం హు డు | చి న్మ య | మూ - రి తి ||

ని̣ ని̣ స స గ గ మ మ | గ మ ద మ | దా - - ||
నా - నా - వి ధ క ర | న ఖ రు - | డు - - ||

గ గ మ మ ద ద మ మ | ద ద ని ని | స̇ స̇ స̇ స̇ ||
దా - రు ణ దై - త్య వి | దా - రు డు | వి - ష్ణు వు ||

స̇ ని స̇ మ̇ గ̇ రి̇ స̇ స | ని స̇ ని ద | ద మ గ గ ||
శా - న క మ గు మా - | దై - వం - | బి త డు - || ||ఈతని||

**అవతారిక :**

"ప్రాణవునకు మనసు ముఖ్యమైనది. ఇదియే సంయోగ వియోగములకు సంసార బంధములకును కారణమగుచున్నది. ప్రేమలు, కోపతాపములు, పరితాపములు, మొదలగు గుణములతో సతమతమగుచున్న మాకు మీ కొలుపులు జేయుటకు బుద్ధులు కలుగునా ? నీ మాయలలో పడి మోక్ష సాధనకు నిన్ను కొలుచుటకు తెలివి కలుగక యున్నది కదా !" యని అయ్యవారు ఈ కీర్తనము నందు (శ్రీ) వేంకటేశ్వరునకు విన్నవించుకొనుచున్నారు.

**రాగ లక్షణం :**

భైరవి రాగము అతి ప్రాచీనము. భాషాంగము. రక్తిరాగము. 'ప ద ని సా' అనునప్పుడు చతుశ్శ్రుతిధైవతము 'స ని ద పా' అనునప్పుడు శుద్ధధైవతము పలుకును. ఇది సంపూర్ణ సంపూర్ణము. వెంకట మఖి సంప్రదాయమున గల భైరవికిని, క్షేత్రజ్ఞుల వారి పదములలో గల భైరవికిని పెద్ద తేడాలు లేవు. గంభీర ప్రకృతి గల యీ రాగము, ప్రాచీనుల కాలము నుండి నేటి వరకు ఇంచు మించు ఒకే విధముగా కనబడుచున్న రాగములలో నొకటి.

**భైరవి—ఆది**

ఒక్కటి కొకటి వియోగములు
యిక్కడ మా బుద్ధు లెక్కడ గొలుపు ॥ పల్లవి ॥

పాయపు (వు) మతిలో బలువగు నాసలు
కాయము భువిలో గలదాకా
ఆయము సంసారమందుకు మూలము
యే యుపా (య) ములు యెక్కడ గొలుపు ॥ ఒక్కటి ॥

మానదు కోపము మతి చంచలమును
కాని కర్మమిది గల దాకా
ఆనిన మనసే యందుకు మూలము
యే నేరుపులిక నెక్కడ గొలుపు ॥ ఒక్కటి ॥

అందదు మోహం బవ్వల నివ్వల
గందువ నిను మతి గను దాకా
అందితి శ్రీ వేంకటాధిప నీ కృప
యెందలి మాయలు యెక్కడ గొలుపు ॥ ఒక్కటి ॥

అ : 11–154

ప. పా ద ప మ గ రి ని । సా రి గ । మా - - ॥
ఒ క్క టి కొ క టి వి । యో గ ము । లు - - ॥

సా రి గ మా - పా - మా । గ రి స ని । స రి గ మ ॥
యి క్క డ మా - బు - ద్ధు । ఎ - క్క డ । గొ లు పు లు ॥ ॥ఒక్కటి॥

చ. మా ప ప ద ప మా । గ రి గ స । రి గ మ మ ॥
పా య పు మ తి లో । బ లు వ గు । నా - స లు ॥

రీ గ మ ప ప ద ప । ద మ ప ద । పా - - ॥
కా య ము భు వి లో - । గ ల దా - । కా - - ॥

ప ద ని ద నీ - సా - సా । రీ గ రి । స ని ద ప ॥
ఆ - య ము సం - సా - ర । మం దు కు । మూ - ల ము ॥

ప గ రి స స ని ద ప । పా మ గ । రి రి స స ॥
ఏ - యు పా - య ము లు । ఎ క్క డ । కొ లు పు లు ॥ ॥ఒక్కటి॥

**అవతారిక :**

వైష్ణవ మతాచార్యులలో నొకరగు శఠ గోప మునీంద్రులను కీర్తించుచు "వీరు నిరతము శ్రీ రంగనాథులను, కంచి వరదరాజస్వాములను, అహోబిల నృసింహులను, శ్రీ వేంకటనాథులను సేవించుచు మోక్ష మార్గమును శిష్యుల కుపదేశించుచు, భక్తజనులకు మార్గదర్శకులుగా నుండి వైష్ణవ సంప్రదాయములను స్థిరముగా శ్రీరంగపుర, కంచి, అహోబిలము, వెంకటాద్రి క్షేత్రములందు ప్రచారముచేసి నెలకొల్పిరి" అని అయ్యవారు ఈ రచన యందు చెప్పుచున్నారు.

భైరవి_ఆది

చూడుడిందరికి సులభుడు హరి
తోడు నీడయగు దొరముని యితడు ॥ పల్లవి ॥

కైవల్యమునకు గనకపు తావల
త్రోవై శ్రుతులకు దుది పదమై
పావన మొక రూపంబై విరజకు
నావై యున్నాడిదె యితడు ॥ చూడు ॥

కాపాడగ లోకములకు సుజ్ఞాన
దీపమై జగతికి దేజమై
పాపా లడపగ భయ పయోధులకు
దేపై యున్నాడదె యితడు ॥ చూడు ॥

కరుణానిధి రంగపతి గాంచీ
నరునకు వేంకటగిరి పతికి
నిరతి నహోబల నృకేసరికి ద
త్పరుడగు శఠగోప (ం) ముని యితడు ॥ చూడు ॥

అ : 11–51

ప. సా - స రీ గ రి | సా రి రి | గ మ ప ప ||
చూ - డు డిం ద రి | కి సు ల | భు డు హా రి ||

ప ద ప మ ప మ గ రి | గ మ ప మ | గ రి స ని ||
తో - డు నీ - డ య గు | దొ ర ము ని | యి త డు - || ||చూడు||

చ. మా మా గ రి గ స | రి రి గ గ | మా మ మ ||
కై వ ల్య ము న కు | క న క పు | తా ప ల ||

పా ద ప ప మ ప మ | గ రి గ మ | పా - - ||
త్రో వై - శ్రు తు ల కు | తు ది ప ద | మై - - ||

ద ని స రి స స స ని | ని ద ద ప | ప మ ప ప ||
పా - వ న మొ క రూ - | పం - బై - | వి ర జ కు ||

పా స ని ద ప మ గ | రి రి స ని | సా - - ||
నా వై - యు - న్నా - | డి దె యి త | డూ - - || ||చూడు||

**అవతారిక :**

"సంసారము సముద్రము వంటిది, యముని నోరు వంటిది. చమురు దీసిన దివ్వె వంటిది. యుద్ధము నందలి యునికి వంటిది. సమయించు పెనుతెవులు వంటిది. సందు గొందులు తిరుగుట వంటిది. చలువ లోపల వేడి వంటిది. బంగారు నీరు పూత పూసిన వస్తువు వంటిది. చందురుని వృద్ధి క్షయములవలె నుండెడిది. ఐనను యీ సంసారము తిరు వేంకటనాథుని దాసులైనవారికి అతి సుకరము ఆనందకరముగా పరిణమించుచున్నదని త్రికరణ శుద్ధిగా స్వామిని నమ్మినవారికి సంసార భయముండ" దని అయ్యవారు చెప్పుచున్నారు.

భైరవి—ఝంపె

సడి బెట్టె గటకటా సంసారము చూడ
జడధిలోపలి యీత సంసారము ॥ పల్లవి ॥

జమునోరిలో బ్రదుకు సంసారము చూడ
చమురు దీసిన దివ్వె సంసారము
సమయించు బెనుదెవులు సంసారము చూడ
సమరంబులో నునికి సంసారము ॥ సడి ॥

సంది గట్టిన తాడు సంసారము చూడ
సంది కంతల త్రోవ సంసారము
చందురుని జీవనము సంసారము చూడ
చంద మేవలె నుండు సంసారము ॥ సడి ॥

చలువ లోపలి వేడి సంసారము చూడ
జల పూత బంగారు సంసారము
ఇలలోన దిరువేంకటేశ నీ దాసులకు
చలువలకు గడు జలువ సంసారము ॥ సడి ॥

అ : 11–70

ప. రి గ మా మ | ప ప ద ప మ || నీ దా ద | పా ప ద మ ప ||
న డి బె ట్టె | క ట క టా - || సం సా ర | ము చూ - - డ ||

1 ద ని స స ని | ని ద ప మ ప || మ గ రీ రి | సా - - - ||
జ ల ధి లో - | ప లి యా - త || సం - సా ర | ము - - - ||

2 ద ని స గ రి రి స | ని ని ద ప మ ప ద ని సా || స ని ద ప మ గ రి రి | సా - - - ||
జ ల ధి లో - - - | ప - లి - యా - - - త || సం - - - సా - - ర | ము - - - ||
|| నడి ||

చ. ప ప పా ద | పా ద మ మ || పా ద ద ని | సా సా స ||
జ ము నో రి | లో బ్రతు కు || సం సా - ర | ము చూ డ ||

రి గ రి సా | స ని ద ప ప || పా ద ద మ | పా - - - ||
చ ము రు దీ | సి న ది - వ్వె || సం సా - ర | ము - - - ||

ద ని సా స | స ని ని ద ప || పా ప ద మ | పా పా ప ||
న మ యిం చు | బె ను దె వు లు || సం సా - ర | ము చూ డ ||

ప ప ద ని స | స ని ద ప ప || మ గ రీ ని | సా - - - ||
స మ రం - బు | లో - ను ని కి || సం - సా ర | ము - - - || || నడి ||

**అవతారిక :**

విరహోత్కంఠిత యగు నాయిక పలుకక, శ్రీ వేంకటనాథుని తలపులయందు నిలుపుకొని వసంత శోభవలె నుండిన తన యందమునకు తగిన రీతిని యుండని విధముగని చెలులాడు కొనుచున్న చందమును అయ్యవారు హృద్యంగముగా ఇందు వర్ణించి యున్నారు.

**భైరవి — త్రిపుట**

కోవిల పలుకుదు కొమ్మావి లతల
దైవిక మిదివో తలక్రిందాయె ॥ పల్లవి ॥

యిటువంటి యినుండిదె యెండలు గాశి
పటుగతి గిరుల సఘను లందు
అటువలెం గప్పిన యంధకారమిదె
నిటల పుటలుకల నికములాయె ॥ కోవిల ॥

వెగటునం దోటల వెన్నెలు గాసి
వొగింగలువ కొలంకు లుబ్బంగను
అగపడి అటువలెనై నం జెలిని
మొగమునం గోరుము ముచ్చటలాయె ॥ కోవిల ॥

గోరిది నలుగడలం జుక్కలుగాసి
నరుదుగ నే నిట్లయినను
తిరువేంకటగిరి దేవుని కౌగిట
కరుణమన్మథ గ్రహణంబాయె ॥ కోవిల ॥

శ్రృం : 8–44

ప. - - స | స గ రీ || రి గ మ ప ద | పా ప మ పా ||
- - కో | వి - ల || ప లు - - - | క - - డు ||

- - ద ని | సా రి స ని ని ద ప || మ గ మా ని ప మ గ | రీ సా ||
- - క్రో - | మ్మో - - - - - - వి || ల - - త - - - - - | ల - ||

- - స రి | సా - ధ ని ధ || ధ స ని సా - | రీ - గ గ రి రి స ||
- - దై - | వి - - క - || మి - - ది - | వో - - - - - - - ||

రీ రి గ | మ ప ద ప ని ని ద ప || ప మ పా | ద ప మ గ రీ || సా
- త ల | కిం - - - దా - - - || యే - - | - - - - - || - ||కోవిల||

చ. - - ప ద | ని ద ద ప || ప మ పా | ప ప మ గ రీ ||
- - గౌ రి | ది - న లు || గ - డ | లం - - - - ||

సా స | స ని ని ధ నీ || సా - | రీ గ మ గ రి రి స ||
- జ | క్క - - - లు || గా - | సి - - - - - - ||

రీ రి గ | మా పా || పా మ దా - | దా రి స నీ ని ద దా ||
- అ రు | దు గ || నే - ని - | శ్లై - - - న - - ||

పా ప ద | ని ద ద ప || పా ద ని | ద ప ప మ పా ||
ను తి రు | వెం - క - || ట - - | గి - - - రి ||

ప ద ప ద నీ | సా - ని సా || సా రి స స ని దా | నీ సా ||
దే - - - - | వు - - ని || క్షా - - - - - | గి టి ||

- - ప ప । గ రి రి స రీ ॥ సా ని రీ స । గ రి రి స ని ని ద ప ॥
- - క రు । ణ - - - మ ॥ న్మ - - - । ధ - - - గ్ర - - - ॥

ద ని సా - ప । ద ప ప మ పా ॥ మ గ ప మ ద ప । ప మ గా రి ॥ సా
హా - - - - । ణం - - - - ॥ జా - - - - - । యె - - - ॥ -

॥కోవిల॥

**అవతారిక :**

ఖండిత నాయిక తన నాయకుని చేష్టలను తెలుసుకొన్నదియై **ఆతనిని** దండించుచు "నీవు నన్ను కలకాలము మోసగింపలేవు. ఇప్పుడు నీ ప్రాభవము వెలుగుచున్నది గనుక వేరు వేరు యింతులను వెంటనిడుకొని ఆనందించుచున్నావు. నీ చేతలకు సంతసించితిని" అని అయ్యవారు గేయ రూపమున నాయిక వాక్కులను చెప్పుచున్నారు.

భైరవి—చాపు

కాలమెల్లా మోసపోవు (ము) కానియ్య రాకల
కాలమెల్లా జరపేవు కానియ్యరా ॥ పల్లవి ॥

ఎడపుల జవ్వనపు టింతి నొకతె గూడి
కడలనే తిరిగేవు కానియ్యరా
మెడగట్టు కొకతెకు మేలువాడవై నీవు
కడవ బొంకేవు నాతో కానియ్యరా ॥ కాల ॥

బంగారు మెరుగుచాయ పడతి నొకతెగూడి
కంగనాడేవు నాతో కానియ్యరా
అంగన నొకతె వెన కమర దాచుకొని చొ
క్కంగ జేసి ముద్దాడేవు కానియ్యరా ॥ కాల ॥

సంపద గలాపె గూడి సరసము లాడుచు
కంపులే పూసేవు కానియ్యరా
పెంపర లాడుచు నీవెంట నొకతె రాగా
కంపించకు వేంకటేశ కానియ్యరా ॥ కాల ॥

శృం : 12–51

ప. పా మ । పా దా ॥ దా ని । సా సా ॥
కా ల । మె ల్లా ॥ మో స । పో వు ॥

సా ని । ని ద దా ॥ పా - । పా పా ॥
కా - । ని - య్య ॥ రా - । క ల ॥

ధా ని । సా సని ॥ ని ధా । పా పా ॥
కా ల । మె ల్ల - ॥ జ రి । పే వు ॥

మ ద రి । గ రి రీ ॥ సా - । సా - - ॥
కా - - । ని - య్యా ॥ రా - । - - - ॥ ॥కాలమెల్ల॥

చ. ప పా । పా పా ॥ పా ద । ద ప ప మ ॥
ఎ డ । పు ల ॥ జ - । వ్వ న పు - ॥

పా ప । పా పా ॥ ద నీ । సా సా ॥
టిం - । తి నొ ॥ క్క తె । గూ డి ॥

రి గ రి । సా సా ॥ స స ని । ని ద ద ప ॥
క డ - । ల నే ॥ తి రి - । గే - వు - ॥

ప ద ప । ధా నీ ॥ సా - । - - - - ॥
కా - - । ని య్యా ॥ రా - । - - - - ॥

రి రీ । గ రి సా ॥ స రి స । ని ద నీ ॥
మె డ । గ - ట్టు ॥ కొ క - । తె - కు ॥

సా ని । ని ద ద ప ॥ ప మా । పా పా ॥
మే లు । వా - డ - ॥ వై - । నీ వు ॥

ప పా । ధా నీ ॥ సా ని । ని ద ద ప ॥
క డ । వ బొం ॥ కే వు । నా - తో - ॥

పా - । మ గ రి ॥ సా - । - - - - ॥
కా - । ని - య్యా ॥ రా - । - - - - ॥ ॥కాలమెల్లా॥

**అవతారిక :**

నాయకునితో ప్రణయ కలహములాడి కోపగించుకొనియున్న చెలిని జూచి "నీకెంత గుణము కలిగినను, ఎంత సౌందర్యము కలిగినను ఏమి లాభము? తిరు వేంకటేశ్వరుడగు నాధుని మనసు కరగించి మురిపెములు చూపి మ్రొక్కచేసుకొని ఆతని కౌగిలియందు అణగి మణగి సుఖమనుభవించవలెనే గాని ఎన్ని యున్నను ఆడదానికి ఆనందము ఎట్లు కల్గునే" అని నాయికను చెలికత్తె మందలించ, నాధుని వశపరచుకొను విధానములను బోధించుచున్నది.

భైరవి—రూపకం

ఏటిపొందు యేటిగుణము యేటి సౌరుపతికి మనసు
నాటుకొనగ జేయలేని నటన లేటికే ॥ పల్లవి ॥

చూపు చూపు తారుకాణ చూపులోని నగవులెల్ల
చూపి పులకరించలేని సొబగు లేటికే
యేపురేగి కోరికలకు యెత్తుసేసి మీద మీద
తాపమంద జేయలేని తనువు లేటికే ॥ ఏటి ॥

కదిసినపుడె మేను మఱచి కౌగిలించినట్టి చేయి
వదలి కన్ను ముయ్యలేని వలపులేటికే
తుదలనైన చెమట గముల తొప్పదోగి మోహారతుల
సదమదముగ దనుపలేని చనవు లేటికే ॥ ఏటి ॥

దేహధారి యైన ఫలము తెలిసి వేంకటాద్రి విభుని
మోహమంద జేయలేని మురిప మేటికే
ఊహదలచి తమకమంది వొకరి కొకరు యిట్ల నేడు
సాహసించి కలయకున్న జన్మ మేటికే ॥ ఏటి ॥

రేకు : 4—178

ప. స గ | రి గా మ || పా | ద ప ప మ ||
ఏ - | టి పొం దు || ప | టి గు ణ ము ||

ప ద | ప ధా ని || స స | ని ని ద ప ||
ఏ - | టి సౌ రు || ప తి | కి మ న సు ||

ప గ | రి స ని స || ప ద | ప ప మ ప ||
నా - | టు కొ న గ || జే - | య లే - ని ||

ప ద | ప ద ని స || సా రి స ని | ద ని సా ||
న ట | న లే - టి || కే - - - | - ఆ హా ||

ప ప | స ని ద ప మ గ రి || సా | ని సా - ||
న ట | న - లే - - - టి || కే | - - - || ||పటి||

చ. ప ద | ప మా గ || ప మ గ | రి గ రి స ||
దే - | హా ధా రి || యై - - | న ఫ ల ము ||

స గ రి | ని సా స || స గ రి | గ మ మ ప ||
కె - లి | సి వేం క || టా - - | ద్రి వి భు ని ||

ప గ | రి స ని స || ప ద | ప ప మ ప ||
మో - | హా మం - ద || జే - | య లే - ని ||

ప ద | ప దా ని || సా | - సా రి స ని ద ||
ము రి | ప మే టి || కే | - - - - - - ||

స స | - ప ద ప || దా | ని సా - ||
ఆ హా | - ము రి ప || మే | టి కే - ||

ద ని | స స రి స || రి గ | మ గా రి ||
ఊ - | హా ద ల చి || త మ | క మం ది ||

ప స | ని రి స స || నీ | ద పా ప ||
ఒ క | రి కొ క రు || యి | ట్లు నే డు ||

పా | ప స ని స || ప ద | ప మ గ రి ||
సా | హా సిం - చి || క ల | య కు - న్న ||

రి గ | మ పా ద ప మ గ || రీ | - స సా ||
జ - | న్మ మే - - - టి || కే | - ఆ హా ||

సా రి స ని | ధ నీ రి || సా | - - - - ||
జ - - - | న్మ మే టి || కే | - - - - || ||పటి||

**అవతారిక :**

శ్రీరామచంద్రుని కొనియాడుచున్న అన్నమాచార్యులవారు ఎన్నియో కీర్తనలు చెప్పియున్నారు. ఇందు తాటక, రావణ సంహారముల వృత్తాంతము చెప్పుచు 'నీవు శ్రీ వేంకటేశ్వరుడవై వెలసి యున్నను రామావతారమందు భార్గవ రాముని ఓడించి శివ ధనుర్భంగమును గావించి అయోధ్యాపురమున రాజువై ప్రజలను పాలించి విలసిల్లినావు సుమా' అని కొనియాడుచున్నారు.

**రాగ లక్షణం :**

రాగములు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క పేరుతో వ్యవహరింపబడు చుండెడివేమో అని భావింపవలసియున్నది. ఏలననగా కొన్ని రాగముల స్వరూపములు నేడు కర్నాటక సంగీత వాఙ్మయమునందు కానవచ్చుటలేదు. వీటికి పేర్లు మారినవో లేక ఇతర వాగ్గేయకారులు రచనలు చేయక విడిచినందువలన మనకు వాడుకయందు వినబడుటలేదో తెలియదు. ఇప్పుడీ దర్బారీకానడ అను పేరుతో వ్యవహరింపబడుచున్న యీ రాగము స రి గా మ ప దా ని స । స ని ప మ గ మ రి స అను ఆరోహణావరోహణములు గలిగి, నట భైరవి జన్యముగా చెప్పుకొనవలసి యున్నది. ఈ రాగముయొక్క ఇప్పటి పేరు దర్బారీ కానడ. ఇట్లే అయ్యవారు వాడిన తెలుగు కాంబోది, ద్రావిడ భైరవి, కొండమలహరి, నారణి, దేశాళము మొదలగు రాగముల స్వరూపములుగాని, ఆరోహణావరోహణములుగాని కానవచ్చుట లేదు. ఆ యా రాగములయందలి సాహిత్యములలో అందమైనవి ఏరుకొని వేరు వేరు రాగములలో సంగీత రచనలు చేసుకొనక తప్పుటలేదు.

**దర్బారీ కానడ—ఝంపె**

రాజీవ నేత్రాయ రాఘవాయ నమో
సౌజన్య నిలయాయ జానకీశాయ ॥ ॥ పల్లవి ॥

దశరథ తనూజాయ తాటక దమనాయ
కుశిక సంభవ యజ్ఞ గోపనాయ
పశుపతి మహా దనుర్భంజనాయ నమో
విశద భార్గవ రామ విజయ కరణాయ । ॥ రాజీవ ॥

భరిత ధర్మాయ శూర్పణ ఖాంగ హారణాయ
ఖర దూషణాది రిపు ఖండనాయ
తరణి సంభవ సైన్య దక్షకాయ నమో
నిరుపమ మహా వారినిధి బంధనాయ ॥ రాజీవ ॥

హత రావణాయ సంయమి నాథ వరదాయ
అతులిత అయోధ్యపురాధిపాయ
హితకర శ్రీ వేంకటేశ్వరాయ నమో
వితత వావిలి పాటి వీర రామాయ ॥ రాజీవ ॥

అ : 7—89

ప. రి ని సా స | రి స రీ రి || రి ప ప మ గ మ | రి రి సా - ||
రా - జీ వ | నే - త్రా య || రా - ఘ వా - - | య న మో - ||

మ ప దా ద | ని ని సా ప || మ ప ని ప మ గ మ | రీ సా - ||
సౌ - జ న్య | ని ల యా య || జా - న - కీ - - | నా య - || ||రాజీవ||

చ. రి రి రి రి రి | గ మ రీ స || పా - మ గ | గ మ రీ స ||
ద శ ర థ త | నూ - జా య || తా - ట క | ద మ నా య ||

మ మ మ పా | ద ద ని ప ప || సా ని ప మ గ గ మ | రీ - - - ||
కు శి క సం | భ వ య - జ్ఞ || గో ప - నా - - - | య - - - ||

మ మ ప ప ప | దా ని సా || సా స సా | రి ని సా ||
ప శు ప తి మ | హా ధ ను || ర్భం జ నా | య న మో ||

రి రి రి గ మ | రి రి సా స || మ ప ని ప మ గ గ మ | రి సా - ||
వి శ ద భా - | ర్గ వ రా మ || వి జ య - క - ర - | ణా య - ||
||రాజీవ||

**అవతారిక :**

"నీ యందు నాకు గల చనవు చేత, నీపై నాకు గల అనురాగము చేత నీతో పెనగులాడుచు వాగ్వాదములు చేయుచు చిలిపి చేష్టలతో నిన్ను విసిగించియుందును. హద్దులు దాటిన దాననినియు హెచ్చు తగ్గులు తెలియని దాననినియు, మంకుతనము గల దాననినియు భావించక నన్ను మన్నింపవయ్యా, నీకు మ్రొక్కుచున్నాను." అని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని వేడుకొనుచున్నది.

**రాగ లక్షణం ;**

వసంతవరాళి ప్రాచీనరాగములలో నొకటి. ఇందు తాళ్ళపాకవారి రచనలు తరువాత తిరిగి ఇతర వాగ్గేయకారులు రచనలు చేసినట్లు కనబడదు. ఇది యిప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు-నట భైరవి జన్యము గనుక ఆరోహణము నందు చతుశ్రుతి ధైవతము, అవరోహణము నందు శుద్ధ ధైవతములు కలిగి యిది భాషాంగముగా రూపొందుచున్నది. స రి మ ప ద స । స ని ద ప గ రి స అనునవి ఆరోహణా వరోహణములు ఇందు కొన్ని తాళ్ళపాకవారి రచనలు పాడి చూచి రాగ స్వరూప స్వభావములను గుర్తెరుగ వలసియుండును.

**వసంత వరాళి—త్రిపుట**

అన్నిటికి నెలవుగా నిధివో మ్రొక్కే నేను
మన్నించు మింతట నన్ను మంకు నే నెరుగను ॥ పల్లవి ॥

చనవు గలదు గాన సరివెనగితి నీతో
యెనసి చన్నులొత్తుట యెరగనైతి
నను మన్నింతువు గాన నవ్వులెల్ల నవ్వితిని
మనసుకు వెంగమౌత మరి నే నెఱగను ॥ అన్నిటికి ॥

మచ్చిక గలదు గాన మాటలెల్లా నాడితిని
యెచ్చు కుందులగుట నే నెఱగనైతి
యిచ్చగింతువు గనక యిట్టే పాదము దొక్కితి
ని (న) చ్చలాన మితిమీఱుటని యెంచనైతిని ॥ అన్నిటికి ॥

సేస వెట్టితివి గాన చేతులు చాచితి నీపై
యీ సిగ్గులు రేగుట నే నెఱగనైతి
రాసి కెక్కించితి గాన రతుల జొక్కించితిని
ఆసల శ్రీ వేంకటేశ అలయిక చూడను ॥ అన్నిటికి ॥

శ్రృం : 19–399

ప. - - రి । మ మ పా ॥ ప ద సా । స ని నీ ద ప ॥
- - అ । న్ని టి కి ॥ నె - ల । వు - - గా - ॥

పా స రి । మా గ రి ॥ స రి మా గ రి । స రి గ రి రీ గ స ॥
- ని ది । వో ౖమొ - ॥ క్కె - - - - । నే - - - ను - - ॥

సా ఫ ధ । స రి మ గ రి ॥ సా రి । మా ప ని ద ॥
- మ - । న్నిం - - చు - ॥ మిం త । టా న - - ॥

పా స । స ని స ని ద ప ॥ గ రి మా । గ రి గ రి సా ॥
న్న మం । కు - - - నే - ॥ నె - రు । గ - - - ను ॥ ॥అన్నిటికి॥

చ. - - మ । మా ప ద పా ॥ గ రి గ రి మా । గ రి సా ॥
- - మ । చ్చి క - - ॥ గ - ల - దు । గా - న ॥

- - ని ధ । ఫ ధ ఫ ధ సా ॥ స రి స రి మా । మ గ రీ రి స ॥
- - మా - । ట - - - లె ॥ ల్లి - - - - । నా - - డి తి ॥

సా ఫ ధ । స రి మా గ రి ॥ స రీ । మా పా ॥
ని యె - । చ్చు - - కుం - ॥ దు ల । గు ట ॥

ని ద ప మ ప ద । సా సా రి స నీ ॥ ద ప ద మ । పా - - ॥
నే - - - నె ఱ । గ నై - - - ॥ తి - - - । - - - ॥

- - మ । మా పా ప ద ॥ స సా । సా రి స నీ ద ప దా ॥
- - ఇ । చ్చ గిం - - ॥ తు వు । గ - - - న - - ॥

సా ప । స రి మా గ రి ॥ సా గ రి రి స । స ని ని ద ద ప దా ॥
క ఇ । ట్టే - - పా - ॥ ద ము - - - । త్రో - - - క్కి - - ॥

సా ప ద । సా రి రి స ని ॥ సా - । స ని స ని ద ప ॥
తి ని - । చ్చు లా - - - ॥ న - । మి - - - తి - ॥

పా రి మ । ప ద స ని ని ॥ ద ప ని ద పా । గ రి మా గ రి ॥
- మీ - । ఉ - - టని ॥ యెం - చ - - । - - - నై - ॥

ప ప రి । మ మ పా ॥
తి ని అ । న్ని టి కి ॥

**అవతారిక :**

ఇందు నాయిక నాయకుని యందు గల దక్షిణ నాయకత్వమును తెలియజెప్పుచు "నీవు గొల్లె తలను ఏలిన వాడవు, పదునారువేల కన్నియలను పాలించిన వాడవు. నీకు యెందరో దేవేరులు గలరు. వారికి వారి యందమునకు యెందును సరిరాని నన్ను సరస నుంచుకొని లాలించితివి. ఇది నీ అనురాగమునకు తగి యున్నను మనసునందు నాకు మాత్రము నేను నీకు తగిన దాననా యను భావము కలుగజేయుచున్నది." అని గోముగా నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునితో చెప్పుకొనుచున్నది.

వసంత వరాళి—రూపకం

పరగ నే జేసినట్టి భాగ్యము గాక
సరస నీ దేవుళ్ళలో చక్కని దాననా ॥ పల్లవి ॥

మన్నించి నీవు నను మాటలాడించేవు గాక
యెన్నిక నీ సతులలో నేమి జాతి
అన్నిటా నేరుపరివై యాదరించేవు గాక
కన్నెలు పదాఱు వేలకంటె దొడ్డదాననా ॥ పరగ ॥

యెల్లగా నాచే విడె మిప్పించుకొనేవు గాక
తొల్లిటి కాంతలకంటె దొరనా నేను
మెల్లనె నా చన్నుల మీద జేయి వేసేవు గాక
గొల్లెతలకంటె నే నెక్కుడు దాననా ॥ పరగ ॥

ననుపున గూడి నన్ను నవ్వు నవ్వించేవు గాక
చనవరి కాంతల సరి వత్తునా
యెనసితివి శ్రీ వేంకటేశ నన్ను నింతలోనె
మునెడి వారికంటె మలసేటి దాననా ॥ పరగ ॥

శృం : 25—60

ప. రి మ | పా ద ప ప మ పా || గ రి | మ మ గ రి సా ||
ప ర | గ - - నే - - || జేసి | న - - - ట్టి ||

స రి గ రి | రి స ని ధ ఫ ధ || సా | - - - - ||
భా - - - | గ్య - ము - గా - || క | - - - - ||

రి మ | ప పా ద ప మ ప || ప ద సా | స ని ని ద పా ||
స ర | స నీ - - - - || దే - - | వు - ల - లో ||

- గ | రి స రి || మ మ గ రి | గ సా - ||
- చ | క్క ని దా || - - న - | నా - - || ||పరగ||

చ. - రి మ | పా ద ప || ప ద సా | స స ని ద పా ||
- మ - | న్నిం చి - || నీ - వు | న - - - న్ను ||

- రి | మ ప ని ద ప || ప మ పా | గ గ రి రీ స ||
- మా | ట లా - - డిం || చే - - | వు గా - - క ||

- ధ ధ | సా రీ గ రి రి స || రి మ | ప ప ని ద ప ||
- ఎ - | న్ని కా - - - - || నీ - | స తు - ల - ||

మ ప | రి గ రి స || రి మ | ప ద ప ద పా ||
లో - | - నే - మి || భా - | - - - - తి ||

- ప ద | సా సా || రీ గ రి రి స | రి గ రి గ రీ ||
- లి - | న్ని టా || నే - - - - | ర్వ - రి వై - ||

- రి స | రీ మ ప గ రి || స ని ద | ప ద స స ||
- ఆ - | ద రిం - - - || చే - - | వు గా - క ||

- ప ద | సఀ సాఀ సఀ || గఀ రిఀ సఀ ని | ద ప ద సఀ సఀ ||
- క - | న్నె లు ప || దా - - - | రు - వే - అ ||

స ని ద | ప ద మ ప || గ రి | గ గ రి రి స స ||
క - - | న్న దొ - డ్డ || దా - | న నా - - - - ||

||పరగ||

**అవతారిక :**

ఇందు నాయిక విరహార్త, ఈమెకు ఓరిమి చాలకద్దు. నాయకుని యందు తనకు గల ప్రేమను చెలులతో చెప్పుకొనగా వారి మాటలు విని తనను ఏలిన నాయకునితో "నీ యంత నీవు వచ్చితివా ఇప్పుడు ఆనలు పెట్టు కొనుచున్నావు కాని, నీకు నా యందు నిక్కముగా దయ యున్నదా, సేవలు సేసి నీ మనసు కరగించి నేనే పైకొని నిన్ను ఆనందింప జేసితిని గాని నీ యంత నీకు నాయందు కరుణగలిగినదా" అని సూటిగా నాయకుని అడుగుచున్నది. నిజమునకు బెట్టు చేసి నాడే గాని శ్రీ వేంకటేశ్వరునకు ఈమె యందు అనురాగము లేదనుటకు వీలున్నదా !

**వసంత వరాళి — రూపకం**

అనలేల పెట్టుకొనే వప్పటి నాతో
దానికేమి దోసమా తగినంతే కాక ॥ పల్లవి ॥

చెలిచే చిలిపించగ చేర వచ్చితివి గాక
వలచి నీ యంత (వ త) నీవే వచ్చితివా
వెలలేక మోహించి విడువలేనే గాక
కల నీ గుణమే తొల్లి కన్నది గాదా ॥ అనలేల ॥

సేవలు నే జేయగాను చిత్తముగరగె గాక
కావించి నీ యంత నీవే కరగితివా
యీవల గూళనై నేనె యిట్టె పైకొందు గాక
చేవ గలంతే కాక నేసి పెట్ట వచ్చునా ॥ అనలేల ॥

దండ నేనే వుండగాను దయదలచితి గాక
గుండె గరగి నీ యంత గూడితివా
నిండిన శ్రీ వేంకటేశ నీకు నాకు బోదు గాక
వెండియు నీతో విన్నవించ గురి యున్నదా ॥ అనలేల ॥

శ్లో : 17-876

ప. - స గ । రి సా స ॥ రీ । మ ప దా ॥
- ఆ - । న తే ల ॥ పె । ట్టుకొ నే ॥

ప ప ద । సా స ని ద ప ॥ మ ప । - గ రి స ॥
- వ - । - ప్ప - టి - ॥ నా - । - తో - - ॥

- ప । ద సా స ॥ రి గ రి స । ని ద పా ద ॥
- దా । ని కే మి ॥ దో - - - । స - మా - ॥

స ని । ద ప ప ద నీ ॥ ప ద మ । ప గ రి స ॥
త గి । నం - తే - - ॥ గా - - । - క - - ॥ ॥ఆనతేల॥

చ. - రి మ । మా మ మ ॥ ప ద । నీ ద మ ॥
- చెలి । చే పి లి ॥ పిం - । చ గ - ॥

- ప । ద మ ప ప ॥ గ రి । స రి మా ॥
- చే । ర వ - చ్చి ॥ తి వి । గా - క ॥

- రి మ । మా ప ద నీ ॥ ద ప । ద సా - ॥
- వ ల । చి నీ - - ॥ యం - । త నీ - ॥

స స ని । ద ప ద మ ॥ పా । - - - - ॥
వే - - । వ - చ్చి తి ॥ వా । - - - - ॥

- ప । ద సా స ॥ స రి మ ప । గ రి రీ ॥
- వె । ల తే క ॥ మో - - - । హిం - చి ॥

- గ రి । సం సం ని ద ప దా ॥ సా । సా - - ॥
- వి డు । వ తే - - - నే ॥ గా । కా - - ॥

- ప ద । సా సం సం ॥ సం రి గా । సా సా ॥
- క ల । నీ గు ణ ॥ మే - - । తొ ల్లి ॥

సం ని । ద ప ద మ ॥ పా । - గ రి స ॥
క - । న్న ది - - ॥ గా । - ద - - ॥

॥అన తే॥

**అవతారిక :**

ఇందలి నాయిక జాణ, చమత్కారముగా తన నాయకుని చేతలు చెప్పకూడనివి అనుచునే చెలిమిక త్తెకు చెప్పుచు "ఎంతమన్నించెనమ్మా నాస్వామిలోకమందెచ్చటను ఇటువంటి ప్రేమ ఉండవుసుమా" అని యాడుకొనుచున్నది. ఇందు అయ్యవారు సూచించిన శృంగారము అనన్య సామాన్యము.

**రాగ లక్షణం :**

నాగగాంధారి ప్రాచీనరాగములలో నొకటి. మేళకర్తల అవిర్భావమునకు పూర్వమే కొన్ని రాగములు స్వతంత్రములకు స్వరూపములను సంతరించుకొని యున్నవి. మేళకర్తలు వెలసిన తరువాత ఈ రాగములకు జనకరాగములుగా ఆయా మేళకర్తలను పేర్కొని లక్షణకారులు చెప్పకొనియున్నారు. నారీరీతిగౌళస్థానమున నటభైరవి నిర్ణయింపబడినది. నాగగాంధారి నటభైరవి జన్యముగా ఇప్పుడు వినబడుచున్నది. ఇందు ఇతర వాగ్గేయకారుల రచనలంతగా కనబడుటలేదు. తాళ్ళపాక వారి రచనలు తగుమాత్రముగా నున్నవి.

స రి మ గ మ ప ద ని స । స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు.

ఇది భైరవి జన్యమైనను ఇందు చతుశ్శ్రుతి ధైవత ప్రయోగములు లేవు.

### నాగగాంధారి — రూపకం

ఎంత మన్నించెనే నన్ను నితడు నేడు
వింతలు లోకానకెల్లా వెగ్గళము లే ॥ పల్లవి ॥

యేకతాన దా బెట్టిన వెటువంటివో ఆనలు
వాకుచ్చేనంటే నా వసము గాదే
చేకొని యప్పుడు నాకు జెప్పినట్టి ప్రియములు
దాకొని రట్టు సేయగ దగవు గాదే ॥ ఎంత ॥

తానే మా యింటికి వచ్చి తగనిచ్చిన యీవులు
పానిపట్టి యెక్కడా జూపగరానివే
నానా విధముల నాతో నవ్వినట్టి నవ్వులు
ఖానకమై మతిలోన దాచ వలెనే ॥ ఎంత ॥

యిప్పుడే (శ్రీ) వేంకటేశు డెనసిన కూటములు
చిప్పిలి నామైనుండగ సిగ్గులయ్యీనే
ముప్పిరి నా మీద నిట్టే ముంచినట్టి మోహములు
ఢొప్పుగా నాజవ్వనాన కుంకుమాయెనే ॥ ఎంత ॥

శ్లో౦ : 19–537

ప. - స | రి మా మ గ ॥ గ రి రి స | రీ మ మ ॥
- ఎం | త మ న్నిం - ॥ - - చె - | నే న న్ను ॥

పా ని ద | ద ప ప మ పా ॥ మ గ గ రి | మా మ గ గ రి ॥
ఇ త - | - - - - డు ॥ నే - - - | - డు - - - ॥

- మ | ప ని ద ప మ ॥ ప ద ని స | ని సా స ॥
- విం | త లు - లో - ॥ కా - - - | ని కె ల్లా ॥

రి గ మ గ | రి స ని ద ప మ ॥ ప ద ని స | - - ని ద ప మ గ రి ॥
వె - - - | - - గ్గ - శ ము ॥ లే - - - | - - - - - - - - ॥

స స | రి మా మ గ ॥ గ రి రి స | రీ మ మ ॥
ఎ ం | త మ న్నిం - ॥ - - చే - | నే న న్ను ॥

చ. - మ | మ పా ద ప మా ప మ గ రి ॥ స రి మా | గ రి రి స స ॥
- ఏ | క తా - - - - - న - ॥ తా - - | బె - - ట్టిన ॥

- రి మ | పా ద ప ప మ ॥ ప ద ని స | సా ని ద పా ॥
- వెటు | వం టి - వో - ॥ ఆ - - - | - న - లు ॥

- మ | మా మ గ గ రి || స రి మ॰ | గ రి రి సా ||
- వా | కు చ్చే - - - || నం - - | చే - - నా ||

స ధ ప ధ | స స రి మ గ రీ || రి రి ని | సా - - ||
వ - శ - | ము గా - - - - || - - - | దే - - ||

- మా | ప ద ని స ని ద ప మ || మ గ రి | మ పా ప ||
- చే | కొ - - - ని - - - || అ - ప్పు | డు నా కు ||

- ప | ప ద ప ప మ మా || ప ప ద | ని సా - ||
- చె | ప్పి న - - - ట్టి || ప్రి య - | ము లు - ||

- స | రి స రి మా || గ రి | సా - ని స స ||
- దా | కొ ని - - || ర ట్టు | సే - - య గ ||

గ రి స ని | ద పా మ || ప ద ని స | - - ని ద ప మ గ రి ||
త - గ - | వు గా - || దు - - - | - - - - - - - - ||

స స | రి మా మ గ || గ రి రి స | రీ మ మ ||
- ఎం | త మ న్నిం- || - - చె - | నే న న్ను ||

**అవతారిక :**

జెఅవులు బెట్టి నన్ను భ్రమియింపకు. నీ మాటలు, నీ చేతలు నాకు తెలుసు. నీవు చనవిచ్చి మాటాడితే చిరునవ్వులు నవ్వితే నాకు మోహము మితిమీరు చుండును. కుండెడు పాలను తోడుబెట్టుటకు ఇంత చల్ల చాలదా ? అల్లే ప్రియమైన ఒక చిన్న చేత నాలోని మోహమును ఉబికింప జేయును. జఅవులు బెట్టకుమీ నా సామి" అని ప్రేమోత్కంఠితయగు నాయిక నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని వేడుకొనుచున్నది. ఇందలి యురుమానములు అతి మనోజ్ఞములు.

**రాగ లక్షణం ;**

హిందోళవసంతం ఇప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు నటభైరవి జన్యము స గ మ ప ద ని స । స ని ద మ ప మ గ స అనునవి ఆరోహణావరోహణములు. ఇది ప్రాచీన ప్రసిద్ధములగు రక్తిరాగములలో నొకటి. ఇందు క్షేత్రజ్ఞులును, ఇటీవలి వారైన త్యాగరాజస్వామి, ముద్దుస్వామి దీక్షితులు మున్నగు వాగ్గేయకారులును రచనలను చెప్పి యున్నారు. ఇందు 'ద ని ద స' 'మ ప ద ని స' అను ప్రయోగములును వచ్చుచుండుట కద్దు. క్షేత్రజ్ఞుని పదములయందు ఇట్టి ప్రయోగములు కలవు.

**హిందోళ వసంతం—త్రిపుట**

ఎఱుగదు నీ సుద్దు లేమి చెప్పేవు
జఅవుల బెట్టితే చలము రేగీని ॥ పల్లవి ॥

వంచి చల్లని నీళ్ళేకావా కొచ్చిపారేవి
మంచి నీ మాటలే కావా మరగించేవి
కొంచి నీవు నను వేడుకొనకంత సారెసారె
యెంచ నా చెక్కుల గోళ్ళంతలో నాటేని ॥ ఎఱుగదు ॥

ఇసుమంత చల్లే కాదా ఇన్నిపాలూ జేరించేది
పసని నీ నవ్వే కాదా భ్రమయించేది
ముసరి నా చన్నులివి ముట్టి యానవెట్టకు
పైస నీ గట్టి చేతులు కసుగందించీని ॥ ఎఱుగదు ॥

మాగితే కాయ కాదా మంచి ఫలమయ్యేది
కాగిట నీ పొందే కాదా కరగించేది
చేగదేర నేలితివి శ్రీ వేంకటేశ నన్ను
రేగి రేగి కొసరకు రెట్టించీ వలపు ॥ ఎఱుగదు ॥

శృం : 19–380

ప. - - స గ | మా గా || గ మ పా | మా గా ||
- - ఎ ఱు | గ దు || నీ - - | సు ద్దు ||

సా గ మ | ప ద నీ ద మ || పా - | ప మ గా గ స ||
లు ఏ - | మ - - ని - || చె - | ప్పే - - వు - ||

సా గ మ | ప ద నీ ద మ || దా - స నీ | సా సా ||
- జ ర | పు - - ల - || బె - ట్టి - | తే - ||

- - ని స ని స | నీ - ద ద మ || మ ప మ ప మా - గ | గ మ గ మ గ స ||
- - చ - ల - | ము - - రే - || గీ - - - - - - | ని - - - - - ||
||ఎఱుగదు||

చ. ప పా | ప ద నీ ద మ || గ మా | గ స గా ||
మం చి | చ - - ల్ల ని || నీ రే | కా - ద ||

- - గ మ | పా మా || గ ప మ గ | గ స సా ||
- - కొ - | చ్చి పా || రే - - - | వి - - ||

సా ఫ ధ | ని ధ సా || సా గ | మా గ స ||
- మం - | చి - నీ || మా ట | లే గా - ||

గా గ మ | ప ద ని స ని ద మా || ప మ గా గ స | గ మ పా ||
దా మ ర | గిం - - - - - - - || చే - - - - | - - వి ||

- - ప ద | నీ ద ద మ || పా ప ద | ని ద సా ||
- - కొం - | చి - నీ - || వు న - | న్నూ - వే ||

సా ని స | గ గ సా || గ స ని ద దా | నీ సా ||
డు కొ న | కం - తా || సా - రె - - | సా రె ||

- - ని | సా గా || మా - | గా సా - ని ||
- - ఎం | చి నా || చె - | క్క ల - - ||

సా ని స | గ గ సా ని స నీ స ని || దా ని స ని ద మ | మ ప మ ప మ గ మ గ మ గ
గో ళ్లిం - | త - - లో - - - - || నా - - - - - | చే - - - - - - - - - -

సా స గ | మా గా ||
నీ ఎ ఱు | గ దు ||

**అవతారిక :**

ఇందలి నాయిక మానవతి, శీలవతి గనుక నాయకుని దయను కాంక్షించుచు అతనికై వేచియుండుట తప్ప తనవంటి వారికి వేరు త్రోవలేదని చెప్పుకొనుచు మునుపటి 'సుద్దులను తలచుకొని ఇప్పుడు తగవులాడుకొందునా కన్నెనగు నాకు అతడే పతిదేవు'డనుచున్నది.

హిందోళ వసంతం — ఝంపె

యేలే నాకు వేగిరము యింక నేమిటికి చింత
తాలిమి నాతడే నాకు దక్కి వుండే గాకా ॥ పల్లవి ॥

ప్రియమెంత గలిగిన బిలువక వత్తురా
నయముగల దంటాను నవ్వవచ్చునా
క్రియ యెఱిగిన యట్టి కిమ్మగల యిల్లాలికి
దయ గల దాకా పతి దగులుట గాకా ॥ యేలే ॥

బలిమెంత గలిగినా బైకొనగవచ్చునా
చలమీడేరీ నంటాను జంకింతురా
కుల కాంతలకు దమ గుణముతోనే పతి
తలపులో మెలగుటే తగ వింతేకాక ॥ యేలే ॥

మన్నించి యెంత గూడినా మందెమేలము చెల్లునా
మున్నిటి సుద్దులు నేడు మొనసేతురా
యన్నిటా శ్రీ వేంకటేశు డిప్పుడిట్టె నన్ను గూడె
కన్నెనైన నా కితడే గతి యంట గాకా ॥ యేలే ॥

శృం : 18—27

ప. గ మ పా మ | గ మ ప మ గ గ స ||
యే లే నా కు | వే - - - గి ర ము ||

స ని ద ని స ని ధ | ని స గా మ ||
ఇం క నే - - - మి | టి కి చిం త ||

- ద ని స స ని ద | ని ద మ ప మ ||
- తో - లి మి - న | త డు నా - కు ||

- గ మ ప మ | గా ప మ గ స ||
- ద క్కి యుం - | డి నా - - - || || యేల ||

చ. - మ మ మా మ | గ స గ మా ||
- ప్రి య మెం త | క లి గి నా ||

- స గ మ ప ద ని | దా మ పా ||
- పి లు వ కా - - | వ త్తు రా ||

- మ మ మ మ మ | ప ప మ గ మ మ గ స గ గ ||
- న య ము గ ల | దం - - - టా - - - ను - ||

స ని స గ మా ప ద ని స | ని ద మ పా ||
- - న - వ్వ వ - - - | - - చ్చు నా ||

- మ పా మ ధ ని | స ని ద నీ స ||
- క్రి య యె రి గి | న - - య ట్టి ||

- ద ని స స స | గా మ గా ||
- కి - ము్మ ల యి | ల్లా లి కి ||

- స ని ద ని సా గ గ | స ని స స ని ద ని ని ద మ ||
- ద య గ - ల దా - | - - కా - - - వ - తి - ||

ప ద ని ద మ | ప ప మ గ మ మ గ స స ||
త గు లు ట - | గా - - - - - - - క ||

|| యేల ||

**అవతారిక :**

ఇందు విరహోత్కయగు నాయికను 'నీ పతి రాలేదని భ్రమసి చందురుని మలయపవనుని, పూమొగ్గలను, కోయిల పలుకులను నీవు దూరుచున్నావు. కాని అవియన్నియు నీ యందే గలవు గదా. పాలసముద్రమునందు ప్రవేశించి యున్ననాడు నీ మోము నీడ నీటి యందు పడి చందురుడైనాడు. నీ యూర్పుగాలి గంధపు కొండలను తాకి తిరిగి వచ్చుచుండుటచే అది మలయపవనమైనది. నీ పలుకులు వనముల యందు ప్రతిధ్వనించి కోవెల పలుకులవలె వినిపించుచున్నవి. నీ వక్షసౌందర్యములే పూమొగ్గలవలె వసంతమున పొడచూపుచున్నవి. నీకు ఇవి యన్నియు ఎట్లున్నను, అవి యన్నియు నీలోనే వున్నవి కదమ్మా' అని సఖి నాయికను ఊరడించుచున్నది. ఈ నాయిక సౌందర్యమును వర్ణించుచు అయ్యవారు జలధికన్యకా సౌభాగ్యమును చెప్పుచున్నారా — అనిపించుచుచున్నది.

**హిందోళ వసంతము — రూపకం**

పతిమీది తమకాన భ్రమసితి వింతే నీవు
అతివరో వెఱపేలే ఆపే నీవు గావా ॥ పల్లవి ॥

చందురుడితడు గాడే సతి నీ నెమ్మోముగాని
పొంది నీ నీడ జలధి బొడచూపెను
మందానిలుడు గాడె మగువ నీ వూర్పుగాని
గందపు గొండ దాకి కమ్మరానే తెంచెను ॥ పతి ॥

కోవిల కూతలు గావె కొమ్మ నీ యెలుగు గాని
యీావల ప్రతిధ్వనులై యెగసె వనానను
పూవుల మొగ్గలు గావె పూప నీ చన్నులు గాని
తావుల వసంత మాడ దలలెత్తె బొదల ॥ పతి ॥

చిక్కుల మరుడు గాడె శ్రీ వేంకటేశుడు గాని
తక్కి నీ మనసు చూచి దగ్గరె భావమున
యిక్కువ లంటికూడితి రిద్దరూ బానుపు మీద
మొక్కుగాదు మోపుగాని ముంచి నీపై వేసెను ॥ పతి ॥

శృం : 26–48

ప. స గ | మా పా || ప మ గ స | గా మా ||
పతి | మీ ది || త - మ - | కా న ||

గ మ | ప మ గా || ప మ గ స | ని ధ నీ సా ||
భ్రమ | సి తి విం || తే - - - | నీ - - వు ||

గ మ | ద ని సా || స ని దా | నీ సా ||
అ తి | వ - రో || వె - ర | పే ల ||

స ని ద మ | దా మా || గ మ ప మ | గ మ ప మ గా ||
అ - వి - | నీ వే || గా - - - | - - - - దా || || పతి ||

చ. దా | ద ద మ మ || గ మ ప మ | గ స గా ||
చం | దు రు డి త || డే - - - | గా - డే ||

స గ | స ని ధ ని || స గ | మ మా ప మ గ మ ||
స తి | నీ - నె - || మో్మ - | ము గా - - - ని ||

మా ప మ గ | మ ప ద మ || ద ని సా | స ని ద ద మ ||
పొం - - - | ది నీ - - || నీ - - | డె - జ ల ధి ||

గ మ | పా ప మ గా || సా | - - - - ||
పొ డ | చూ - - పె || ను | - - - - ||

ద మ | దా ని ని || స ని దా | నీ సా ||
మం - | దా ని లు || డు - - | గా డే ||

స గ | మ గా - || గా ప మ గ స | ని సా స ||
మ గు | వ నీ - || వూ - - - - | రు్వ గా ని ||

ద ని | స స సా || స గ మ గ | సా నీ ||
గం - | ద పు కొం || డ - - - | తా కి ||

ద ని స గ | మ గ ని స ని ద || ద ని ద | మ ప మ గా ||
క్ర - - - | మ్మ - రా - నే - || తెం - - | చె ను - - || || పతి ||

**అవతారిక :**

ఈ కీర్తనయందు తిరువేంకటాధిపుని దేవదేవోత్తముడు పరిపూర్ణుడు అచ్యుతుడు, అభవుడు అని కొనియాడుచు, బాలకృష్ణుడై పూతకి చనుబాలు త్రాగుట యశోదచే రోటికి కట్టబడి రెండు మద్దిచెట్లను విరచుట మొదలగు పనులు చేయుట ఒక లెక్కా! సముద్రములన్నియు ఒక్కటియైయున్నప్పుడు మఱ్ఱాకుపై సంతోషముగా పవ్వళించిన బాలుడు యితడేకదా! అనేకములగు బ్రహ్మాండ భాండములను తనకుక్షిలో నుంచుకొన్న వాడితడే కదా! ఇతడు శరణాగతులను రక్షించువాడని వీనిని కొనియాడవలసి వచ్చుచున్నదని అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

ఈ కీర్తనయందుగల కొన్ని వాక్యములు గమనార్హములు. ఎల్లజలధులు మిగిలి, అనగా సముద్రములు హద్దులు దాటి అని అర్థమును స్ఫురింపజేయుటకు యీ మాట అందముగా అమరినది. ఇందుకడు పెక్కు బ్రహ్మాండ కటకములు సుడివడిన అమనప్పుడు వినువీధి యందలి నక్షత్రమండలములన్నియు మన కన్నులముందు తిరుగుచున్నట్లు భ్రమకలుగుచున్నది. ఇందు ఒకచో 'నిన్ను' అని వేంకటేశ్వరుని సంబోధించుటయు, వేరొకచో 'ఇతడ'ని చెప్పుట మనకు చెప్పుచున్నారా యనునట్లు స్ఫురింపజేయుచున్నది. వేంకటాచలపతివద్ద తానుండి అచటగల భక్తులకు స్వామిని చూపుచు చెప్పిన రచన యేయోనని తోచుచున్నది.

**రాగ లక్షణం :**

శ్రీరాగము పూర్వప్రసిద్ధములైన ఘనరాగములలో నొకటి. దీనిని వెంకటమఖి సంప్రదాయమున 22వ మేళముగా చెప్పుకొనుచున్నారు. ఇప్పటి 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా దీనిని చెప్పుకొనవలసియున్నది. 'ప ద నీ' అను ప్రయోగము అక్కడక్కడ వచ్చునని పూర్వాచార్యులమతము. మేళకర్తలు పుట్టుటకు పూర్వమే ఈ రాగము ప్రసిద్ధమైయున్నట్లు తోచుచున్నది. సంపూర్ణ సంపూర్ణములుగానుండని రాగములు మేళకర్తలుగా ఎట్లు ఏర్పరుపబడినవో తెలియని కొన్ని రాగములిట్టివి యింకను కలవు. గంభీరమగు ప్రకృతిగల యీ రాగమును లలితములు, మృదుమధురములునగు భావములను వ్యక్తపరచుటకు అన్నమయ్య వాడియున్నారు. వీరి తరువాత క్షేత్రజ్ఞులు కూడ పదములు చెప్పియున్నారు.

శ్రీ—ఝంపె

ఈతడే హరుడు యీతడే యజుడు
ఈతనికి నీ చేత లెంత ఘనమటుగాక ॥ పల్లవి ॥

కడు బెకు్క బ్రహ్మాండ కటకములు సుడివడిన
కడుపులో నిడుకొన్న ఘనుడు
వెడలి పూతకి చంటివిషము దాగినయంత
వడిదనకు నేమాయ వట్టి బూమెలు గాక ॥ ఈతదే ॥

ఎల్లజలధుల మిగిలి యేకమై వచ్చినపు
డుల్లసిల్లుచు నీతడుండు
మల్లాడి యొక రెండు మద్దులు విరచినట్టి
బల్లిదుడవని నిన్ను బరిణమింతురు గాక ॥ ఈతదే ॥

తిరువేంకటేశ్వరుడు దేవదేవోత్తముడు
పరిపూర్ణుడచ్యుతుడభవుడు
శరణాగతుల రక్షణసేయు (వా) డనుమాటి (?)
గురుతుగా దలపోసి కొనియాడగావలసె ॥ ఈతదే ॥

అ : 11–47

ప. ప ని స | రి గ రి || స ని | సా - || మా | ప ప ని ||
ఈ - - | త దే - || హా రు | డు - || ఈ | త దే - ||

ప మ | రీ - || ని స | రి గ రి || సా | స ని స ||
య జు | డు - || ఈ - | త ని కి || ఈ | చే - త ||

మ రి | మ మ ప || ని ని | పా మ ||
వెం - | త ఘ న || మ టు | గా క || ॥ ఈతదే ॥

చ. మ రి | మా మ || పా | పా మ ||
క డు | వె కు్క || బ్ర | హ్మాం డ ||

ప మ | ప ప ప || ని ని | ప ప మ ||
క ట | క ము లు || సు డి | వ డి న ||

రి మ | ప ప ని || ప మ | రీ గ ||
క డు | పు లో - || ని డు | కొ న్న ||

రి రి | సా - || - - | - - - ||
ఘ ను | డు - || - - | - - - ||

రి మ | ప పా || ని ని | పా మ ||
వె డ | లి పూ || త కి | చం టి ||

ప ని స | రి గ రి || స ని | సా స ||
- వి ష | ము గో - || లి న | యం త ||

ప ని | స స ని || ని ప | పా మ ||
వ డి | త న కు || నే - | మా య ||

రి గ | రి సా || రి మ | పా మ ||
వ - | ట్టి బూ || మె లు | గా క ||

|| ఈతడే ||

**అవతారిక :**

పోతన గారి భాగవతంలో "కమలాక్షునర్చించు కరములు కరములు." అన్న పద్యాన్ని చదివి ఉగ్గుఁబట్టని వారుండరు. అటువంటి భావాన్నే గేయరూపంలో అన్నమయ్యవారు చెప్పేరు.

నోరు తెరచి వెకిలిగా నవ్వుట, ఇతరులను, అర్హతలేని వారిని వేడుకొనుట చేయునే గాని, శ్రీహరిని కీర్తించినచో అనంతములగు సంపదలు గలుగవా ? అట్లే, కనబడిన వారందరికీ మ్రొక్కులిడుచు, అడుగ గూడని వారిని యాచించుటకు వెనుకాడని చేతులు, సమయమును వృథా చేయక హరిని పూజించవుకాని పూజించినచో కొదువలుండునా !

పరి పరి విధముల పరుగులిడు మనసు భగవంతుడగు శ్రీ వేంకటేశ్వరునిపై నిలువదు గాని నిలిచినచో ముక్తియను సంపద కలుగదా ! జీవుడు ఇట్లు నడుచుకొనక చెడిపోవుచున్నాడని అన్నమయ్యవారు చెప్పుకొనుచున్నారు.

శ్రీ — ఝంపె

కనుగొనగ జీవునకు గడుగు గాక యెరిగినను
అనవరత విభవంబులప్పుడే రావా ॥ పల్లవి ॥

విసుగ కెవ్వరికైన పేదనేర్చిన నోరు
దెసలకును బలుమారు దెరచునోరు
వసుధా కళత్రు దడవదు గాక తడవినను
యెసగ గోరికలు తనకిప్పుడే రావా ॥ కనుగొన ॥

మునుమంది యెవ్వరికి మ్రొక్కనేర్చిన చేయి
పొదుగి యధముల నడుగ బూను చేయి
అదన హరి బూజసేయదుగాక చేసినను
యెదురెదర గోరికలు యిప్పుడే రావా ॥ కనుగొన ॥

యెడయకు కేమిటికైన దమకమందెడి మనసు
అదరి యేమిటికైన నలయుమనసు
వదివేంకటేశు గొలువదుగాక కొలిచినను
భక్తి బడినె చెడని సంపదలిట్లు రావా ॥ కనుగొన ॥

ఆ 11—107

ప. ప మ ప ప ప || ధ ని ప ప ప ||
క ను గొ న గ || జీ - వు డె ర ||

ప మ పా ప || ప ని ప ప మ ||
గ డు గా క || యె రి గి న సు ||

రి మ ప ని ప మ రీ || రి గ రీ స ||
అ న వ - ళ - త || వి భ వం బు ||

స మ రి మ పా || ని ని మా పా - ||
ల - - ప్పు డే || రా - - వా - || || కనుగొనగ ||

చ. ప ని సా రి గ రి || స ని స స స ||
వి - సు గ కె - || వ్వ రి నై - న ||

ప ని సా రి గ రి || స స స ని స ||
వే - - డ నే - || ర్చి న నో - రు ||

ప ప ప ప ప || ప ని ప ప మ ||
దె స ల కు ను || ప లు మా - రు ||

ప ప ప స ని ని || సా - - - ||
తె ర చు నో - - || ఽ - - - ||

ప గ రీ స || ని ని ని ప మ ||
వ సు ధా క || శ - త్రు ద డ ||

ప ని సా ని || మ ప ని ని ప ||
వ్ర దు గా క || ద ఢ వి న ను ||

ప ని స ని రి స ని || ప మ రి గ రి సా ||
ఘొ స గ ణో - - - || రి క్క లు త - న ||

రి గ రి స ని సా రి మ || ప ని ని పా ||
కి - - - - ప్పు డే - || రా - వా - ||

|| కనుగొనగ ||

**అవతారిక :**

ఈ రచన యందు విరహార్తులగు జనుల నుద్దేశించి, విచిత్రములగు నుపమానములతో మలయమారుతము, వెన్నెలలు, కోయిలలు, తుమ్మెదలు, పుష్పములు, ఆమని, చిలుకలు మొదలగునవి వారినెట్లు బాధించుచున్నవో చెప్పుచు, తిరువేంకటాధిపుని దయ వారికి తనివారదాయె అని అన్నమయ్య అనుచున్నారు.

ఇచట గమనించదగిన విషయమేమనగా ఈనాడు భావకవిత్వమని చెప్పుకొనుచు గీతములు వ్రాయుచున్న కొందరి రచనలకు ప్రాచీనులగు తాళ్ళపాక వారి యిట్టి రచనలు మూలములేమోయని తోచుచున్నది ఇందు 'కోవిల నోరు పెడతటికి పోవుట' అనగా వెనుకకు తిరిగి పోవుట, కీరములు గూటబడుట, చంచరీకములకు చావు కలుగుట, పంచబాణుడగు మన్మధునికి బాధలు కలుగుట, మంచునునుగాలిని పెనుబాము తినుట, చిగురాకు కులమునకు చేటుగలుగుట, ఆమనిపై పిడుగుపడుట వంటివి జరుగవు కదా! జరిగినచో విరహులకు హాయి కలుగును. ఇట్టి విచిత్రభావములను గీత రూపమున మొదట చెప్పిన ఘనత అన్నమయ్యవారిదేనేమో!

శ్రీ—ఝుంపె

కటకటా విరహులెక్కడ బ్రదుక గల వారు
కుటిలంపు కీరములు గూట బడవాయె ॥ పల్లవి ॥

పంచ బాణునకు నాపద లెందు లేవాయ
మంచుకిరణము లతని మదమణగదాయ
పెంచు కోవిల నోరు పెడతటికి బోదాయ
చంచరీకములకును జావు లేదాయ ॥ కటకటా ॥

చిగురాకు కులమునకు చేటెందు లేదాయ
పగటు నునుగాలి బెనుబాము దినదాయ
సొగసు కమ్మని విరుల చొప్పణగి పోదాయ
బిగువు నా మని మీద బిడుగు వడదాయ ॥ కటకటా ॥

తిరు వేంకటా చలాధిపుని కరుణారసము
తరుణులకు నందరికి దైవాఱదాయ
పరివోని సురత సంపదల దెప్పల దేలి
వర్ధ వధూత్తతికి పరవశమ్ము లేదాయ ॥ కటకటా ॥

శ్లో : 4—92

ప. - రి మ పా ని ని ప మ || రి గ రి సా ||
- క ట క టా - - - || వి ర హు లె ||

ఫ ని సా రి గ రి స ని || ని ప నీ సా ప ||
కృ - డ బ్రతు - క - || గ - ల వా రు ||

- రి మ పా ప || ని ని ప మ ప ప ప ||
- కు టి లం పు || కీ - - - ర ము లు ||

- ని స రీ గ రి స ని పా || పా ని ప మా ప మ రీ గ రి స స ||
- గూ - ట - - బ - డ || వా - - - - - - - - - - య || ||కటకటా||

చ. - మ మ మా || ప ని ప మ రి గ రి ||
- పం చ బా || ణు - న - కు నా - ||

ఫ ని సా రీ గ రి స స || రి మ పా ప ||
ప - ద లెం - - - డు || లే - వా య ||

- మ మ మ రి మా || ప ప ని ని ప మ ప ||
- మం చు కి - ర || ణ ము ల - త - ని ||

ప ని సా రీ గ రి స ని పా || ని ని మా పా - ||
మ - ద మ - - ణ - చ || వా - - య - ||

- గ రి స ని ప ని సా || రీ గ రి స రి గ రి గా ||
- ఫెం - చు - కో - కో || వి ళ - నో - - - రు ||

\- ని స రి మ ప మ రీ || గ రి రీ సా స ||
\- పె డ త - టి - కి || పో - - దా య ||

\- ని ని స రి మ రి || రి గ రి స ని ప ని ||
\- చం చ రీ - - - || క ము - ల - కు ను ||

\- ని స రీ గ రి స ని పా || పా ని ప మా ప మ రీ గ రి స స ||
\- చా - వు - - లే - - || దా - - - - - - - - - య || ||కటకటా||

**అవతారిక :**

ఇందునాయిక కలహాంతరిత, స్వాధీనపతిక. జాణ. తన నాధుని దక్షిణ నాయకత్వ మును చక్కగా నెరిగినది: గనుక "నీవు నా చెంత నుండిన నిన్నెవరైనా ఎత్తిపొడుపు మాటలాడేరా, నీ చేతలకు నవ్వేరా. నిన్ను నే నెరుగుదును. కాని వొట్టు పెట్టుకొని కన్నులతో నసత్యములాడి నన్ను మభ్యపరుప జూచుచున్నావు, నీకి పాల్లేల వచ్చినవో తెలుసా. నన్ను బాసి కొంచెపుభామల పొందుల కాశించి తిరుగుచున్నావు గనుక ఇప్పటికైనా నీ దయ వచ్చి మా యింటికి దయచేసి మన్నించి నన్ను గూడితివి. కానీలే. కానివారలు ఆడుకొన్నది యిక తలచనేల" అని కోపమున చెప్పగలిగినన్ని విధములుగా చెప్పి నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని యూరడించుచున్నది.

శ్రీ—రూపకం

నన్ను బాసి వుండనేల నాయాలకు రానేల
వున్నట్లానె వుంటే వొరసేరా నిన్ను ॥పల్లవి॥

కాంతల దిట్టగ నేలకాని కాని వొళ్లేల
యింతటి నీ గుణము నే నెఱగనిదా
పంతవుసాకిరు లేల పతితారుకాణ లేల
వంతున నా వద్ద నుంటే వచ్చినా నిందలు ॥నన్ను॥

పదరికోపించనేల బాసలు సేయగలేల
కదిసి నీ మోహము నే గన్నదె కాదా
వదరు బెదరు వెండ వాదులడువుగనేల
అదన నా వద్ద నుంటే ఆడేరా నిన్నును ॥నన్ను॥

నే నెంతైనా నమ్మనంటా నీకెయలుకవేల
కానీవేరా యిన్నియు నే గన్నవె కావా
పూని శ్రీ వేంకటేశుడ వొడబరచి కూడితి
నేను నీవూ నిట్టె వుంటే నే డనేరా నిన్ను నూ ॥నన్ను॥

శృం : 17—186

వ. - రి | గ గ రి రి స || రి | మ పా ప ||
- న | న్ను బా - - సి || వుం | డ నే ల ||

- రి మ | ప ని స ని ప మ || పా - మ | రి గ రి స ||
నా - | యా - - - ల కు || రా - - | - నే - ల ||

- రి | సా సా || రి స ని ధ | నీ సా ||
- వు | న్న ట్లా || నే - - - | వుం టే ||

- ని స | రి మ ప మ రి || - - | గ రి సా ||
- వా ర | సే - - - రా || - - | ని - న్ను ||

||నన్ను||

చ. - ప | ప పా మ || ప మ | రి గ రీ ||
- కాం | త ల తి || ట్ట గ | నే - ల ||

- ధ ని | స రి గ రి స || రి - ధ | సా సా ||
- కా - | ని కా - - ని || వా - - | ల్లే ల ||

- రి | మ పా - || ని ని ప మ | రి గ రీ ||
- ఇం | త టి - || నీ - - - | గు ణ ము ||

గ రి రి స | రి మ ప మ || పా | - - - ||
నే - - - | నె ఱ గ ని || దా | - - - ||

- ప | ప ని ని మ ప || ని ప | నీ సా ||
- వం | త పు - - సా || కి రు | తే ల ||

- గ రి | సా రీ || రి స ని ప | ని సా స ||
- ప తి | తా రు || కా - - - | ణ లే ల ||

- ని | స రి మ రి || గ రి రి | స స ని పా ని ||
- వం | తు న - నా || వ - - | ద్ద నుం - - డె ||

- రి మ | ప ని స ని ప మ || పా - మ | రి గ రి స ||
- వ - | చ్చి - - - నా - || - - - | నిం - ద లు || ||నన్ను||

**అవతారిక :**

"శ్రీహరి యగు శ్రీ వేంకటేశ్వరుని యురము నందుండి ఆయనకు సంసార సుఖము లిచ్చుచు కౌగిలియందు కరగించుచు మన్మథుని కన్నతల్లియు, సింగారములకు పుట్టినిల్లును, హరికి తాళి గట్టిన యిల్లాలును పరమాత్ముడగు నాతనికి భావములయందు మసలుచుండెడి కీలుబొమ్మ, ఆతని కొంగుబంగారము సరసములకు సముద్రము వంటిదగు ఈమెకు హారతులెత్తరే" అని చెలిమికత్తెలు అలమేలుమంగకును ఆ వేంకటేశ్వరునకును మంగళములు పాడుచున్నారు.

శ్రీ—రూపకం

ఎత్తరే ఆరతులీపె కింతులాల
హత్తెను శ్రీ వేంకటేశు కలమేలు మంగ ॥పల్లవి॥

హరి వురముపై సొమ్ము అరతగట్టిన తాళి
సరిలేని దేవుని సంసార ఫలము
సిరులకు బుట్టినిల్లు సింగారములనిత్తు
మెరుగుబోడి యలమేలుమంగ ॥ఎత్తరే॥

పరమాత్మునికి నాత్మభావములో కీలుబొమ్మ
కెరలుచు నితడు భోగించే మేడ
సరసపు సముద్రము సతమైన కొంగుపైడి
అరిది సంపదలది యలమేలు మంగ ॥ఎత్తరే॥

శ్రీ వేంకటేశునిదేవి చిత్తజుని గన్నతల్లి
యీ విభుని కౌగిటిలో యేచిన కళ
బూవపు పెండ్లి మేలుపొందిన నిధానము
ఆవలనీవల నీపె యలమేలు మంగ ॥ఎత్తరే॥

ప.　రి । మ ప ని ని ॥ ప మ రి । గ రి సా ॥
ఎ । త్త రే - - ॥ ఆ - - । ర తు లు ॥

ని స । ని ని ధ ని ॥ స రి గ । రి రి సా ।
ఈ - । పె కిం - తు ॥ లా - - । - ల - ॥

రి మ । రి మ పా ॥ ప ని । ప నీ స ॥
హా - । త్తె ను శ్రీ ॥ వేం - । క టే శు ॥

ని రీ । సా - ని ప ప ॥ ప మ రీ । గ రి సా ॥
క ల । మే - - - లు ॥ మం - - । గ - కు ॥　　॥ఎత్తరే॥

చ.　మా । ప మ రీ ॥ గ రి । సా సా ॥
శ్రీ । వెం క టే ॥ శు ని । దే వి ॥

ని స । రీ గ రి సా ॥ స ని ధ । ని ని సా ॥
చి త్త । జు - - ని ॥ గ - న్న । త - ల్లి ॥

ని స । రీ గ రి సా ॥ రి మ । రి మ పా ॥
యీా - । వి భు - ని ॥ కా - । గి టి లో ॥

ప మ । ప ప ని సం ని ప మ ॥ పా । - - - - ॥
హే - । చి న - - - క - ॥ శా । - - - - ॥

ని స । రీ గ రీ సా ॥ రీ మ ప మ । రీ గ రీ ॥
బూ - । వ పు - వెం ॥ డ్లి - - - । మే - లు ॥

సా రీ స ని । ప ని ని మ ప ॥ ని ప । ని ని సా ॥
పొం - - - । ది న - - ని ॥ ధా - । - న ము ॥

ని స । రీ గ రి సా ॥ ని ప । ని మ పా ॥
ఆ - । వ ల - నీ ॥ వ ల । నీ - పె ॥

రి మ । ప ని స ని ప మ ॥ రి గ । రి రి సా ॥
యల । మే - - - - లు ॥ మం - । - - గ ॥ ॥ఎత్తరే॥

**అవతారిక :**

'వరాకు వెలుపల లోపల శ్రీ వేంకటేశ్వరుడవైన ఓ విష్ణుమూరితీ నీవే నిండి యున్నావు. బూటకపు వలపులు మామైన చల్లి మమ్ములను ఏమార్చ జూచుచున్నట్లును, వెనుకొని మమ్ములను పట్టుచున్నట్లును నటనలు చేయుట చాలును. మా యందు కరుణ యుంచి ఆశతీరునట్లు మాతో మాటలాడుమయ్యా !' అని నాయకి చెప్పుచున్నట్లు అన్నమయ్య వారు చెప్పుకొన్నారు.

ఇందలి సాహిత్యము గమనించినచో ఇది జానపద గేయమువలె పాడగట్టుచున్నది. శ్రీరాగమునందు ప్రయత్నించినచో జానపద గేయములు పాడుకొనుటకు అనువైన స్వర సందర్భములు ఇట్లుండవలెనని తోచుచున్నది.

**శ్రీ—తిశ్రగతి ఆది**

వెట్టి వలపు చల్లకు విష్ణుమూరితినాతో
వెట్టి దేర మాటాడు విష్ణుమూరితి ॥పల్లవి॥

వినయము సేసేవు విష్ణుమూరితి నీవు
వెనకటి వాడవే కా విష్ణుమూరితి
వినవయ్యా మా మాట విష్ణుమూరితి మమ్మ
వెనుకొని పట్టకుమీ విష్ణుమూరితి ॥వెట్టి॥

వెరవుగల వాడవు విష్ణుమూరితి నేడు
వెరగైతి నిన్ను జూచి విష్ణుమూరితి
విరివాయె నీ మాయలు విష్ణుమూరితి నాకు
విరులిచ్చే వప్పటికి విష్ణుమూరితి ॥వెట్టి॥

వెలసె నీ సేతలెల్లా విష్ణుమూరితి మా
వెలుపలలోన నీవే విష్ణుమూరితి
వెలలేని శ్రీ వేంకట విష్ణుమూరితి కూడి
విలసిల్లితివి నాతో విష్ణుమూరితి ॥వెట్టి॥

శృం : 21—241

ప. రి మ మ ప ప । పా ప పా మ ॥ రి మ మ ప మ ॥
వె ట్టి వ ల పు । చ ల్ల కు - ॥ వి ష్ణు ము రి తి ॥

ṙ గ రి సా - ॥ స ని స రి గ రి । సా సా స రి ॥
నా - - తో - ॥ వె - ట్ట దీ - ర । మా టా డు - ॥

నీ స సా స । సా - - - - ॥
వి ష్ణు మూ రి । తీ - - - - ॥ ॥వెట్టి॥

ఛ. మ మ మ పా ప । ప ని ని ప ప మ ॥
వి న యు మూ - । సే - సే - వు - ॥

మా మ పా ప । ప నీ పా మ ॥
వి ష్ణు మూ రి । తి - ని వు ॥

మ మ ప పా ప । ప ని ని ప ప మ ॥
వె న క టి - । వా - డ వె కా - ॥

పా ని నీ స । సా - - - - ॥
వి ష్ణు మూ ర । తీ - - - - ॥

ని ని సా గ గ రీ । సా నీ పా ॥
వి న వ య్యా - - । నా మా ట ॥

పా ని పా మ । పా మ రీ స ॥
వి ష్ణు మూ రి । తీ - వం ము్న ॥

ని ని స రి గ రి । స స స స రి ॥
వె ను కొ నీ - - । ప - ట్టు కు మీ ॥

నీ స సా స । సా - - - - ॥
వి ష్ణు మూ రి । తీ - - - - ॥ ॥వెట్టి॥

**అవతారిక :**

పరమాత్మని యందు విశ్వాసంబు గలుగుటయు నొక యదృష్టమే. పాపపు చింతల యందును, కొరగాని పనులయందును మానవులు శ్రమసి పరిశ్రమించు చుందురు గాని పుణ్య కార్యముల యందును, దేవదేవుని యందును మనసు నిల్పియుంచుకొనుటకు సమర్థులు కాజాలరు గదా ! కుమ్మరి ఒక యేడు కష్టపడి తయారుచేసిన సామాగ్రిని గుదియ ఒక్క వ్రేటున పగుల గొట్టగలదు. అట్లే ప్రాణులు పాపములు చేసినను హరిని తలచి శరణు జొచ్చినచో గొర్రెల మందలోనికి పులిచొచ్చి బెదరవేసినట్లుండును. కొండలవంటి పాపములు చేసినను వానిపై పిడుగులు పడినట్లు చేయగల సామర్థ్యము తిరువేంకటాధిపుని నామము తలచుటలోనే కలదుకదా ! కనుక ప్రాణులు (శ్రీ) హరిని శరణువేడి బ్రతుకులు వెళ్లదీసుకొనుట మంచిదని అన్నమయ్యవారు ఈ రచనయందు చెప్పుచున్నారు.

శ్రీ—త్రిపుట

ఈ విశ్వాసంబు ఎవ్వరికి దొప దిది
పావనుల హృదయమున బ్రభవించు గాని ॥పల్లవి॥

ఇమ్మైన పాపంబు లెన్నివలసిన ప్రాణి
సమ్మతంబున జేయ జాలుగాకేమి
కుమ్మరికి నొకయేడు గుదియకొక నాడౌను
నమ్మితలచిన విష్ణునామంబు చేత ॥ఈవి॥

కొదలేని దురితములు కొండలు గోట్లును
చెదరకెపుడు బ్రాణి చేయు గాకేమి ?
పొదరి గొఱియలలోన పులి చొచ్చినట్లౌను
హృదయంబు హరిమీద నుండినంతటను ॥ఈవి॥

సరిలేని దుష్కర్మ సంఘములు రాసులై
పెరగ జేయుచు బ్రాణి పెంచు గాకేమి ?
బెరసి కొండలమీద బిడుగు బడ్డట్లౌను
తిరువేంకటాచలాధిపుని దలచినను ॥ఈవి॥

శృం : 5—64

ప. సా - । రీ గ రి స సా ॥ స ని రి సా ని । ని ప నీ ॥
ఈ - । వి - - - స్వా ॥ సం - - - - । బు - - ॥

ప గ రి । స (ి సా ॥ స ని ప ని । సా సా ॥
ఎ - వ్వ । రి - కి ॥ దో - - ప । ది ది ॥

పా - । ప ని స ని పా ॥ ప మ ప । రి గ రి స ॥
పా - । వ - ను - ల ॥ హృ ద - । య ము న - ॥

ని స రి గ రి సా । రీ మా ॥ ప మ రి గ రి స । రి మ ప ని స రి గ రి ॥
ప్ర - భ - - - । విం చు ॥ గా - - - - - । ని - - - - - - - - ॥ ॥యా॥

చ. - - రి । మా ప ని ప మ ॥ రి గ రి । స రి సా ॥
- - యి । మ్మై నా - - - ॥ పా - - । పం - బు ॥

- - ని స । రీ గ రి స స స ॥ స ని ని ధ । నీ ధా ॥
- - తె - । న్ని - - - వ ల ॥ సి - న - । ప్రా ణి ॥

- - ధ ని । స రి గా రి స ॥ రి రి ని । సా సా ॥
- - స - । మ్మ - - తం - ॥ బు న - । జే య ॥

- - రి । మా రి మ ॥ పా - । ని ని మా పా ॥
- - జా । లు గా - ॥ గా - । కే - - మి ॥

- - ప ని । సా రీ ॥ స రి గ రీ - । గా గా ॥
- - కు - । మ్మ రి ॥ కొ - క - - । యే డు ॥

- - గ రి । సా స ని పా ॥ నీ - । సా సా ॥
- - గు ది । య్య కొ - క ॥ నా - । ఢా ను ॥

- - ప గ॑ । రి॑ స॑ ని ॥ ని పా । పా - మ రీ ॥
- - న - । మ్మి త ల ॥ చి - । వి - - ష్ణు ॥

గ రి స । రీ మా ॥ ప మ రి గ రి స । రి మ ప ని స॑ రి॑ గ॑ రి॑ ॥
నా - - । మం బు ॥ చే - - - - - । త - - - - - - - ॥ ॥యా॥

**అవతారిక :**

"ప్రాణవునకు మనసు అన్నిటికిని మూలమగు చున్నది. పంచేంద్రియములకు చాటుగానుండి చూపులతో ఆశలు పెంచుకొని సతమతమై ఆపదలన్నిటిని పైన వేసుకొను చున్నది. తలపులయందు తగులాటములు పెంచుకొని వలపుల వలలలో చిక్కుకొని అలసటలకు లోనగుచున్నది. తిరువేంకట నాథుని చేతలే యివి యన్నియునని ఆతనిని దూరి ఆ దేవదేవుని కోపమునకు గురియై ఆతని కరుణకై కన్నీరుకార్చి అలమటించుచున్నది. కనుక మనసును నిశ్చలముగా నుంచుకొనుటకు ప్రయత్నించుటయే భవబంధములనుండి విముక్తిపొంది, ముక్తిని సాధించుటకు మార్గమగుచున్నది. మంచి చెడ్డలకు మూలము మనసే,"నని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణం :**

కన్నడగౌళ ప్రాచీనరాగము. ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. మేళకర్తల పుట్టు పూర్వోత్తరమునకు ముందే ప్రచారమునకు వచ్చియున్న రక్తిరాగములలో కన్నడగౌళ యొకటి. మేళకర్తలు యేర్పడినపిదప ఇట్టి రాగములకు జనకరాగములు నిర్ణయింపబడినట్లు తోచుచున్నది. ఇటీవలి వాగ్గేయకారులుకూడ యీ రాగమునందు రచనలు చేసియున్నారు.

స రి గ మ ప ని స — స ని ద ప మ గ స అనునవి ఆరోహణావరోహణములు

**కన్నడగౌళ—త్రిపుట**

మనసు తనపాలింటి మమకార భూతమై
అనయంబు నిన్నిటికి నాధార మాయ ॥పల్లవి॥

చూపులాసల దగిలి సుఖయించ బోయినను
పైపైనె తలపులో పరితాప మాయ
తాపంబుం బరవశము తనువు సొగసిన మఱియు
నాపదల కన్నిటికి నదిమూల మాయ ॥మనసు॥

**అవతారిక :**

"పూర్వకర్మ ఫలమని యొక వంక చెప్పుచు, నిదియంతయు దైవకృతంబని మరి యొక వంక చెప్పుచు సౌఖ్యము లనుభవించుటకు పూనుకొందురు. సుఖదుఃఖముల పరంపరల యందు పడి పొరలాడెడి సంసారములు ప్రాణులకెట్లు కలుగుచున్నవో! ఆశలు నిరాశలు మోహాపేక్షలు మొదలగు విషయములు నిజమునై శాశ్వతమునై యుండునను భ్రమకలుగుచునే యుండును. కాంతాకనకంబులు, కోరికలు, సుఖములు మంచి చెడ్డల యందు కాయము శాశ్వతమని పొరలాడుచుండుటలు తప్పవుగదా! ఇట్టి భవపాశముల యందు బంధింపబడి సత మగుట కన్న దేవదేవుడగు తిరువేంకటనాథుని సేవించి, తరించి నిజమగు నానందమును పొందుటకు జీవులు ప్రయత్నించిన శాశ్వతమగు సుఖము కలుగును గదా!" అని కాయపు వికారములను కష్టసుఖముల దొంతరలను, ఆశనిరాశల అటమటింపులను అయ్యవారు చెప్పుచు భగవంతుని యందు బుద్ధిని లగ్నము చేయుటలో గల ఆనందమును వివరించుచున్నారు.

కన్నడ గౌళ—చాపు

దైవకృతంబట చేతట తన కర్మాధీనం బట
కావలసిన సౌఖ్యంబులు కలుగక మానీనా ॥ పల్లవి ॥

ఎక్కడి దుఃఖ పరంపరలెక్కడి సంసారంబులు
యెక్కడి జన్మము ప్రాణులకేలా కలిగినది
యెక్కడి మోహవిడంబన మెక్కడి యాశాబద్ధ (oధ)ము
యెక్కడి కెక్కడ నిజమై యివి దానుండేనా ॥ దైవ ॥

ఈ కాంతలు నీ ద్రవ్యము లీ కన్నుల వెడయాసలు
యీ కోరిక లీ తలపులు యిట్టే వుండేనా
యీ కాయం బస్థిరమనకే దుర్దశలకు లోనై
యీ కల్మషముల బొరలగ నివి గడతేరీనా ॥ దైవ ॥

దేవ శిఖామణి తిరుమలదేవుని కృపగల చిత్తము
పావనమై దురితంబుల బాయక మానీనా
ఆ విభుకరుణా రసమున నతడే నను మన్నించిన
ఆ వేడుక లీ వేడుక లాసలు సేసీనా ॥ దైవ ॥

అ : 11–13 (ii)

ప. రి గా | మా మా || పా - | పా మా ||
దై - | వ కృ || తం - | బ ట ||

ప నీ | సా సా || ని దా | పా మా ||
చే - | త ట || త న | క ర్మ ||

పా - | మా మ గ || గ సా | - - - - ||
ధీ - | నం బ - || ట - | - - - - ||

ని సా | రి గ మ గ || గ సా | రీ గ గ ||
కాం - | వ ల సి న || సౌ - | ఖ్య బు లు ||

మ మ ప | ప ని స ని || ద మా | పా - - ||
క లు గ | క - మా - || నీ - | న - - || ||దై వ||

చ. పా ప | పా పా || పా ప | మా పా ||
ఎ క్క | డి దుః || ఖ - | ప రం ||

ప నీ | ని ద ద మ || పా మ | మ గ సా || రీ గ | మా - - ||
ప ర | తె - క్క డి || సం - | సా - - || రం బు | లు - - ||

రీ గ | మా మా || ప పా | పా ప మ ||
ఎ క్క | డి జ || న్మ ము | ప్రా ణు ల ||

పా - | నీ స స || ని నీ | సా - - ||
కే - | లా క లి || గి న | దీ - - ||

పా ని | సా సా || ని సా | సా స స ||
యె క్క | డి మో || హా వి | డం బ న ||

రి గ | మా గా || రి గ స | సా స స || పా ని | సా సా ||
యె క్క | డి యా || శా - - | బం ధ ము || ఎ క్క | డి కే ||

ṡ స ని | సఁ ని ద మ || ప పా | ని ద మా ||
క్క డ - | ని జ మై - || యి వి | తా - - ||

పా మ | గా సా ||
నుం - | డీ నా ||

||దై వ||

**అవతారిక :**

“ప్రేమోద్వేగమున మీరిద్దరూ ఒకటియైనారు. మమ్ము నీ వద్దికి రాయబార మంపి, వేరొక త్రోవను ఆమెయే పరుగిడి వచ్చినది. ఆమె వ్రాసి యిచ్చిన లేఖలు నీకు ఆమెయే చదివి వినిపించునోయేమో! ఇట్లు వచ్చిన ఆమెను చనవిచ్చి నీవును ఆదరించితివి. మీ యిద్దరికిని సరివలపులాయ! మాతో పనియేమి,” అని చెలులు తిరువేంకట నాథుని అలమేలు మంగా దేవిని ఎకసెక్కము లాడుచున్నారు.

కన్నడ గౌళ—ఝంపె

ఎడమాట లికనేల యిద్దరును గూడితిరి
ఆడరి జవ్వన పాయ మాపలేక వచ్చెను ॥ పల్లవి ॥

చెమటలు గారగాను చిరునెరులు దూలగ
తమ కాన నీ వద్దికి దానే వచ్చెను
మము నీ వద్దికి నంపి మనసు నిలుప లేక
ప్రమదాన నిట్టె పెద్ద పరువున వచ్చెను ॥ ఎడ ॥

కొప్పు గడు వీడగాను కుచములు గదలగ
నప్పసము నీ వద్దికి నాపె వచ్చెను
యిప్పుడే కమ్మలు వ్రాసి యిట్టె మాచేతికి నిచ్చి
చప్పుడుగా దానే యీడ చదువగ వచ్చెను ॥ ఎడ ॥

నడవు దడబడగ నలి బోకముడి వీడ
పడతి నీ వెంట బానుపుపైకి వచ్చెను
యెడమిచ్చి శ్రీ వేంకటేశ యింతి గూడితివి
జడియని రతుల నీ సరి వచ్చెను ॥ ఎడ ॥

శృం : 20–71

ప. - ని స రి గ మ మ | రి గ మ గ సా స ||
- ఎ డ మా - - ట | లి - క - నే ల ||

1. - రి గ మ ప స ని | ని ద ద ప ప మ మ గ గ స ||
- యి - ద్ద రు ను - | గూ - - - డి - తి - రి - ||

2. - ప ని స స | ని ద ద ప ప మ మ గ గ స ||
- యి ద్ద రు ను | గూ - - - డి - తి - రి - ||

- ని ద ప ద ప మా | ప ని సా స ||
- అ డ రి జ - - | వ్వ న పా య ||

- రి గ మా రి మ గ గ | సా ని ద ద ప మా రి మ || గ స
- మా - ప లే - - - | క వ - - - చ్చె ను - || - -

చ. ప ప ని ద ద ప మా | రి గ మా రి మ గ గ సా ||
చె మ ట - లు - - | గా - ర గ - - - ను ||

ని స రి గ మా గ స | రి రి గ మా మా ||
చి రు నె - రు లు - | దూ ల - గ - ||

ప ని ద ద ప మ మ | రి మ గ గ స రి గ ||
త మ - కా - - న | నీ - - - వ ద్ది కి ||

ని స రి గ మా | ప స ని ద పా ||
దా - నే - - | వ - - చ్చె ను ||

రి గ మా మ | గ స రి గ మా మ ||
మ ము నీ వ | ద్ది కి నం - - పి ||

రి గ మ పా । ని స ని ని ద ప మ ॥
మ న సు ని । ల్పా - గ - లే - క ॥

- ని ద పా ద ప మా । ప ని సా స ॥
- ప్ర మ దా - - న । ని ట్టె పె ద్ద ॥

- రి గ మా రి మ గ గ । సా ని ద ప మ రి మ గ గ ॥ గ స
- ప - రు వు - న - । వ - - చ్చె ను - - - - ॥ - - ॥ఎడ॥

**అవతారిక ;**

ఇందలి నాయిక ఖండిత. ఈమె నాయకుడు తన సవతులతో చేసివచ్చిన పనులన్నీ చూచినట్లే చెప్పుచు ఆమె చిగురుమోవిపై చిందులాడిన పలుకులు వింటివికదా, ఆమె మ్రొక్కుల నందుకొన్నావుగదా, ఆమె కనుబొమల జంకెనలకు జడిసితివా! ఏమైననేమి, నీవు చేసి వచ్చిన పనులు అందరికిని తెలిసినవే, నన్నేలితివి, యింతే చాలునని దెప్పి పాడుచు చున్నది.

**రాగలక్షణం :**

మనోహరి ప్రాచీన రాగము. తాళ్ళపాక వారి రచనల తరువాత ఇందు త్యాగరాజ స్వామివారిది ఒకే ఒక్క కీర్తన కనబడు చున్నది. నిజమునకు అతి మనోహరమైన ఈ రాగము నందు వాగ్గేయకారులు రచనలు ఏల చేయక వదలినారో తెలియదు. ఇది యిప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము.

స గ రి గ మ ప ద స । స ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములుగా త్యాగరాజస్వామివారి కీర్తనమునందు కనబడుచున్నది. లక్షణకారుల గ్రంథముల యందు ఈ రాగమును గురించిన చర్చయే లేదు.

**మనోహరి — త్రిపుట**

ఎఱగమి చేసుకొనే విదేమోయినే
మెఱిగిన పనులే యిన్నియును నోయీ ॥ పల్లవి ॥

చిగురుమోవి మీద జిప్పిలేటి మాటలు
వెగటు లేకాపె చేత వింటివా వోయి
మొగము చూచితేను మొక్కేటి మొక్కులు
అగడుగా గంటివా అదియును నోయి ॥ ఎఱగమి ॥

కందువతో నీకు జేసే కనుగొన సన్నలు
చెందనీ విప్పుడే చూచితివా వోయి
అందమై సెలవుల నానుకొన్న నవ్వులు
చిందినవే నీవు తెలిసితివా వోయీ ॥ ఎఱగమి ॥

పొలుపైన రతులలో బొమ్మల జంకెనలవి
కొలది మీరగ నియ్యకొంటివా వోయి
యెలమి శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
కలసి యాపె గుట్టులు కంటివా వోయీ ॥ ఎఱగవి ॥

శ్రృం : 19–173

ప. - - ప ప | పా పా || ప మ ప ద సా | ద ప మ రి గ రి ||
- - ఎ ఱ | గ మి || చే - - సు - | కొ - - - నే - ||

సా ధ | సా స గ రి గ || మా - | పా - - ||
వి - | దే మో - - - || యి - | - - - ||

మా ప ద | సా సా || స గ రి గ మా | గ రి రీ సా ||
నే మె ఱ | గి న || ప - ను - - | లే - - - ||

- - ప ద | సా ద ప || పా ద స ద ప మ రి | గ రి రీ స గ రి గ ||
- - యి - | న్ని యు - || నో - - - - - - - | - - - యి - - - ||

మా ప ప | పా పా ||
- ఎ ఱ | గ మి ||

చ. - - ప ప | పా పా || మ ప దా ప | ప ప మ రి గ రి ||
- - చి గు | రు మో || వి - - - | మీ - - - ద - ||

సా ధ | సా స గ రి గ || మా - | ప మ రి గ రి ||
- జి | ప్పి లే - - - || టి - | మా - - ట - ||

సా స గ | రి గ మ పా || పా ద ప మా | పా దా ||
లు వె గ | టు - - లే || కా - - - | పె చే ||

సా మ | పా ద స ద ప మ రి గా || గ రి రీ | సా - - ||
త విం | టి - - - - - వా - - || వో - - | యి - - ||

- - పా ద స | ద ప ప పా ద ప మా || ప ద ప | దా సా ||
- - మొ గ - | ము - - చూ - - - || చి - - | తే ను ||

సా స గ | రి గ మ రి గ రి రీ || సా గ రి సా - ద | సా సా ||
- మొ - | క్క - - - టి - - || మొ - - - - - | క్కు లు ||

- - ప ద | స గ రి గ స రి సా || సా - ద ద రి సా | ద ప పా ద ప మ ||
- - అ గ | డు - - - గా - - || గం - - - - - | టి - వా - - - ||

పా రి మ | ప ద సా ద ప || ప ప మా - రి | గ రి గ రి రీ ||
- ఆ ది | యు - - ను - || నో - - - - | యి - - - - ||

సా ప ప | పా పా ||
- ఎ ఱ | గ మి ||

**అవతారిక :**

ఇందలి నాయిక సిగ్గుల భరిణె. ఈమె తన నాయకుని యందు తనకు గల వలపులను చెలులతో "పదిమందితోను ఆతడు చేయు పనులకు సిగ్గగుచున్నదమ్మా! నే నూరకున్నను అతడు చెనకినన్ను కవ్వించి లాలించి యెడ బరచు కొనుచున్నాడు. ఇది చూచెడి వారికెట్లుం డును? నేను ఎదురాడరాదు ఆడినచో ఆతని మోము వాడి చిన్నబుచ్చుకొనును. ఏమి చేయవలె నమ్మా?" అని చెప్పుకొనుచున్నది.

**రాగ లక్షణం :**

సైంధవి ప్రాచీనరాగము. భాషాంగము. ని స రి గ మ ప ద ని - ని ద ప మ గ రి స ని ధ - అనునవి ఆరోహణావరోహణములు. ఇది యిప్పటి 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. 'పాదపమా' - 'పాదమా' అనునప్పుడు శుద్ధధైవతమును, 'పామా' అనునప్పుడు అంతరగాంధారచ్ఛాయ గల మధ్యమమును పలికించుట సంప్రదాయము. 'రి ని సా రి గ మా -' 'రీ గ మ రి గ సా' అనునవి తరచువచ్చు ప్రయోగములు. వెంకటమఖి సంప్రదాయమున సంపూర్ణముగా ఈ రాగమును చెప్పినప్పటికిని, క్షేత్రజ్ఞుని పదములలో మాత్రము మధ్యస్థాయి నిషాదమువరకు, మంద్రస్థాయి ధైవతము వరకు మాత్రమే సంచారములు కనబడుచున్నవి. నే స్వరపరచిన యీ శృంగారపదము కూడ అదే స్థాయిలలో చేయడమైనది. ఇది రక్తిరాగము.

సైంధవి—రూపకం

మాను మన్నా మానడు మాటి మాటికి
పోనిమ్మని వూరకున్నా బోడవెక్కిగదవే ॥ పల్లవి ॥

ఆడరాదు తనకెదురంటే ననీ గాక
వాడుదేరిన మోమేల వచ్చె దనకు
వోడక యిందుకుదోడు వూరకుండనీడు నన్ను
యీాడుగాని మాట్ల దీసి యెచ్చరించీ గదవే ॥ మాను ॥

తలవంచకుండరాదు తన చేతిబాధ నేడు
చిలుకుగోళ్ళ నెత్తి సిగ్గు వడడు
నిలువబెట్టుచు తననిజమే నెరపవచ్చి
యెలమి నిందరు నవ్వేదెఱగడు గదవే ॥ మాను ॥

గుట్టు నేసుకుండనీడు కుమ్మరించి వలపులు
యెట్టివాడు యిందాకా నేడ నుండెనే
వొట్టుక (శ్రీ) వేంకటాద్రి నుండి వచ్చి నన్ను గూడె
పట్టిన చలముతోడ బంత మిచ్చి గదవే ॥ మాను ॥

శృం : 26—15

ప ‌ స ని స రీ గ ‖ మా ప మ గ రీ - ‖ ని స రి గ మా ప మ ‖
మా - ను ను న్నా ‖ మా - - న డు - ‖ మా - టి - మా - న్న ‖

గ రి గ రి సా ‖ స ప పా ప మ ‖ ప ద ని ని ద ద ప ‖
టి - - - కి ‖ పో - ని మ్మ ని ‖ వూ - ర కు - - - ‖

మ గ మా ప మ ‖ గ రి సా - - ‖
పొ డ వె క్కి - ‖ గ ద వే - - ‖

చ. రీ గ మా ప మ ‖ గ రి గ రి సా ‖ ని స రి గ మా ప మ ‖
ఆ డ రా దు - ‖ త న కె దు రు ‖ అం - - టీ న ని - ‖

గ రి గ రి సా ‖ రీ గ మా మ ‖ ప ద ప ద ని ద నీ ‖
గా - - - క ‖ వా డు దే రి ‖ న - మో - - - ము ‖

ద ని ద ప ద ప ‖ మ గ మా - - ‖ పా ప ప మా ‖
ఛ - ల వ - చ్చె ‖ త న కు - - ‖ వో డ క యిం ‖

ప ద ప ద ని ద సీ || ప ని ద మా మ || గ రి గ మా మ ||
దు కు తో - - - డు || వూ - ర కుం డ || సి - డు న న్న ||

సా స పా ప || ప ని ప మా మ ||
యీా డు గా ని || మా - ట దీ సి ||

రి గ మ మా ప మ గ రి || గ రి సా - - ||
యె - చ్చ రిం - - చీ - || గ ద వే - - ||

**అవతారిక :**

ఇందరి నాయిక స్వీయ, ముగ్ధ. ఈమె నాథుని విరహము నందుండియు ఆ విరహ బాధలను పండుగలుగా భావించి తన ప్రియుడగు శ్రీ వేంకటేశ్వరుని రాకకై ఎదురుచూచుచున్నదని ఆమె చెలి నాయకునితో చమత్కారముగా చెప్పుచున్నది. "ఆమె నిన్ను గురించిన కథలు వినుటయందు చెవుల పండుగ సేయుచున్నది. రాత్రియంతయు నీకై తలచి పరితపించుటలో జాగరముండి శివరాత్రి పండుగ జరుపుకొన్నది. దీపమువలె ప్రకాశించి దీపావళి పండుగ జరుపుకొన్నది. మేడపైనుండి నిన్నుచూచి మొదటిసారి మీ యిరువురి కలయికను ఊహించుకొని ఉగాది పండుగ చేసుకొన్నది. నీ పలుకులను, చేతలను తలచుకొని ఇట్లే పండుగలు జరుపుకొనుచున్న మా చెలి లక్ష్మీదేవి పండుగను కూడ జరుపుకొన్నది సుమా" అని చెప్పుచు అతనితో తమ చెలిని కరుణించమని వేడుకొనుచున్నారు.

సైంధవి—ఝంపె

పెను బండుగలు సేసి పిలిపించె నిన్నమాపె
పెనగీ జిత్తపు చింత పెనులంపటముల ॥ పల్లవి ॥

చెవుల బండుగ సేసె చెలి నీ సుద్దులు విని
నవకపు వేడుక నిన్నటి మాపె
తివిరి వేగు దాకా దీపావళి పండుగసేసె
జవకట్టి నిను బాసి జాగరాలను ॥ పెను ॥

కన్నులపండుగ సేసె కలికి మేడపైనుండి
నిన్ను దప్ప కిట్టె చూచి నిన్నమాపె
వున్నతి నొక నిమిష ముగాదిపండుగ సేసె
తన్నుదానె తనలోని తమకానను ॥ పెను ॥

నిచ్చ పండుగలు సేసె నీతోడి మాటలనె
నెచ్చెలి యల్లంత నుండి నిన్నమాపె
పచ్చిగా లక్ష్మీదేవి పండుగలు సేసె నిదె
యిచ్చకుడ శ్రీ వేంకటేశ నిన్నుగూడెను ॥ పెను ॥

రేకు : 17–184

ప. ని స రి గ మా ప మ | మ గ రీ గ రి స ||
పెను బం - - డు - | గ - లు సే - సి ||

ని స గ రి స | గ రి రి ని సా స ||
పి లి పిం - చె | ని - న్న - మా పె ||

స ప పా ప | ప ప మ గ మా మ ||
పెన గి ది | త్త - పు - చిం త ||

రి గ మా మ గ రీ స | గ రి రి ని సా ||
పె - ను లం - - ప | ట - ము - ల || ||పెను||

చ. - రి గ మా మ గ రీ | రి మ గ రి సా స ||
- చె వు ల పం - - | డు - గ - చే సి ||

- ని స రీ గ రి స | గ రి రి ని స సా ||
- చె లి నీ - - సు | ద్దు - లు - వి ని ||

- రి గ మా మా ప మ గ రి | గ రి రి స రి గా ||
- న వ క పు - - - - | వే - - - డు క ||

- రి గ మా పా - మ | పా పా - ||
- ని - న్న టి - - | మా పె - ||

- రి గ మా పా | ద ద ప ద ని ద ని ||
- తి వి రి వే | కు వ దా - - - కా ||

- ని ద పా ద ప మా | మ గ గ రి ప మ గ రి స ||
- ధీ - పా వ శి ఫం | డు - - - షే - - - సె ||

- రి గ మా పా ద ప | మ గ ప మ గ రి గ గ ||
- జ వ క ట్టి - - | ని - ను - బా - - సి ||

- రి గ మా మ గ రీ | గ రి సా - ||
- జా - గ రా - - | - ల ను - ||

||పెను||

**అవతారిక ;**

సర్వేశ్వరుడగు శ్రీ వేంకటేశ్వరుడు తలచిన వారికి కొంగుబంగారమగు దైవము. ఇంద్రాదులకు వైభవములును, ఆర్తులగు భక్తులకు కష్టములు దీర్చి కాపాడుటయును, తన యందు ప్రేమభావముతో నారాధించెడి వారికి ఆనందనిధియును ముగ్గురు వేల్పులకు మూలమును యీతడే! ఇతడు అలమేలుమంగకు మగడై వేంకటాద్రియందు వెలసి శ్రీ వేంకటేశ్వరుడై యున్నాడు. అని అయ్యవారు ఆ స్వామి వైభవములను కొనియాడుచున్నారు,

సైంధవి — ఆది

ఇతడొకడే సర్వేశ్వరుడు
సితకమలాక్షుడు శ్రీ వేంకటేశుడు ॥ పల్లవి ॥

పరమ యోగులకు భావ నిధానము
అరయ నింద్రాదుల కైశ్వర్యము
గరిమ గొల్లెతల కౌగిట సౌఖ్యము
సిరులొసగేటి యీ శ్రీ వేంకటేశుడు ॥ ఇత ॥

కలికి యశోదకు కన్నమానికము
తలచిన కరికిని తగు దిక్కు-
అల ద్రౌపదికిని యాపద్బంధుడు
చెలరేగిన యీ శ్రీ వేంకటేశుడు ॥ ఇత ॥

తగిలిన మునులకు తపము సత్ఫలము
ముగురు వేల్పులకు మూల మీతడే
ఒగి నలమేల్మంగ కొనరిన పతియై (యితడు)
జిగిమించిన యీ శ్రీ వేంకటేశుడు ॥ ఇత ॥

అ : 11—2

ప. ని స రి గ మా ప మ | గ రి గ రి | సా - - ||
ఇ త డొ క దే వ - | ర్వే - శ్వ రు | డు - - ||

స ప ప ప పా ప మ | ప ద నీ ద ప | మ గ రి స ||
సి త క మ లా క్షు డు | శ్రీ - - వెం క | టే - శు డు || ||ఇత||

చ. రి గ రి సా స గ రీ రి ని స | రి గ మ రి | రి మ గా రి రి ||
ప ర మ యో గు - - ల - కు | భా - వ ని | ధా - - న ము ||

స ప ప ప ప ప మా గ రి | ని స రి గ మా | గ రి రి స ||
అ ర య నిం ద్రా - - దు ల | కై - - - - | శ్వ - ర్య ము ||

ప ద ని ద పా ద ప మ రి | రి గ మ రి | రి మ గా రి రి ||
గ రి మ - గొ ల్లె - త ల | కొ - గి ట | సౌ - - ఖ్య ము ||

స ప ప ప ప ప మ | ప ద నీ ద ప | మ గ రి స ||
సి రు లొ స గే టి యా - | శ్రీ - - వెం క | టే - శు డు || ||ఇత||

**అవతారిక :**

విరహార్తయగు నాయికను ఊరడించుచు "ప్రియము కలిగితేను నీ ప్రియుడే వచ్చును. వలపులిచ్చితేను వాడిక్కడి కేలరాడు? మాటలు కలిపితేను మనసులు కలియును. శ్రీ వేంకటేశ్వరుడు నిన్నేలుటకు తానే వచ్చును. చింతింపకు" మని చెలికత్తె చెప్పుచున్నది.

**రాగ లక్షణం ;**

హిందోళం ప్రాచీన ప్రసిద్ధ రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు భైరవి జన్యముగా నున్నది. కాని కొందరు 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా కూడ పాడుచుందురు. 'ప్రాచీనమగు పాఠము ఇది' అని నిర్ణయించుటకు వీలుకాకున్నది. నిజమునకు దీనిని చతుశ్శ్రుతి ధైవతముతో పాడినచో ఒక సొంపు కనబడుచున్నది. ప్రాచీనులు బహుశః ఇట్లే పాడియుందురేమోనని తోచుచున్నది. 'హిందుస్తానీ సంగీతపు ప్రభావములు కర్ణాటక సంగీతమున ప్రసరించిన కాలము నుండియు ఈ రాగము మార్పుచెందినదా?' అను ప్రశ్నకు సమాధానము దొరకుటలేదు. తాళ్ళపాకవారి తరువాత దీనిని ఇటీవలి వాగ్గేయకారులు పాడియున్నారు. కాని మధ్యకాలపు రచయితల రచనలు ఇందు కానరాకుండుట వలన ఎట్టి నిర్ణయములును చేయుటకు వలను పడకున్నది. ఇందలి తాళ్ళపాక వారి రచనలు 22వ మేళ జన్యముగా పాడుకొనదగిన హిందోళ రాగమునందే స్వరపరుపబడినవి. స గ మ ద ని స - స ని ద మ గ స అనునవి ఆరోహణావరోహణములు. చతుశ్శ్రుతి ధైవతముతో ఈ హిందోళ రాగమును పాడెడు పద్ధతి క్షేత్రజ్ఞుల పదములందు కానవచ్చుచున్నది.

**హిందోళ—త్రిపుట**

చెలియరో నీ వేల చింతించేవే
వలెనంటే నీ విభుడు వచ్చీ దా నీడకే ॥ పల్లవి ॥

వలపు గలిగితేను వాడికలూ దానే వచ్చు
తలపు గలిగితేను తమి రేగును
పిలుపు గలిగితేను ప్రియములూ బెనగొను
చెలిమి గలిగితేను చేతలూ నీడేరును ॥ చెలియ ॥

మాటలు గలిగితేను మనసులూ సమ్మతించు
కూటమి గలిగితేను కోరిక నిండు
చోటుగలిగిన చోట సొలపులు నింపౌను
సూటియై రాక గలిగితే సులభమే భోగము ॥ చెలియ ॥

నసువు గలిగితేను నవ్వులు చందమౌను
చనవుగలిగితేను చవియౌ మోవి
యెనసీ (శ్రీ) వేంకటేశు డింతలోనే వచ్చి నిన్ను
తనివి గలిగితేను దక్కు నేర్పులెల్లనూ ॥ చెలియ ॥

శృం : 18 : 326

ప. - - మ మ | మా గా || స స ని ధ ని | సా సా ||
- - చె లి | య రో || నీ - - - - | వే ల ||

- - ధ ని | సా గ గ స || గ మ గ గా - | మా గ మ గ స ||
- - చిం - | తిం చే - - || వే - - - - | - - - - - ||

గా గ మ | దా ని ద మా || ద ని సా - ని | స స సా ||
వ లె | నం టే - - || నీ - - - - | వి భు డు ||

- - గ | సా ని స ని ద || ని ని ద మ | గ మ గ స గా ||
వ | చ్చి దా - - - || నీ - - - | డ - - - కే || ॥చెలియ॥

చ. మా గ మ | దా ని స ని ద || మా - | గ స గా ||
- వ ల | పు గ - లి - || గి - | తే - - ||

మా గ మ | గ గ సా || ని ధ నీ | సా గా ||
ను వా - | డి క లూ || తా - నే | వ - ||

మా గ మ | దా ని స ని ద || మా - | గ స గా ||
చ్చు త ల | పు గ - - ళి || గి - | తే - - ||

మా గ మ | గ గ సా || ని ధ నీ | సా గా ||
ను త - | మి - రే || గు - - | ను - ||

మా గ మ | దా ని స ని ద || ద ద మ | దా ద ని సా - ని ||
- - పి లు | పు గ - ళి - || గి - - | తే - - - - - ||

సా ని స | గ గ సా మ గ సా || ని స ని ద ని | నీ సా ||
ను ప్రి య | ము - - లూ - - || బె - న - - | గొ ను ||

సా స స | సా ని స ని ద || ద మా | గ గ మా ||
- - చె లి | మి క - లి - || గి - - | తే - ను ||

- - గ మ | ద ని స ని - - ద మ || గ మా గా - | గ స గా ||
- - చే త | త - - - లు - - - || సి - - - | డే - - ||

మా మ మ | మా గా ||
రు చె లి | య రో || ||చెలియ||

**అవతారిక :**

"నీకు నాయందు గల మోహమును యెట్లు చెప్పుకొందును? నీవు ఎదుట నుండగానే వేవేల మాటలాడెదను. వలపు చేతలను నీ యెదుటనే చేసి ఆనందించెదను. నాకు నీ చనవులు నేర్పులు కావలెను కాని వేరెద్దియు వలదు." అని నాయిక నాయకునితో విన్న వించుకొనుచున్నది.

**రాగ లక్షణం :**

రీతిగౌళ ఒకప్పుడు 20వ మేళకర్తగా భావించబడుచుండెడిది కాని, వక్ర సంపూర్ణమగు దీనిని తరువాతి కాలమున మేళముగ భావింపక 22వ మేళమగు ఖరహరప్రియ జన్యములలో నొకటిగా వాడుకయందు ప్రచారమునకు తెచ్చియున్నారు. ఘనరాగ ఉత్తర పంచకము నందు గల రాగములలో నిదియొకటి. ఇందు సకృత్తుగా శుద్ధధైవతమున పలికించెడి సంప్రదాయ మున్నదట గాని ఇప్పుడు వాడుకయందు ఇది కనబడదు. తాళ్ళపాక వారే యీ రాగము నందు శృంగార పదములు చెప్పియున్నారు. తరువాతి పదకర్తలెవ్వరును యీ రాగమునందు పదములు చెప్పినట్లులేదు స గ రి గ మ ని ని స | స ని ద ప ద ని ద మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు.

**రీతిగౌళ — రూపకం**

దగ్గర నీ వున్నప్పుడే తలచ గాని
సిగ్గున నేకతవేళ జింతింతురా ॥ పల్లవి ॥

నీవే కావలె గాక నిచ్చ నే నాడే మాటకు
వే వేలైనా నోరుతురా వే రొకరు
తావున నే నొకవేళ తలపోసి చూచుకొని
కావిరి నా లోలోనే కరగుదురా ॥ దగ్గర ॥

నీ మనసే కావలె నే సొలసే సొలపుల
వోమి విరుగకుండునా వుండ బోటిది
ఆ మేలు నాకు నాకె అప్పటప్పటి కెంచుక
వేమరు దల పూచుక వెర గౌదురా ॥ దగ్గర ॥

నీ నేరుపే కావలె నే బిగిసేయందు కెల్లా
పూనుక మరొకళ్లైతే పొందుగూడునా
నే నిట్టె (శ్రీ) వేంకటేశ నీ నా రతి నేడు చూచి
నానగా గలకాలము నవ్వుకొందురా ॥ దగ్గర ॥

రేకు : 18-44

ప. - స గ రి సా | సా రి స ని ధ నీ స ని ||
- ద గ్గ ర నీ | వు - - - - - న్న ప్పు డె ||

స గ రి గా మ | - ప ని ద మా ||
త ల చ గా ని | - సి గ్గు న నే ||

గ రి గా మా | గ మ పా ప మ గ రి స ని ||
క త వే ళ | చిం - - తిం - - - తు ర || ॥దగ్గర॥

చ. - మ మా గ రి | ని స గ గ మా ||
- నీ వే కా - | వ లె గా - క ||

మా ప మ గ రి గ మ | - ప ని ద మా ||
- - - - - ని చ్చ | - నే నా - డే ||

గ రి గ రి సా | - స సా ని ధ ||
మా - - ట కు | - వే వే లై - ||

నీ స స గ రి | గ మ పా ప మ గ రి గ స ||
నా నో రు తు రా | వే - - రొ - క - రు - ||

- గ మ నీ ద మ | గ మ నీ ని ప ||
- తా - వు న - | నే - నొ క - ||

నీ సా - - | - ని సం గం రిం సా ||
వే ళ - - | - త ల పో - సి ||

ని ప ని ని సా | - సం సం సం ని ద ||
చూ - చు కొ ని | - కా వి రి నా - ||

ద ప ద ని ద మా | గ మ పా ప మ గ రి గ స ||
లో - - లో - నే | క - ర గు - దు - రా - || ||దగ్గర||

**అవతారిక :**

ఇందలి నాయిక చతుర, ప్రౌఢ, పరకీయ. ఈమె నాయకుని చేతలు తనకు సమ్మతమై తాను అట్టి పనులు చేయుటకు రాలేదనియు, నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునకు సేవలు చేయుటకు మాత్రమే వచ్చితిననియు, తన్ను నెపముచేతో తాకి ఆనందించి కలసిన నాయకుడు వెరపు నటించగా నీతో కలకాలము ఇట్లే యుండెదననియు 'వెఱవకుమయ్యా నీ చేతలకు ఎదురాడ నేరక ఇట్లుంటిగాని, నీ పొందులు శాశ్వతముగా సంపాదించుకొనగలుగు నంతటి గొప్పదాననా? ఇప్పటికి ఇంతేచాలు' నని మర్మగర్భితములగు మాటలతో స్వామికి చెప్పుచున్నది.

**రీతిగౌళ — త్రిపుట**

వెఱవకు వయ్యా నిన్ను వే సరించను
కలకు లాడగ నేను గబ్బిదాననా ॥ పల్లవి ॥

మోము చూడగా నీకు మొక్కితి నింతేకాని
కామించి యేపనులకు గాదు సుమ్మీ
చేముంచి యాపె నీ చేయి పట్టుకుండగాను
వేమరు నే నాసపడ వెట్టిదాననా ॥ వెఱవక ॥

గక్కన చేలు వేయగ కైదండ యిచ్చితి గాని
లెక్కసేయ నంత పనిలేదు సుమ్మీ
మక్కళించి మక్కళించి మాటలాపె యాడగాను
యిక్కడ నీసేవ సేయ నెడ్డ దాననా ॥ వెఱవకు ॥

బడలి రాగా నీకు పాదము లొత్తితి గాని
యెడసి నందుకు బంత మీయ జూమ్మీ
అడరి శ్రీ వేంకటేశ అట్టె నన్ను నేలితివి
కొడిమె లింకా నెంచ గొల్లదాననా ॥ వెఱవకు ॥

శృం : 18–18

ప. - - ప ప । పా ని ద ద మ ॥ మ గా రీ - । రి గ రి సా ॥
- - వె అ । వ - - కు - ॥ వ - య్యా - । ని - - న్ను ॥

- - ని । స గ గ మ ॥ మా - । ప మ గ రి గా ॥
- - వే । స - రిం - ॥ చ - । ను - - - - - ॥

మా ని ద । ద మ మ ని నీ ॥ స సా - ని । సా సా ॥
- క రు । కు - లా - - ॥ డ గ - - । నే ను ॥

- - ని ద । ప ద నీ ద మ ॥ మ మ గ రి । గా ప మ గ రి ॥ గ మ
- - గ - । బ్బ - - దా - ॥ న - - - । నా - - - - ॥ - - ॥వెఅవకు॥

చ. - - ప । పా మా ॥ గ రీ । రి గ రీ సా ॥
- - మో । ము చూ ॥ డ గా । నీ - - కు ॥

- - ని స । గ రి స సా ॥ ని ధా । నీ సా ॥
- - మొ - । క్కి - - తి ॥ నిం తే । గా నీ ॥

- - ని । సా స గ గా ॥ మా - । మ ప ప మ మ గ రీ ॥
- - కా । మించి - - ॥ యే - । ప - ను - ల - - ॥

గా స । గ రి గ మ ॥ పా - । - - - - ॥
కు గా । దు - సు - ॥ మ్మీ - । - - - - ॥

- - ని ద । మా మ గ రీ ॥ గా - । మా మా ॥
- - చే - । ముం చి - - ॥ యా - । పె నీ ॥

- - గ మ । నీ ద మ ॥ ని నీ । సా సా ॥
- - చె య్యి । ప ట్టు - ॥ కుం డ । గా ను ॥

- - ని స̇ । గ̇ రి̇ సా సా ॥ ని ద ప ద । ని స̇ ని ద మా ॥
- - వే - । మ - రు నే ॥ నా - - స । ప - - - డ ॥

- - గ మ । పా ని ద మా ॥ మ మ గ రి । గా ప మ గ రి ॥
- - వె - । జ్రీ - - దా ॥ న - - - । నా - - - - ॥ ॥వెలవకు॥

**అవతారిక :**

ఇందు నాయిక తన నాయకుని చెంత నుండి నప్పుడు అతనిని "నీవు యెవతెనో చెంత నిడుకొని లాలించుచున్నప్పుడు చూచితిని ఎవ్వరయ్యా ఆమె? నీపై ప్రేమ జల్లును, నీతో చనవులు నెరపుచున్నది. నీ సరస కూర్చుండి విడెమిచ్చి మక్కువలు చూపుచున్నది. ఆమెను నీ వంటితివా లేదా?" అని అడుగుచున్నది.

**రాగ లక్షణం :**

మాళవశ్రీ ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము ప్రాచీనరాగము. ఇందు ముద్దుస్వామి దీక్షితులవారు, త్యాగరాజస్వామివారు చేసిన రచనలు ఒకటి రెండు కానవచ్చుచున్నవి. దీక్షితులవారి రచనయందు గల రాగస్వరూపము నిశ్చితమై, మనోజ్ఞముగా కనబడుచున్నది. దీనిని ఆధారముగా నుంచుకొని తాళ్ళపాకవారి రచనల నూహించుటకు ప్రయత్నము జరిగినది. ఇంత మనోజ్ఞమగు రాగమునందు ఇతరులెవ్వరును రచనలేల చెప్పలేదు ? లేక చెప్పినను లభింపకుండుట ఆశ్చర్యమే. స గ గ మ ప ని ని స । ని ని ద ప మ ప ని ద మ మ గ స అనునవి ఆరోహణావరోహణములు. అయినను ఈ రాగమును మధ్యస్థాయి గాంధారము, తారస్థాయి పంచమము వరకు పాడుట పద్ధతియని తోచు చున్నది. అనగా దీనిని కురంజి, పున్నాగవరాళి మొదలగు రాగములవలె మధ్యమ శ్రుతియందు పాడుకొనవలసి యుండును.

**మాళవ శ్రీ—ఆది**

కంటిమి కొత్తలు గొన్ని కన్నుల పండుగ గాను
అంటితివో లేదో నాతో నానతీవయ్యా ॥ పల్లవి ॥

చనవరి మాటలు సారెకు నీతో నాడి
చెనకీ నెవ్వతో కాని చెలి నిన్ను
తనివోని యాసలతో తగులు విరితనాన
పెనగులాడుతా నీపై ప్రేమము చల్లీని ॥ కంటిమి ॥

సందడి దా నేమానో సరసనే కూచుండి
అంది విడే మియ్యవచ్చీ నప్పటి నీకు
మందె మేళాలు సేసుక మలసి సొలసి నవ్వి
సందు సుడి ధనమోపి చౌలు చూపీని ॥ కంటిమి ॥

పచ్చిదేర నాడా నీడా పంచల బొలసుకొంటా
యెచ్చరిక తేలసేసీ నేమీ యూపె
యిచ్చట శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేడు
నచ్చుకొట్టుతా గొంత నవ్వగ లాచీని ॥ కంటిమి ॥

శ్రృం : 24-4

ప - మ మా మ గ గ స । స ని ని ధ । నీ సా ॥
- కం టి మి - కొ త్త । - - లు - । కొ న్ని ॥

- స స స ని ధ ధ ని పా । మ ప ని ద । నీ సా ॥
- క న్ను - - - ల - పం । డు - గ - । గా ను ॥

- స ని సా గా మా । పా మా । ప మ గ మా ॥
- అం - టి తి వో । తే దో । నా - - తో ॥

- గ మ పా మా గా । ప మ గ గ స । స ని ధ ని సా ॥
- నా - న తి వ । - - - య్యా - । - - - - - ॥ ॥కంటిమి॥

చ. - స స సా సా - ని దా - ని । సా - ని దా ని స । ని ని పా ॥
- చ న వ రి - - మా - - । - - - ట - - । లు - - ॥

- మ పా నీ ని ద । నీ సా - ని । సా - - ॥
- సా రె కు నీ - । తో నా - - । డి - - ॥

- ని ని సా గా మా । పా - మ గా । ప మ గా గ స ।
- చె న కీ నె వ్వ । తో - - - । కా - - ని - ॥

సా - ని ద ని పా నీ । సా - - । - - - - ॥
ఛె - - లి - ని - । న్ను - - । - - - - ॥

- ప ప పా ని ద ద మా । ప మ గ మా । పా - - ॥
- త ని వో ని - - యా । స - - ల । తో - - ॥

- మ ప నీ ని ద ని ప । నీ సా - ని । సా - - ॥
- త గు లు వి - రి - । త నా - - । న - - ॥

- ని ని సా గ̇ా మ̇ా । పా మ̇ా - గ̇ । మ̇ా - - ॥
- పె న గు లా డు । తా నీ - - । పై - - ॥

- గ̇ మ̇ పా మ̇ా గ̇ా । ప̇ మ̇ గ̇ా గ స । స̇ ని ద ని సా ॥
- ప్రే - మ చ - । ళ్లి - - - - । ని - - - - ॥ ॥కంటిమి॥

**అవతారిక :**

ఇందు నాయిక యగు అలమేలుమంగ దయాగుణమున నేర్పరి తనమున నాథుడగు శ్రీ వేంకటేశ్వరుని యందు ఆమెకు గల చనవు స్వాతంత్ర్యము, ప్రేమ మొదలగు విషయము లను కొనియాడుచు 'ఆడువారి కందరికి ఇటువంటి గుణములు నేర్పుటకు నీవే తగుదువు.' అని సఖులు అమ్మవారిని కొనియాడుచున్నారు.

**రాగ లక్షణం :**

ఫలమంజరి ప్రాచీన రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము.

స గ మ ద సఁ । సఁ ని ద ప మ గ మ రి స అనునవి ఆరోహణావరోహణములు. దీనికి దగ్గరగా కానడరాగము కలదు. ఇందుగల సంచారములు తెలుసుకొనుటకు త్యాగరాజ స్వామివారివి రెండు కీర్తనలు మాత్రమే వినబడుచున్నవి. ఒకప్పుడిదియు మంచి ప్రచారమున నున్న రాగమే కాని ఇందు ఇతర వాగ్గేయకారుల రచనలు దొరకుటలేదు. దీనిని పళవంజరము అనుటయు కలదు.

**పళవంజరము—త్రిపుట**

మేలుమేలు యిదే బుద్ధి మెలతల కెల్లాను
నీ లీల లన్నియు మాకు నేరుపగదే ॥ పల్లవి ॥

పతికి నిచ్చకమాడి భావము గరగించేవు
కతకారి వవుదువే కలికి
అతి వినయాలు చూపి అట్టె సేవలు సేసేవు
చతురతలెల్లా నేర్చి జాణ వైతివే ॥ మేలు ॥

సెలవి నవ్వులు నవ్వి చేతికి విడెమిచ్చేవు
వలపించ నోపుదువే వనిత
నిలువు గొలువు సేసి నెట్టన దమి రేచేవు
పలుకు బంతములకు బంతకత్తె వవుదువే ॥ మేలు ॥

యిచ్చట (శ్రీ) వేంకటేశు నెదపై నెలకొంటివి
మెచ్చులాడివే అలమేలుమంగా
అచ్చముగ మమ్మ నేలుమని యప్పణిచ్చితివి
కచ్చుపెట్టి నీవు దయగల దాన వవుదువే ॥ మేలు ॥

శ్రృం : 18-184

ప. - - ద స ని ద ప మా ॥ ప ప మ గ మ రీ సా ॥
- - మే లు - - - మే ॥ లు యి - దే - బు ట్టి ॥

- - ధ స గా మా ॥ ద స ని ద ప మ గ మా రి స ॥
- - మె ల త ల ॥ కె - - - - ల్లి - - - - ॥

గ మ ద సా గా ॥ మా మ గ మా రీ ॥
ను - నీ లీ ల ॥ ల న్ని - యు మా ॥

సా ద స ని ద ప మా ॥ ప గ మ ప గ మ రి స గా ॥ మా
కు నే రు - - - వ ॥ గ - - - - - దే - - ॥ - ॥ మేలు ॥

చ. - - గ మ దా ని ద ప మ ॥ ప మ గ మ రీ సా ॥
- - ప తి కి ని - - - ॥ చ్చ - క - మా డి ॥

- - ధ స గా మా ॥ మ మా ప మ గ మ రీ సా ॥
- - భా - వ ము ॥ గ ర - - - - గిం చే ॥

సా గ స గా మ గ మా ॥ ద స ని ద ప మా - గ మా ॥
పు క త కా రి - - ॥ వౌ - - - - దు - - వు ॥

- - ప మ గ మా రీ ॥ - - గ మ ద స స ని ద ప ॥
తే - క లి - - కి ॥ - - అ తి వి న యా - - - ॥

మ గ మా దా సా ॥ - - ద స గా మా ॥
లు - - చూ పి ॥ - - - అ ట్టే సే ॥

మా మ గ మా రీ సా ॥ - - మ ద స మ గ గ రి రి స ॥
వ లు - సే సే పు ॥ - - చ తు ర త - - - లె - ॥

స ని ద ప మా దా సా ॥ - - ద స ని ద ప మా ॥
- - - - ల్లా నే ర్చి ॥ - - జా ణ - - - వై ॥

ప మ గ మ రి స గా ॥
- - - - తి - వే ॥ ॥ మేలు ॥

**అవతారిక :**

ఇందు తన వంటి సతులను అనేకులను యేలుచు ఆనందించుచున్న దక్షిణ నాయకుని యందు మోహమును విడువలేక నాయిక తన నాయకుని చేతలను తలచుకొనుచు ఆతనిని 'యేల నీవిట్లు చేసితి'వని అడిగెడి వారెవ్వరమ్మా ? అని చెలిమికత్తెతో చెప్పుచున్నది.

**రాగ లక్షణం :**

శుద్ధదేశి ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. ఇందు త్యాగరాజస్వామి వారి కీర్తన ఒకటి మాత్రము కనబడుచున్నది.

స గ రి గ స రి గ మ ప మ ని ద ప ని స । స ని ద ప మ రి మ గ రి స । అను వక్ర సంపూర్ణముగ ఈ రాగము మా గురువులు చెప్పియున్నారు. రాగసంచారములు రచన యందు గమనించి గుర్తించుకొనవలసి యున్నది. ఇందు తాళ్ళపాకవారి రచనలు కనబడుచుండు టచే ఒకప్పుడు ప్రచారము నందుండి క్రమముగా లుప్తమైపోయిన రాగములలో నిదియు నొకటియై యుండును.

**శుద్ధదేశి— త్రిపుట**

ఇచ్చకు రాలను నేను యిన్నిటా దన పట్టుకు
వచ్చి వచ్చి తనతోను వాదించే వారెవ్వరే ॥ పల్లవి ॥

మొదల సిగ్గు విడిచి మోహించిన వారికి
యెదుట నెవ్వరున్నా నే మాయనే
పొదిగి యాపెకు దాను పూవులు ముడిచీ నిట్టే
వదలక వొద్దనేటి వారెవ్వరే ॥ఇచ్చ ॥

వెరవు తోడుత రతి వేడుకనున్న వారికి
యెరవును మొఅగును యేడదే మరి
అరుదుగ నాపెకు నాకు మడిచిచ్చీ దాను
వరుస నిందుకు నవ్వేవారెవ్వరే ॥ ఇచ్చ ॥

చింతలన్నియు విడిచి సేసవెట్టే వారికి
యింతులలో సౌగాములు యికనేడవే
చెంతనుండి తానే కూడె శ్రీ వేంకటేశుడు నన్ను
వంతువిందు కడిగేటి వారెవ్వరే ॥ ఇచ్చు ॥

రేం : 19–20

ప. సా స । రి గ మా ॥ ప మా । గ రి రి స ॥
ఇ చ్చు । కు - రా ॥ ల ను । నే - ను - ॥

స ని ధ ని । సా రి గ ॥ మా గ । రి గ రి రి స ॥
ఇ - - న్ని । ట చ ల ॥ ప ట్టి । కు - - - - ॥

సా ప । పా మా ॥ పా ని ద ద ప । మ రి గ రి ॥
వ చ్చి । వ చ్చి ॥ త న - - - । తో - ను - ॥

ధ ని సా । రి గ మా ॥ గ రి । సా - - ॥
వా - దిం । చే - వా ॥ రె వ్వ । రే - - ॥ ॥ ఇచ్చుకు ॥

చ. ప ప ప । పా పా ॥ మ మ రి । గ రి రి స ॥
మొ ద ల । సి గ్గు ॥ వి డి - । చి - - - ॥

ధ ని సా । గ రి సా ॥ స గ రి గ మా । పా - - ॥
మో - హిం । చి - న ॥ వా - - - రి । కి - - ॥

మ మా । ని ద ని ప ॥ ప ద మ । పా పా ॥
యె దు । ట - నె వ్వ ॥ రు - - । నా్న - ॥

ప ని ద ని । సా సా ॥ ని ని స । రి గ మా ॥
నే - మా - । య నే ॥ పొ ది గి । యా - పె ॥

గ రీ ౹ సా సా ॥ సా స ౹ గ ꠰రి రి స ని ద ॥
కు - ౹ తా ను ॥ పూ పు ౹ లు - - - ము డి ॥

ప ని ద ని ౹ సా సా ॥ ప ని ద ౹ నీ సా ॥
చీ - - - ౹ ని ట్టే ॥ వ ద ల ౹ క వో ॥

గ రి రి స స ని ౹ ని ద ద ప మా ॥ రి గ మా గ ౹ రీ గ రి రి స ॥
ద్ద - నే - టి - ౹ వా - - - - ॥ రె - - వ్వ ౹ రే - - - - ॥ ॥ఇచ్చకు॥

**అవతారిక :**

ఇందు నాయికా నాయకులు ఏకాంతపు చేతలను, పలుకులను వర్ణించుచు 'నీవేల కోపించుకొనెదవయ్యా, మీ చేతలు చెలులే చూచి చెప్పవలెనా? ఏకాంతమునందు నీతో ఆపె చెప్పిన సరసోక్తులు చిలుకలు విని వల్లె వేయుచున్నవి. మీరిరువురు మోవి యానుకొనుటలు చూచి పావురములు పట్టుదలతో అభ్యాసము చేయుచున్నవి మీ కూటముల యందు అలివేలు మంగ ఆనందముతో పాడిన పాటలు కోవెలలు పాడుకొనుచు పరవశించుచున్నవి. చిలుకలు, పావురములు, కోవెలలు నేర్చిన విద్యలు ప్రదర్శించుచుండగా యెవరైనను చూడవచ్చును, వినవచ్చును గదా. నీ చెలులందరును అట్లు చేసినచో నీ కేలనయ్యా అలుక?' అని చెలిమి కత్తెలు నాయకుని మందలించుచున్నారు.

**రాగ లక్షణం :**

దేశి ఉత్తర భారతీయ సంగీతమునందు ఇప్పటికిని వాడుకయందు కలదు. ఇది దక్షిణ భారతీయ సంగీతమునందు లుప్తమైపోయినట్లు కనబడుచున్నది. హిందూస్తానీ పద్ధతి యందు దేశి, దేష్ అను రెండు రాగములు విభిన్న ప్రకృతులతో నేటికిని వాడుకయందున్నవి. ఇందు దేశి అనునది 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా చెప్పుకొనవలసియున్నది.

స రి మ ప ని మ ప స । స ని స మ ప గా రి స । అనునవి ఆరోహణావరోహణ ములు. ఇందు స్వరములను జారుప్తో స్వాభావికములైన స్థానములయందే పలికించుచు పాడినచో రాగస్వరూపము స్పష్టమగును. గమకములు కర్నాటక సంగీత పద్ధతియందువలె ప్రయోగించి నచో రాగస్వరూపము ఏర్పడదు. ఇందు ఆరోహణావరోహణములు నామమాత్రమే గాని రాగ సందర్భములయందు స్వరముల కూర్పులు గమనించి పాడుకొనవలసి యుండును. ఇట్టి రాగములు కర్నాటక సంగీతమునందు అఠాణా, ఆహిరి వంటివి ప్రాచీన స్వరూపములతో మనకు కనబడుచునే యున్నవి.

**దేశి — ఝంపె**

ఊరకే దూరేవుగాక వొద్దనున్న వారిని
సారె సారె నీ వేల జంకించేవయ్యా ॥ పల్లవి ॥

మరగించి మరగును (న) మాటలాకె యాడగాను
గరిమ బంజరాల చిలుకలు నేర్చెను
సారిది నీ కామినులు సుద్దులెల్లాను వినిరి
ఇరవై నీ చెలికత్తె లేమిసేయరయ్య ॥ ఊరకే ॥

మోవితేనె చెలియ నీ మోవికి నందియ్యగాను
పావురాలు నేరుచుక వచ్చి సేసెను
యీవ లావలానున్న ఇంతులెల్లా దెరిసిరి
వావిరి నూడిగముల వారేల చెప్పేరయ్యా ॥ ఊరకే ॥

అలమేలు మంగ నీపై నటు పాటలు వాడగా
యెలమి గోవిల నేర్చె నీ పాటలు
కలసిన మీకూటమి కాంతలెల్లా నెరిగిరి
మెలగి శ్రీ వేంకటేశ మేమేమి సేతుమయ్యా ॥ ఊరకే ॥

శృం : 24–319

ప. - మ ప సా ॥ స రి ని స ప ॥ ద మ పా - । - ప ద మ ప ॥
- ఊ ర కే ॥ దూ - రే - వు ॥ గా - నీ ని । - వ ద్ద ను - ॥

గా రి మ । పా - - - ॥ - స రి పా ప । ప ద మ ప ప ॥
న్న వా రి । నీ - - - ॥ - సా రె సా రె । నీ - వే - ల ॥

గ గ రి రి । సా - - - ॥
జం కిం చే వ । య్యా - - - ॥ ॥ ఊరకే ॥

చ. - రి మ పా ప । ప ని మ పా ॥ ప ద మ ప ప । గ గ రి స ॥
- మ ర గిం చి । మ గు రు న ॥ మా ట లా - కె । యా డ గా ను ॥

- స స రి ని స । ప ధ మ పా ॥ - స స రి పా । గా గ రి ॥
- గ రి మ బం - । జ రా - ల ॥ - చి లు క లు । నే ర్చె ను ॥

- ప ప ద మ ప । సా ఠ ని స ॥ - ని స ఠ ప । గా ఠ ఠ స ॥
- సొ రి ది నీ - । కా మి ను లు ॥ - సు ద్దు లె - । ల్లా వి ని రి ॥

- మ ప సా స । స ఠ ని స స ॥ ప ద మ పా । గా రీ స ॥
- ఇ ర వై నీ । చె లి క - త్తె ॥ లే - మి సే । య ర య్యా ॥ ॥ఊరకే॥

**అవతారిక :**

ఇందు అలమేలు మంగ విభుడు ఆమెతో బువ్వాలాడుచున్నాడని అయ్యవారు ద్రష్ట గనుక దర్శించి ఆనందముతో లక్ష్మీనారాయణుల అన్యోన్యతలను, ఆనంద పారవశ్యములను, అప్పటి వారి చేతలను చెలుల వాక్కులుగా గేయరూపమున వర్ణించుచున్నారు. బువ్వంబంతి పాటలని తెలుగువారి యిండ్లలో ఈనాటికిని వివాహముల యందు వధూవరులను ఒకే కంచమున భుజియింపచేయుచు పాడుకొనుట కలదు. ఈ పాటలు సాధారణముగా మధ్యమావతి రాగము నందుండుటయు పెద్దలైనవారికి తెలిసి యుండవచ్చును.

**రాగ లక్షణం :**

మధ్యమావతి ప్రాచీన రక్తిరాగములలో నొకటి. దీనిని భాషాంగమని కొందరు లక్షణకారులు చెప్పుకొన్నారు. కాని భాషాంగ లక్షణము లిప్పుడీ రాగమున కానవచ్చుటలేదు. ఇది 22వ మేళ జన్యముగా కనబడుచున్నది. స రి మ ప ని స । స ని ప మ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచనలనేకములు గలవు. సుమారు మూడునాలుగు వందల యేండ్ల క్రిందటివగు రచనల యందును, ఈ రాగస్వరూపము ఇప్పుడున్నట్లే కనబడుచున్నది. దీనిని మధుమాతి సారంగ్ అని ఉత్తరాది సంగీతము నందు చెప్పుదురు,

**మధ్యమావతి—రూపకం**

ఎటువంటి వేడుకలో ఇద్దరికి మీద మీద
ఘటన వెన్నెలపులుగము లాడేరదివో ॥ పల్లవి ॥

చిత్తజుని గన్నతల్లి సిగ్గుపడుఁ దానే పతి-
పొత్తున గూచుండె బెద్ద బువ్వానను
యిత్తల నాయకుడును యెడమిచ్చి తొడదొడ-
నొత్తుక కూచుండి మేను లొరసీ నదివో ॥ ఎటు ॥

శిరసువంచుకొని చిమ్మ జూపుతో నింతి
పురుషుడిచ్చే కడి పుచ్చుకొనీ
సరసములాడుకొంటా చవిచెప్పుతా నతడు
సరిగజ్జాయపు మోవి సారె నిచ్చీ నది వో ॥ ఎటు ॥

కప్పిన కుచగిరులు కానరాగా మూసుకొంటా
నప్పటి దవ్వుల కూర లందీ జెలి
అప్పుడె శ్రీ వేంకటేశు డాయాలకే చేచాచె
దెప్పరపు గందువల దేలించెనదివో || ఎటు ||

శృం : 26-21

ప. రి మ | పా ని ప ప మ || మా ప మ | రి రి సా ||
ఎ టు | పం - - టి - || వే - - | దు క లో ||

ని స | రీ మ రి రి స || స ని పా | నీ సా ||
యి - | ద్ద రి - కి - || మీ - ద | మీ ద ||

ని స | రీ రి స || రీ ప మ | రి రి స స ||
ఘ ట | న వె - || న్నె ల - | పు లు గ మ ||

రి మ | ప ని ప మ ప ని || సా - ని | ప ని ప మ రి మ రి స ||
లా - | దే - - - ర ది || గో - - | - - - - - - - - || ||ఎటు||

చ. ప ప | ప ని స ని పా || మ మ | ప ని ప మ రీ ||
చి త్త | జు - - - ని || గ న్న | త - - - ల్లి ||

ని స | రి స రీ || ప మ రీ | రి స సా ||
సి గ్గు | వ - దు || తా - నె | ప - తి ||

ని స | ని ధ ని స || రి ప | రీ - - ||
పొ త్తు | న - గూ - || చుం - | డే - - ||

ని స | రి స రి మ || ప మ | పా - - ||
బె ద్ద | బు వ్వ - - || - న | ను - - ||

మ ప | ని ప నీ || స స | రి స రీ ||
యి త్త | ల - నా || య కు | డు - ను ||

ని స | రి మ ప మ రీ || రి స ని ప | నీ సా ||
ఎ డ | మి - - - చ్చి || తొ - డ - | తో డ ||

ప రి | సా రి మ రి స || రి స ని ప | ని సా స ||
నొ త్తు | క - - కూ - || ర్చం - - - | డె మే ను ||

ప ని స ని | ప మ ప ని || సా - ని | ప ని ప మ రి మ రి స ||
లొ - ర - | సి - న ది || వో - - | - - - - - రి - - || ||ఎటు||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక స్వీయ, దివ్య, విరహోత్కంఠిత. నాయకుడగు శ్రీనివాసుని యందు పద్మావతీ దేవికి గల అనురాగమును వర్ణించుచు ఈమె పరమ యోగివలె ఏకాగ్ర చిత్తయై స్వామిని ధ్యానించు చున్నట్లున్నది. ఈమెకు మోహాపేక్షలుగాని, ఇతర చింతలుగాని యున్నట్లులేవు. నిశ్చలమనస్కురాలై స్వామిని ధ్యానించుటయందు పరవశతను పొంది పరతత్వ భావముతో పరమయోగినివలె నున్నది. 'ఆహా! ఇదిగాక సౌభాగ్యము, ఇదిగాక తపము యిక నొకటి కలదా ఏమి వైభవము' అని అయ్యవారు కొనియాడుచున్నారు. జీవాత్మలు పరమాత్మునికై చేయు ఇట్టి తపమే మధుర భక్తియని ఆచార్యులు చెప్పియున్నారు.

**రాగ లక్షణం :**

ఈ ముఖారి రాగము అతి ప్రాచీనము. ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా చెప్పుకొనవచ్చును. ఆరోహణమున చతుశ్శృతి ధైవతమును, అవరోహణమున శుద్ధధైవతము వచ్చుట పరిపాటి. 'స ని ద మా' 'ప ని ద మా – ప ద మా' అను సందర్భములలో అవరోహణమేయైనను చతుశ్శృతి ధైవతమే పలుకును. వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన ముఖారియు, క్షేత్రజ్ఞుని పదములలోని ముఖారియు ఇంచుమించుగా ఒకటిగానేయున్నవి భాషాంగస్వరము శుద్ధధైవతమైనచో ఖరహరప్రియ జన్యముగను చెప్పుకొనుటకు అవకాశము కలుగుచున్నది. వెంకటమఖి సంప్రదాయమున ఈ రాగము నారీ రీతిగౌళ జన్యము. ఇటువంటి రాగములకు జనకరాగములు నిర్ణయించుటకు పాటింపదగిన ఒక నియమమున్నది. సకృత్తుగావచ్చి, భాషాంగ స్వరూపమును నిర్ణయించుటకు మాత్రము తోడ్పడు స్వరమును వదలి అన్యస్వరములను గమనించి జనకరాగమును నిర్ణయించవలెను. ఈ నియమము చెప్పుటకు సులభముగానే యున్నది. కాని నిర్ణయము చేయుటకు దిగినప్పుడు మాత్రము కష్టముగానున్నది. కారణము ముఖారి రాగము నందలి రెండు ధైవతములును, ప్రత్యేకములయిన ఒదుగులు, బరువులు మొదలగు వాటితో రాగస్వరూపమును నిర్ణయించునవి గాను, ఇది ఎక్కువగావచ్చును, ఇది తక్కువగావచ్చును అని చెప్పుటకు వీలులేకుండగను వుండుట వలన వెంకటమఖియు, ఆధునికులును కూడా సరిగానే చెప్పినారని అనక తప్పదు, కాని ఇంకొక్క సంప్రదాయమున్నది. ఇటువంటివే గాక ఔడవ, షాడవములైన కొన్ని రాగములకు జనక నిర్ణయము చేయునప్పుడు 72 మేళకర్తలలో ఒకటి నుండి ప్రారంభించి ముందుగా ఏ మేళకర్తకు యీ రాగము అన్వయించుటకు వీలుగలదో ఆ మేళకర్త జన్యమని చెప్పవచ్చునను మతము కూడ ఒకటి యున్నది. ఏదియెట్లున్నను ముఖారి చతుశ్శృతి ధైవతముతో ఎక్కువగా రాగ స్వరూపమును వ్యక్తము చేయునదిగా ఒప్పుచున్నది.

ముఖారి — ఝంపె

ఇది గాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యిది గాక వైభవం బిక నొకటి కలదా ॥ పల్లవి ॥

అతివ జన్మము సఫలమై పరమ యోగి వలె
నితర మోహాపేక్ష లిన్నియును విడిచె
సతి కోరికలు మహాశాంతమై యిదె చూడ
సతత విజ్ఞాన వాసన వోలె నుండె ॥ ఇది ॥

తరుణి హృదయము కృతార్థత బొంది విభుమీది
పరవశానంద సంపదకు నిరవాయ
సరసి జానన మనోజయమంది యింతలో
సరిలేక మనసు నిశ్చల భావమాయ ॥ ఇది ॥

(శ్రీ) వేంకటేశ్వరుని జింతించి పరతత్వ
భావంబు నిజము గాబట్టె జెలి యాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు దిరమాయ ॥ ఇది ॥

శృం : 12—17

ప. ప ద సా స | స ని దా ద ప ప || ప మ ప మ ప ద ప ||
యి ది గా క | సౌ - - భా - గ్య || మి - ది - గా - క ||

ప మ మ గ రి రి స || స ని ధ సా స | రీ మ ప మ గ రి ||
త - ప - ము మ రి || యి - ది గా క | వై భ - వ - ం ||

రి స రి మ ప | ప స ని ని ద ద మ ||
బి క నొ క టి | క ల - దా - - - || ॥ఇదిగాక॥

2. ప ద స రి గ రి ప మ | గ రి స రి స ని ద ప ||
యి ది గా - - - క - | సౌ - - - భా - - గ్య ||

మ ప ద ప స ని ద ప | ప ప మ గ రి రి స ||
మి - ది - గా - - క | త - ప - ము మ రి ||

3. ప ద స రి గ రి ప మ | గ రి స రి స ని ద ప ||
యి ది గా - - - క - | సౌ - - - భా - - గ్య ||

మ ప ద ప స ని ద ప మ గ | రి మా ప మ గ రి స ||
మి - ది - గా - - - క - | త ప - - ము మ రి ||

చ. రి మ ప ప ద ప | ప మ గ రి స || రి ప మ గ రి స | రి గ స స స స ||
అ తి వ జ - - | న్మ ము స ఫ ల || మై ప - ర - మ | యో - - గి వ లె ||

స ని ధ స రి | మా గ రి స || రి మ ప స ని | ని ద దా పా - ||
ని - త ర మో | హా పే - తు || ల న్ని యు ను - | వి - డ చీ - ||

ప ద స రి గ రి ప మ | గ రి స సా ||
స తి క్రో - - - రి - | క లు మ హా ||

స రి గ రి రి స స ని దా | ద ప ప ద మ మ ||
శాం - - - త - మై - - | యి దె చూ - - డ ||

రి మ ప ద ప | ప మ గ రి ||
స త త వి - | జ్ఞా - న వా ||

రి స రి మ | ప స ని ని ద ద మ || ప ద సా స | స ని దా ద ప ప ||
స న వో లె | నుం - - ఢే - - - || ఇ ది గా క | సౌ - - భా - గ్య ||

**అవతారిక :**

అనేక జన్మములనుండి చేయుచున్న పాపపుణ్యముల ఫలితములిప్పు డనుభవించు చున్నాను. ఇదియంతయు వేయినామముల వెన్నుని మాయయే అని తెలిసి యింకను పాపముల పొంతకేల పోవలెను. ఆతనిని మదిలో నుంచుకొని వాని నామము నాలుకపైనుంచుకొని హరిదాసుడనై ఒలుకులు కులుకులు గల చంచలమగు సుఖములనొల్లక నుండెదనని అయ్యవారు ఈ రచన యందు చెప్పియున్నారు

**ముఖారి — ఆది**

నగవులు నిజమని నమ్మేదా
వొగినడియాసలు వొద్దనవే ॥పల్లవి॥

తొల్లిటి కర్మము దొంతుల నుండగ
చెల్లబోయిక చేసేదా
యెల్ల లోకములు యేలేటి దేవుడ
వొల్ల నొల్లనిక నొద్దనవే ॥ నగవులు ॥

పోయిన జన్మము పొరుగులనుండగ
చీయనక యిందు జెలగేదా
వేయినామముల వెన్నుడమాయలు
ఓ యయ్య యింక నొద్దనవే ॥ నగవులు ॥

నలి నీ నామము నాలికనుండగ
తలకొని యితరము దడవేదా
బలు శ్రీ వేంకటపతి నిన్నుగొలిచి
ఫొలుకు జంచలము లొద్దనవే ॥ నగవులు ॥

అ : 11–58

ప.  రి మ ప ప  ప ప ద ప | ప మ ప మ | గ రి  గ స ||
న గ వు లు ని జ మ ని | న - మ్మే - | దా - వొ గి ||

స రి  గ  రి ప మ గ రి | రి స సా | - - స  స ||
అ డి యా - స లు ఒ - | ద్ద న వే | - - వొ గి ||

స రి  గ  రి | ప మ గ రి | రి స సా | - - - - ||
న డి యా - | స లు  ఒ - | ద్ద న వే | - - - - ||   ॥నగవులు॥

చ.  ప ప ద ప  ప మ గ  రి | రి స రి రి | ప మ గ రి రి స ||
న ళి నీ - నా - మ ము | నా - ళి క | నుం - - - డ గ ||

మ రి మ ప ప  ని ద మ | ప స ని ని ద ద | సా - - ||
త ల కొ ని యి త ర ము | ద డ - వే - - | దా - - ||

ప ని ద స రి  గ రి | రి స రి ప మ | గ రి రి స ||
బ లు శ్రీ - వేం క ట | ప తి ని ను - | గొ లి చి - ||

ప ద స  స ని ద ప  ప | ప మ గ రి | రి స సా ||
ఒ లు కు చం - చ ల ము | లో - ద్ద న | వే - - ||   ॥నగవులు॥

**అవతారిక :**

వనితల ముందు వదరుబోతై తిరుగుట, తన లోతుపాతు లెరిగిన వారికడ గొప్పలు చెప్పుకొనుట, వాదములకొరకై ఇతరుల మంచిని పాడుచేసి సంతసించెడి బుద్ధి కలుగుట. దేనినీ ఎవ్వరినీ నమ్మని అనుమానపు బ్రతుకు కలుగుట భగవంతుడగు శ్రీ వేంకటేశ్వరుని అర్చించి నమ్మి, కొలువ కుండుట, మొదలగువన్నియు రోతకలిగించెడి పాతకపు బ్రతుకులని చెప్పుచూ మనసులు కలియని స్త్రీ పురుషుల కలయిక వంటి ఇట్టి రోతలు కలుగ కుండునట్లు, భవసంహారుడైన వేంకటనాధుని వేడుకొనుటయే శరణ్యమని అయ్యవారు ఈ రచన యందు చెప్పుచున్నారు.

**ముఖారి — ఆది**

అనుమానపు బ్రదుకది రోతా తన
మన సెనయని కూటమి మఱి రోతా ॥ పల్లవి ॥

అపకీర్తుల బడి అడికె లోనై
అపవాది యాట అది రోతా
ఉపమ గెలిచెనని యొరు జెఱుచుటలు
విపరీతపు గుణ విధమొక రోతా ॥ అను ॥

తన గుట్టెల్లా నెఱిగిన వారి ముందట
తన యెమ్మెలు చెప్పుకొనుట రోతా
వనితల ముందట వదరుచు వదరుచు
కనుగవ గానని గర్వము రోతా ॥ అను ॥

భువి హరి గతియని బుద్ధి దలంచని
యవమానపు మనసది రోతా
భవసంహారుడై పరగు వెంకటపతి
నవిరళముగ గొలువని దదిరోతా ॥ అను ॥

శృం : 5–26

ప. ప ద ని ద స̇ స̇ స̇ స̇ | స̇ రి̇ గ̇ రి̇ | సా̇ ని ద ||
అను మా - న పు బ్ర తు | క ది రో - | తా త న ||

మ మ ప ప ద ప మా | గ రి స రి | మా పా ||
మ న సెన య ని కూ | ట మి మ రి | రో తా || ||అనుమానపు||

చ. ప ద ని ద ద ప ప ప | ప మ ప ప | ద ప ప ప ||
భు వి హా రి గ తి య ని | బు - ద్ధి త | ల - చ ని ||

మ మ ప ద ప మ ప మ | గ రి మా | పా - - ||
అ వ మా - న పు మ న | స ది రో | తా - - ||

ప ద ప ద స̇ స̇ స̇ స̇ | స̇ రి̇ రి̇ మ̇ | గ̇ రి̇ స̇ స̇ ||
భ వ సం - హా రు డై - | ప ర గు వేం | క ట ప తి ||

ప ద స̇ స̇ ని̇ ద ప ప | మ గ రి స | రి మ పా ||
అ వి ర ళ ము గ గొ లు | వ ని ద ది | రో - తా || ||అనుమానపు||

**అవతారిక :**

ఇందు నాయిక ముగ్ధ, స్వాధీనపతిక. ఈమె తన ముద్దరాలితనముతో నాయకుడగు (శ్రీ) వేంకటేశ్వరునకు కోపము తెప్పించునో యేమోనను భయమున ఆమె చెలి "చలముమాని నాధుని మనసు రంజింపజేసి ఆనందించవలెనుగాని, ఓ అలమేలు మంగా! నీవు కోపించుకొని యుండుట తగదు. వెనుకటి విషయములను ప్రస్తావించి నాధుని మనసు నొప్పింపరాదు. పీడెములందుకొని ఆతనిని అలరించి కూడుట నీకు మేలగునమ్మా! అని చెప్పుచున్నది.

**రాగ లక్షణం :**

వేళావళి ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇప్పటి వాడుక ప్రకారము 23వ మేళమగు గౌరీమనోహరి జన్యము. స రి గ మ ప ద స। స ని ద ప మ గ రి స। అనునవి ఆరోహణావరోహణములు. ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచనలు అచ్చటచ్చట కనబడు చున్నవి. దీక్షితులవారి సంప్రదాయమైన 23వ మేళకర్తకు గౌరి వేళావళి అనుటయు కలదు.

**వేళావళి—ఆది**

ఏమిటికి జలము యెందాక
నాముల తోడుత నగవే యికను ॥ పల్లవి ॥

బలుము లేమిటికి బచరించేవే
వలచిన దానవు వనితవు
సొలయుచు రమణుని సోదింతురటే
అలరి ఇచ్చకములాడుట గాక ॥ ఏమిటికి ॥

తగవులబెట్టగ తగునటవే యిక
మగనితోడ పలుమరు నిపుడు
అగడుసేతురా అతని నింతేసి
చిగురు మోవొసగి చెలగుట గాక ॥ ఏమిటికి ॥

కూడిన వేళను గుట్టు సేతురా
యీడనె (శ్రీ) వేంకటేశునెడ
ఆడకు వెంగెము లలమేల్మంగవు
పీడెములందుక వెలయుట గాక ॥ ఏమిటికి ॥

ప. - రి గా మ పా మ గ రి స | స ని ధా సా | రి గ మ గ గ రి రి స ||
- ప - మి టి కి చ ల ము | యెం - - దా | క - - - - - - - ||

- రి గా మ పా పా ద ప | స̇ ని ద ప మ రి | గ రి రి స ||
- నా - ము ల తో డు త | న - గ - వే - | యి క ను - || ॥ఏమిటికని॥

చ. - రి గ మ మ గ రి రి స | స ని ధా సా | రి గ రీ ||
- బ లు ము లే - మి టి కి | ప - చ రిం | చే - వే ||

- స గా రి గా మ రి గ రి | స రి రి గ మా | పా - - ||
- వ ల ద న దా - న వు | వ ని త - - | వు - - ||

- ద పా మ పా దా స ని ద ద | స̇ గ̇ రి̇ గ̇ మ రి̇ | గ̇ రి̇ సా̇ ||
- సౌ ల భ్యము చ ర మ - ణు ని | సో - - - దిం - | తు ర వే ||

- గ̇ రి̇ స̇ స̇ సా̇ స̇ ని ద ప | స̇ ని ద ప మ రి | గ రి రి స ||
- అ ల రి ఇ - చ్చ - క ము | లా - - - డు ట | గా - క - || ॥ఏమిటికి॥

**అవతారిక :**

ఇందు నాయకుని అన్యాయత్త చిత్తమును గుర్తించిన నాయిక "మనసెందున్నదో చెప్పుము ? నీవెవతెకై ఎదురు చూచుచుంటివో చెప్పుము ? ఇప్పుడే ఆమెను నీదరికి తెచ్చి పొందున గూర్తును" అని నాయకునకు చెప్పుచు, యాధాలాపముగ తన్ను గలసిన ఆతని మనసునకు ఆనందము కలిగింతునని చెప్పుచున్నది.

**రాగ లక్షణం :**

నట్ట నారాయణి ప్రాచీనరాగము ఇప్పటి వాడుక ప్రకారము 28వ మేళమగు హరికాంభోజి జన్యము. అయినను దీనికి వెంకటమఖి సంప్రదాయమున గల ఆరోహణావరోహణములు ఇతర గ్రంధకర్తలు చెప్పిన వాటికి వేరువేరుగా నుండి భిన్న ప్రకృతులు గల రెండు రాగ స్వరూపములు కనబడుచున్నవి. వెంకటమఖి సంప్రదాయమున స రి గ స రి మ ద స । స ద ప మ గ రి స అనియు, ఇతరుల సంప్రదాయమున స రి గ మ ద ని ద స । స ని ద ప మ గ మ రి స అనియు ఉండుట వలన, ఇందు రెండవ సంప్రదాయమునే స్వీకరించి స్వరపరచడమైనది. మొదటి రాగస్వరూపము చాలవరకు సామ మొదలగు కొన్ని రాగముల ఛాయ లెక్కువగా నుండి యీ రాగము యొక్క ప్రత్యేకత స్పష్టముగా నేర్పడదను భావమున విడువబడినది.

**నట్టనారాయణి—రూపకం**

కల్లగాదు నీవు మాకు గలిగితే జాలు
తొల్లిటి ఇంతినే యింకా దోడుక వచ్చేను ॥ పల్లవి ॥

తగిలి నీ వెదుటను తలవంచకుండగాను
నగితేను మొగమెత్తి నన్ను జూచేవు
మగువ నెవ్వతె నీవు మనసున దలచేవో
బెగడ కానతీవయ్యా పిలిచి తెచ్చేను ॥ కల్ల ॥

యెక్కడికో నీ విప్పుడెదురులు చూడగాను
మొక్కితే వేడుకొని నా చెక్కు నొక్కేవు
అక్కడ నెవ్వతె మీది ఆస నీకు నున్నదో
తక్క కానతీవయ్యా దండకు దెచ్చేను ॥ కల్ల ॥

యెందుకో నీపాయము మీదెత్తుకొని వుండగాను
అంది నిన్నుగూడితే నన్నాదరించేవు
ముందు (శ్రీ) వేంకటేశ నీ మోహామెందు నుండునో
యిందే అనటీవయ్యా యింటికి దెచ్చేను ॥ కల్ల ॥

శృం : 19–165

ప. - మ ద ని ద స ॥ స ద ని ప ప ప ప మ గ మ ॥
- క ల్ల గా - దు ॥ నీ - - - వు మా - - - కు ॥

- గ మా రి సా స రి ॥ స ని ని ధ సా - - ॥
- గ లి గి తే ను - ॥ చా - - - లు - - ॥

- స రి గ మ ప ప మ ॥ ని ద ని ద సా ॥
- తొ - ల్లి టి ఇం - - ॥ తి నే ఇం - కా ॥

ని ద ప మ గ మ రి గ మ పా ॥ గ మ రీ సా - - ॥
తో - - - డు గా - - వ - - ॥ చ్చే - - ను - - ॥ ॥కల్ల॥

చ. - ప ప పా మ గ మ రి ॥ గ మ పా - మ పా ॥
- త గి లి నీ - - - ॥ వె దు ట - - ను ॥

- గ మ ద ని ద స ॥ - స ని దా పా ॥
- త ల వం - చు కుం ॥ - డ - గా ను ॥

- ని ద పా - మ గ మ ॥ స రి గ గ మ రి రి స ॥
- న గి తే - - ౦ ను ॥ మొ - గ - - మె - త్తి ॥

స ని ధ స రి గ మ ప గ మ ॥ రి రి సా - - ॥
న - - న్ను జూ - - - చే - ॥ - - వు - - ॥

- ప ప వ ప మ గ మ || రి గ మా పా ||
- మ గు వ నె - వ్వ తె || నీ - - వు ||

- గ మ ద సం ని ని ద సం || ద స సం రిం మ గ రీ ||
- మ న సు న - - - - || ద ల చే - - - వో ||

- సం రిం గ మ రీ సా || సా రిం సం ని ద సా సా ||
- చె గ డ - కా న || తీ - - - - వ య్యా ||

గ మ ద ని దా సం ని ని ద ప మ || ని ద ప మ గ మ రి రి స ||
పి - లి - చి తె - - - - - || చ్చే - - - - - ను - - || ||కల్ల||

**అవతారిక :**

చెలికత్తెలు నాయకుని మందలించుచు, చనవులిచ్చి, విడనాడుటయు తగునా నీ కిష్టములేనిచో మొదటనే వలదనరాదా, నీ చేతలు దైవమైనను మెచ్చవలదా, ఇట్లు చేసినచో నిన్నెవరు నమ్మెదురు అని యనుచున్నారు.

**నారాయణి—త్రిపుట**

ఎట్టి వేగిరకాడవు యేమయ్యా నీవు
మిట్టిపడి దయ్యమైనా మెచ్చవద్దా నిన్నును ॥ పల్లవి ॥

చలమరివాడవు చనవేల యిచ్చితివి
వలవగనాడే నీవు వద్దనరాదా
యెలయించి పూరివారి నింతసేయ వ్రతమా
నలువంక నింకా నిన్ను నమ్మవద్దా చెలులు ॥ ఎట్టి ॥

కడు బంతగాడవు కదిసేల నవ్వితివి
తడవకుమని దయదలచరాదా
పడచుల దెచ్చియింత పచ్చిసేయ దగవా
తొడిబడి నిల్లైతే దోసమైనా ముట్టదా ॥ ఎట్టి ॥

బిగిసేటి వాడవు ప్రియము చెప్పగనేల
పగటున నాకె నోడ బరచరాదా
నిగిడి శ్రీ వేంకటేశ నీవే యీపె నేలితివి
మొగచాటు వలెనా నీ మోహామునకు గడమా ॥ ఎట్టి ॥

శ్రృం : 19—479

ప - - రి | మా పా || ద సా | ని ద ప మ రీ ||
- - ఎ | ట్టి వే || గి ర | కా - - - డ ||

సా రి మ | రీ సా || రి స ని ధ సా | రి మ ప ద ని ద ప మ ||
వు యే - | మ య్యా || - - నీ - - | వు - - - - - - - ||

రి స రి మ | పా ద స || ద స రి మ | రి స ని ద ||
- - మి - | ట్టి ప డి || ద - య్య - | మై - నా - ||

పా ప ద | సా రి స ని ద || ప మ ప ద ని ద | ప ద ప మ రీ ||
- మె - | చ్చ వ - - - || ద్గా - - - - - | ని - న్ను - ను || ॥ఎట్టి॥

చ. - - రి రి | మా మా || రి మ రి స ని ధ | సా సా ||
- - చ ల | పు రి || వా - - - - - - | డ వు ||

- - రి మ | పా పా || ని ద ప మ రి స | రి మ పా ||
- - చ న | వే ల || యి - - చ్చి - - | తి - వి ||

- - రి స | ని ధ ఫ ధ సా || రీ - మా - | ప మ రి స రీ ||
- - వ ల | వ - - - గ || నా - డే - | నీ - - - వు ||

- - రి మ | ప ద సా ని ద పా || ని ద ప మ రి స | రి మ పా ||
- - వ - | ద్ద - - న - - || రా - - - - - - | - - దా ||

- - ప ద | సా సా || రీ - మా - | రీ సా ||
- - యె ల | యిం చి || పూ - రి - | వా రి ||

సా ప ద | ṡ ṙ మా ṙ ṡ || ద సా | ని ద పా ||
నిం - - | త - - సే - || య - | వ్ర త మా ||

- - ప ద | సా సా || ని ద ప ద | పా పా ||
- - న లు | వం క || నిం - కా - | ని న్ను ||

పా రి మ | ప ద సా ని ద పా || ని ద ప మ ప మ | రి రి సా ||
- న - | మ్మ - - వ - - || ద్గా - - - - - | చె లు లు || ॥ఎట్టి॥

**అవతారిక :**

ఇందు శ్రీ వేంకటేశ్వరుని మహిమాతిశయములను వర్ణింపుచు, ఆతడు ఎన్నియో వాహనములపై సవారి చేసి ఎందరెందరినో సంరక్షించి వేంకటాద్రిపై భక్తులను రక్షించుటకు వెలసి, పల్లకినెక్కి ఇందిరను పెండ్లాడి ఊరేగుచున్నాడని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణం :**

మాళవి ప్రసిద్ధములగు ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 28వ మేళమగు హరికాంభోజి జన్యము. ఇందు త్యాగరాజస్వామివారి రచన యొకట్టి తప్ప ప్రాచీనుల రచనలు కానవచ్చుట లేదు, శృంగార పదములు అసలున్నటు తెలియవచ్చుట లేదు.

ఆరోహణ : స రి గ మ ప మ ద ని స

అవరోహణ : స ని ద ని ప మ గ మ రి స

మాళవి—రూపకం

ఎట్టు నేరిచితివయ్యా యిన్ని వాహనములెక్క
గట్టిగా నిందుకే హరి మెచ్చే మయ్యా ॥ పల్లవి ॥

గరుడుని మీద నెక్కి గమనించితివి నాడు
అరుదైన పారిజాత హరణానకు
గరిమతో రథమెక్కి కదలితి వల్లనాడు
సొరిది బ్రాహ్మణ వడుచుల నుద్ధరించను ॥ ఎట్టు ॥

చక్కగా గుబేరుని పుష్పక మెక్కి కదలితివి
మక్కువ సీతాదేవి మరలించను
తక్కక వాయుజు నెక్కి దాడి వెడలితివి నాడు
చొక్కపు వానరుల పౌజులు చూడను ॥ ఎట్టు ॥

కొట్టగొన నీవు రాతి గుబ్బమునెక్కి తోలితి–
వట్టియెడ నధర్మము నడచగను
మెట్టుక శ్రీ వేంకటాద్రి మీద బల్లకి యెక్కితి–
పట్టె యిందిర గూడి యేగు బెండ్లియేగను ॥ ఎట్టు ॥

శ్రుం : 26–105

ప. స స స ని ద ని పా ॥ ప మ గ మ రీ సా ॥
ఎట్టు నే - - - రి ॥ చి - తి - వ య్య ॥

రి గ మ ప పా ॥ ప మ గ మ రి రి సా ॥
యిన్ని వా - హ ॥ న - ము - లె - క్క ॥

రి గ మ ప పా ॥ ప మ ద ద దా ॥
గ ట్టి గా - నిం ॥ దు కే హ - రి ॥

మ ద ద ని స సా ॥ స ని ద ని పా - - ॥
క డు మె - - చ్చే ॥ మ - - - య్యా - - ॥ ॥ఎట్టు॥

చ. రి గ మ ప పా ॥ ప మ గ మ రి రి సా ॥
గ రు డు - ని ॥ మీ - ద - - నెక్క ॥

స స స ని ధ ని ధా ॥ ధ ని సా సా ॥
గ మ నిం - - - చి ॥ తి వి నా డు ॥

రి గ మ ప పా ॥ ప మ దా దా ॥
అ రు దై - న ॥ పా రి జా త ॥

ద స స ని ద ని పా ॥ పా ప మ పా - - ॥
హా ర ణా - - - - ॥ - - న కు - - ॥

ప మ ద ని సా || స ని దా నీ సా ||
గ రి మ - తో || ర - థ మె క్కి ||

రి గ మా రి రి స స || స ని ద ని పా - - ||
క - ద లి తి వ ల్ల || నా - - - డు - - ||

మ ద ద ని సా స || స ని ద ని ప ప ప ప ||
సౌ రి ది - బ్రా హ్మ || ణ - - - ప డు చు ల ||

ప మ గ మ రి రి || స రి గ మ ప మ ద ని సా ||
ను ద్ధ రిం - చ - || ను - - - - - - - - ||

॥ఎట్టు॥

**అవతారిక :**

ఇందు విచిత్రములగు ప్రాపంచిక విషయములను భగవంతుని లీలలతో ఉపమించుచు అయ్యవారు సాధారణమగు జ్ఞానము గల వారికిని సులభముగా అర్థమగునట్లు "ఎండలో కష్ట పడిన వారికి నీడ, చేదు మ్రింగిన వారికి తీపి. కష్టమనుభవించిన వారికి సుఖము, యిట్లే చెడు నెరిగిన వారికి మంచి తెలుసుకొను జ్ఞానము ఆనందము తెలియు''నని ఇతర దైవములను మ్రొక్కి తమయాసలు తీరక జీవులు అటమటించి నప్పుడే శ్రీ వేంకటేశ్వరుడు తన సన్నిధికి వారిని చేర్చుకొని వారికి ముక్తిని ప్రసాదించునని చెప్పుచున్నారు.

మాళవి—ఘుంపె

ఇందుకొఅకె యిందఱును నిట్లయిరి
కిందుపడి మఱికాని గెలుపెఱుగ రాదు ॥పల్లవి॥

అటమటపు వేదుకల నలయించి మఱికదా
ఘటియించు బరము తటుకన దైవము
ఇటుసేయ నీశ్వరుని కీసుగలదా లేదు
కుటిల మతి గని కాని గుణి గానరాదు ॥ఇందు॥

బెండుపడ నవగతుల బెనగించి మఱికదా
కొండనుచు బర మొసంగును దైవము
బండుసేయగ వారికి బంతమా యటుగాదు
యెండ దాకక నీడ హిత వెఱగరాదు ॥ఇందు॥

మునుప వేల్పుల కెల్ల మ్రొక్కించి మఱికదా
తన భక్తి యొసగు నంతట దైవము
ఘన వేంకటేశునకు గపటమా అటుగాదు
తినక చేదును దీపు తెలియనే రాదు ॥ఇందు॥

ప   రి గ మ ప మ | దా - - - || మ ద ని స ని | ద ని ప ప ప ||
ఇం - దు కొ అ | కే - - - || యిం - ద అు ను | ని - ట్ల యి రి ||

మ ద ని స ని | ద ని పా మ || రి గ మ ప మ | గ మ రి సా ||
కిం - దు ప డి | మ ఱి కా ని || గె లు పె రు గ | రా - దు - ||   ||ఇందు||

చ.   ద ని ప ప మ | గ మ రి రి రి || స స ని ధ ని | స స ని సా ||
అ ట మ ట పు | వే - డు క ల || న ల యిం - చి | మ ఱి క దా ||

రి రి గా మ | ప ప మ గ మ || రి రి గా మ | పా - - - ||
ఘ టి యిం చు | ప ర ము త టు || క న దై వ | ము - - - ||

ప మ దా ని | సా స స స || రి గ మ రి రి | సా ని ద ని ||
ఇ టు సే య | నీ శ్వ రు ని || కీ - సు గ ల | దా - లే దు ||

మ ద ని స స | ని ద ని ప మ || రి గ మ ప మ | గ మ రి సా ||
కు టి ల మ తి | గ ని కా - ని || గు ణి గా - న | రా - దు - ||   ||ఇందు||

**అవతారిక :**

ఇందలి నాయక ముగ్ధ, ఈమె విరహ తాపమును చెలులు స్వామికి నివేదించు చున్నారు. ఈమెకు శ్రీ వేంకటేశ్వరుడగు తన నాయకుని పేరు తలంచినంతనే సిగ్గులు పొడమునట అతని రూపమును చిత్రించుకొని కనుల కద్దుకొని, తలయూచుచు ముద్దిడి, విరహార్తయై కన్నీరు నించునట! ఈమెకు స్వామి నామాంకితములగు ముద్రలు కనబడి నంతనే కండ్ల కద్దుకొని భక్తి తత్పరతతో తన్మయురాలగునట. అలమేలు మంగాదేవి ఆనంద పారవశ్యమును అయ్యవారు ఎంతో హృద్యంగా ఈ రచన యందు వర్ణించియున్నారు.

**రాగ లక్షణం :**

కాంభోజి అతి ప్రాచీనమైన రక్తి రాగములలో నొకటి. ఇది భాషాంగము. 'సనిపదసా' అను సందర్భమున పలుకు కాకలినిషాద స్వరమే ఇందలి భాషాంగ స్వరము. ఈ రాగము ఇప్పటి 28వ మేళమగు హరి కాంభోజి జన్యము. నిజమునకు హరికాంభోజి కన్న ఎంతో ప్రాచీనమైనది కాంభోజి. వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన కాంభోజియు క్షేత్రజ్ఞుని పదముల యందలి కాంభోజియు ఒకే విధముగ నున్నవి. తెనుగున గల కొన్ని కావ్యములలో ఈ రాగ ప్రసక్తి గలదు.

16వ శతాబ్దపు, సంగీత సాహిత్య భరత శాస్త్రకోవిదుడును, మహాకవియు, శ్రీకృష్ణదేవరాయల వారి అష్టదిగ్గజములలో నొకడును నగు రామరాజ భూషణుడు తన వసు చరిత్రయను మహాప్రబంధము నందలి ఒక పద్యమున—

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ నఖమైన మోమున పటాగ్రం బెత్తి, యెల్గెత్తియా
రాజీవానన యేడ్చె, కిన్నర వధూ రాజత్ కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్"

అని కాంభోజి రాగమును, కరుణ, విరహ భావములను వ్యక్తము చేయుటకు చక్కగా ఉపయోగించుచువని తన యభిప్రాయమును చెప్పినాడు.

కాంభోజి — ఝంపె

ఎటు వంటి మోహమో యింతి కిదిగో నేడు
తటుకున నిను పేర్కొని తనకు తనె సిగ్గు పడు ॥పల్లవి॥

అప్పటి కప్పటికి నీ ముద్రికలు అట్టెకన్నుల నొత్తుకొనును
తప్పకను నీ మాటలే మదిని తలచి తలయూచును
చొప్పడెడు నీ రూపమే వ్రాసుకొ చూచి మ్రొక్కి ముద్దాడును
కప్పిన తమిని తానె కన్నీరు లోలోన నించును ॥ఎటు॥

గ్రక్కున నిన్ను కనుగొంటె కడుతానె పైకొనును
అక్కరతో నిన్ను దగ్గరున్నప్పుడట్టెతా వరగును
చక్కనీ అలమేలు మంగ సరగున శ్రీ వేంకటేశ్వర
చిక్కనీ కౌగిటిలోన చిత్రమే పరవశమౌను ॥ఎటు॥

ప. స రి గా మ | పా ద ని ద || ప ద స ని ద | ప మ గ రి స ||
ఎ టు వం టి | మో హ మో - || యిం తి - కి ది | గో - నే - డు ||

స రి గ మ రి | గ సా స స || స ని ప ధ ధ | సా స స స ||
త టు కు న ని | ను పే ర్కొ - ని || త న కు త నె | సి గ్గు ప డు || ॥ఎటు॥

చ. పా ద ని ద | ప ద ప మ గ || గా మ గ మ ప మ | పా ద సా ||
అ ప్ప ట - | ప్ప టి కి నీ - || ము - - ద్రి క లు | అ ట్టె క ||

ని ద పా ద | ని ద పా - || పా ద ప ద | సా స ని ద ప ||
న్ను ల నొ త్తు | కొ ను చు - || త ప్ప క ను | నీ మా - - ట ||

మ ప ద ని ద | ప మ గ స రి || గా మ పా | పా ద ప ద ||
లే - మ ది ని | త ల చి త ల || యూ చు ను | చొ ప్ప డె డు ||

సా ఠి స ఠి | ఠి గ మ గ స ఠి గ ఠి మ గ || సా ని ద ప | పా ద మ గ ||
నీ రూ - ప | మే - - - వ్రా - - - సు - || క చూ - చి | మ్రొక్కి చు - ||

పా ద సా | - - - - - || ప ద స ఠి స | ని ద పా మ ||
ద్దా డు ను | - - - - - || క - ప్పి న త | మి ని తా నె ||

ప ద సా ని ద | మ ప దా ని ద ప ప || ప మ గా గ రి సా | - - - - ||
క - న్నీ రు - | లో - లో - - - న || నిం - - చు - ను | - - - - || ఎటు ||

**అవతారిక :**

ఇందలి నాయిక మానవతి, ఖండిత, చతుర. నాయకునితో "నీ కిష్టమైనను లేకున్నను మన పొందులు తప్పవాయెను. శ్రీ వేంకటేశ్వరుడా నీ ఎచ్చొట్టు చేష్టలను ఇంకనైనా మానరాదా? నీ దేహమెల్ల చెమటలతో నిండినది. నన్నుచూచిన నీ సంతసపు పులకలు వెల్లడిగా తెలియవచ్చు చున్నవి. నటనలు చాలించి నాతో సుఖముండరాదా?" అని స్పష్టమగు మాటలతో నాతనిని హెచ్చరించు చున్నది.

**కాంభోజి—రూపకం**

అందుకేమి దోసమా నే మంతేసి కోపముగాక
నింద వేసుకోనేల నిన్ను జూడరాదా ? ॥పల్లవి॥

చిక్కని నవ్వులు నవ్వి చెక్కులెల్లా జెమరించె
చక్కనివాడ వౌదువు చాలించరాదా
మొక్కలపు మాట లాడి మోవియెల్లా బొక్కెనిదె
మిక్కిలి జాణ వౌదువు మేర నుండరాదా ? ॥అందు॥

తేరకొన నన్ను జూచి దేహమెల్లా బులకించె
తారుకాణలాయ నిక దలగ రాదా
గారవించ జెయివేసి కరగె నీ చిత్తమెల్లా
తేరెదేరె నీ మోహము తెలుసుకోరాదా ? ॥అందు॥

పానుపు మీదికి వచ్చి పక్కన నీ కొప్పు వీడె
మానవింకా బంతములు మన్నించరాదా ?
కోనేటి శ్రీ వేంకటేశ కూడితివి నన్ను నిట్టె
మానరాని పొందులాయ మమ్ము మెచ్చరాదా ? ॥అందు॥

శృం : 26—136

ప. స రి గ మ రి గ సా || స ని ఫా ధా సా ||
అం దు కే - - - - మి || దో - స మా నే ||

స ని ఫా ధ స రీ || గ స రీ రీ ||
మం - - తే సి కో || ప ము గా క ||

గ మ పా ద ప || ద స ద సా ని దా ||
నిం ద వే సు - || కో - నే - - ల ||

గ మ ప ద ని ద మ ప ద ప || ప మ గా మ గ రీ సా ||
ని న్ను జూ - - - డ - - - || రా - - - - - దా || ||అందు||

మ ప దా ని ద ద ప || ద స ద సా ని దా ||
చి క్క ని న - - - || వ్వు లు న - - వ్వ ||

మ ప దా ని ద పా || మ ప ప ప మ గ మా ||
చె క్కు లె - - ల్లా || జె మ గ - - - చె ||

మ గ పా దా || సా ని ద ప మ ||
చ క్క ని వా || డ వౌ - దు వు ||

గ స రీ గా || మా పా - - ||
రా - లిం చ || రా దా - - ||

మ గ ప ద సా || స రి గ స రి రీ ||
మొ క్క ల - వు || మా - ట లా - డీ ||

స రి గ మ గ రి సా || స ద రి స గ రి స ని ద ప ||
మి క్కి లి - - - జా || ణ - - . వౌ - - - దు వు ||

గ మ ప ద సా || స ని దా ని ద పా ప మ గ రి ||
మే ర నుం - డ || రా - - - - - దా - - - || ||అందు||

**అవతారిక :**

నాయిక ప్రౌఢ. పలుకకనే తన భావములను చెలులకు ఎరిగింపగలజాణ. అను కూలుడగు యీమె పతి వేంకటనాధుని రాకకు తడబాయ ననితత్తర పడుచు తన చేష్టలయందు బింకమును చూపుచు చెలులను అదలించు చున్న స్వామి యేలు కొనుటయు, వారి సంతోష మును, అయ్యవారు యీ పదము నందు వర్ణించుచున్నారు.

**కాంభోజి — త్రిపుట**

చెలియ మోహము చూడ రమ్మా
చెలియ మోహము నేడు చెలుల కగ్గలమాయ ॥పల్లవి॥

చిత్త మాతనిమీద చేయి చెలియ మీద
కొత్తైన గమనంబు కొనవేళ్ల మీద
తత్తరపు దాపంబు తను వల్లి మీద
చిత్తరపు గోపంబు ప్రియ సతుల మీద ॥చెలియ॥

అలపులును సొలపులును అంగజుని మీద
తలపంత యెడలేక దైవంబు మీద
పలుకులును బంతములు ప్రాణంబుమీద
తెలుపులును తెగువలును దీమసము మీద ॥చెలియ॥

ఇంపు సొంపులు వేంకటేశ్వరుని మీద
గుంపైన చందురులు కుచయుగము మీద
కెంపు గనుగవ చూపు గిలిగింత మీద
దంపతుల పరిణతులు తమకంబు మీద ॥చెలియ॥

రేం : 4-181

ప. - - ని ద | పా - ద ప ప మ గ || మ పా | దా ని ద ద ప ||
- - చె లి | య - - మో - - - || హ ము | చూ డ - - - ||

ద ప - దా - | సా - - || - - ప ద | సా - ద రి స ని ద ||
ర - - - - | మ్మా - - || - - ఓ - | - - - య - - - ||

ద ప ద ప | దా సా || స రి స | స రి గ మ గ రి గా ||
మ్మా - చె లి | య మో || హా ము - | నే - - - డు - - ||

స స స ద | రి స నీ ద ప || మ ప దా ని ద పా | ప ప మ గ మా ||
చె లు - - | ల - - క - || గ్గ - ల - - - | మా - - - - ||

పా ని ద | పా - ద ప ప మ గ || మ పా | దా ని ద ద ప ||
య చె లి | య - - మో - - - || హ ము | చూ డ - - - ||

చ. - - ప | ప ప మ గ మా || ప పా | దా ని ద ద ప ||
- - చి | త్త - - - మా || త ని | మీ ద - - - ||

ద ప ప ద | సా స స ని ద || ద పా దా - | ని ద దా పా ||
- - చే - | యి చె - - - || లి - య - | మీ - - దా ||

- - ప | ప ప మ గ మా || మ ద ప ప మ గ | మ గ రీ సా ||
- - కొ | త్తె - - - న || గ - మ - - - | నం - - బు ||

- - స ప | ప ప మ గ మా || ద ప మ ప దా | పా - - ||
- - కొ న | గో - - - ళ్ల || మీ - - - - | ద - - ||

- - ప | ప ప మ గ మా || పా - | దా ని ద ద ప ||
- - త | త్త - - - ర || పు - | తా పం - - - ||

దా ప ద । సా సా ॥ సని ప దా - । సా - - ॥
ఋ తను । వ ల్లి ॥ మీ - - - - । ద - - ॥

- - ద ప । దా సా ॥ స రి స । స రి గ మ గ రి గా ॥
- - చి - । త్త ర ॥ పు - - । కో - - - వం - - ॥

సా స ద । రి స నీ ద ప ॥ మ ప దా ని ద పా । ప ప మ గ మా ॥ పా
ఋ - - । ప్రి - - య - ॥ స తు ల - - - । మీ - - - - ॥ ద ॥చెలియ॥

**అవతారిక :**

ఇందలి నాయిక ప్రౌఢ. చమత్కారముగా నాయకుని యందు కనబడుచున్న దోషము లను ఎత్తి చూపుచు వాని నెరుగనట్లు మన్నించెదనని మెప్పులు పలుకుచు తన యింటికి వచ్చినదే గొప్పయని భావించి అవకాశమును జార విడిపించుకొనక అతనిని లాలించి, మెప్పించి, ఆనందించుచు చేసెదనని పలుకుచున్నది.

**కాంభోజి — రూపకం**

ఏల మఱుగున నుండే విటు రా రాదా
మేలిమి విభుడవని మెత్తు నిన్నును ॥పల్లవి॥

జిగి నీ మోవి మీదటి చిల్లర చేతులు చూచి
నగుదుగాని నిన్నెన్నడు దూరను
నిగిడిన నీ మేని నిండు జెమటలు చూచి
తగునందుగాని మరి తమకించను ॥ఏల॥

చెక్కులపై నిండుకొన్న చిన్ని పులకలు చూచి
మొక్కుదుగాని కోపమున దిట్టను
అక్కడనుండి వచ్చిన అసురుసురులు చూచి
చొక్కుదుగాని నిన్ను సొలశాడను ॥ఏల॥

గుట్టుతో నాకె గూడిన గురుతులన్నియు జూచి
యిట్టె పొగడుదుగాని యేమీ నవను
అట్టె శ్రీ వేంకటేశ మీఱగ నన్ను నేలితివి
పట్టి పాలారుతుగాని వచ్చిసేయను ॥ఏల॥

శృం : 19-183

ప. ప ద సా - - ॥ స ని దా ని ద పా ॥
ఏ - ల - - ॥ మ - అ గు న నుం ॥

ని ద ద ప మ గ పా ॥ దా సా ని ద ప మ ॥
డే - - - వి టు రా ॥ రా దా - - - - ॥

ప ద స రీ - ॥ స రి గ మ రి గ ॥
మే - లి మి - ॥ వి భు డ వ ని - ॥

స రి గ సా స ద ॥ రి స ని ద పా ని ద ద ప మ గ ॥
మె - త్తు ని న్ను - ॥ ను - - - - - - - - - - ॥ ॥ఏల॥

చ. - ద ని దా ని ద ద ప ॥ ద దా రి స ని ద పా ॥
- జి గి నీ మో - - - ॥ వి మీ - - - ద టి ॥

- మ ప ని ద ప ప మ గ ॥ మ ప ద ప దా ॥
- చి - ల్ల - ర - చే - ॥ త లు చూ - చి ॥

- గ మ ప ప ద స స ॥ స ని దా ని ద పా ప మ గా ॥
- న గు దు గా - - ని ॥ ని - - న్నె - - న్న - డు ॥

మ గ రి ప మ గ రి సా ॥ స ధ ధా సా - - ॥
దూ - - - - - - - ॥ - - ర ను - - ॥

- గ మ ప ద ద ప ॥ దా ని ని ద పా వ ॥
- ని గి డి న నీ - ॥ మే ని నిం - - డు ॥

ప మ గా ప ద స ద ॥ సా - - - - ॥
చె - మ ట లు చూ - ॥ చి - - - - ॥

- స రి గ స రి ॥ ప మ గ రి సా స స ॥
- త గు నం - దు ॥ గా - - - ని మ రి ॥

స రి గ మ రి గ సా స ద ॥ రి స ని ద పా ని ద ద ప మ గ ॥
త - మ - కిం - - చ - ॥ - - - - - ను - - - - - - ॥

ప ద సా - - ॥
ఏ - ల - - ॥

**అవతారిక :**

ఇందు "వేదమాతయైన పరాశక్తి నీకు (శ్రీ) మహాలక్ష్మి జలధి కన్యయగు అమ్మ వారిని ప్రసాదించి ఆమె హృదయ కమలంబునందు నిన్ను నిలిపినది. ఆ సిరి తన కన్నుల చింతామణులు నీపై కురిపించి నిన్నలరింప చేసి తన అభయ హస్తమున నీ చేయి పట్టుకొన్నది. నిన్ను తన సర్వాంగములతోను ముంచి ఆనందపరచి నీయుర మెక్కినది" అని అయ్యవారు చెప్పు చున్నారు. దేవి ప్రసాదమును చెప్పుచు ఆదిశక్తియే సర్వమునకు మూలమని ఈ రచన యందు అన్నమయ్య సూచించు చున్నట్లున్నది.

**రాగ లక్షణం :**

శంకరాభరణము ప్రాచీన మేళము. సర్వగమక వరికాదులతోనొప్పుచు అత్యంత మనో హరముగా నుండెడి రక్తి రాగములలో నొకటి. సంపూర్ణ సంపూర్ణము. వెంకటముఖి సంప్ర దాయముననను యిదే విధముగ చెప్పియున్నారు. మేళకర్తల ఆవిర్భావమునకు పూర్వము నుండియే ప్రసిద్ధములగు రాగములలోనిది యొకటి. ప్రస్తుతము వాడుక ప్రకారము 29వ మేళకర్త.

**శంకరాభరణం — ఆది**

అలుకలు చెల్లవు హరి పురుషోత్తమ
నలి నిందిర నీతో నవ్వినది ॥పల్లవి॥

ఆదిలక్ష్మి మోహన కమలంబున
వేద మాత నిన్ను వేసినది
ఆదెస నీపై నభయహస్తమును
సాదరమున గడు జాచినది ॥అలుకలు॥

సిరి దన కన్నుల చింతామణులను
పొరి నీపై దిగ బోసినది
వరద హస్తమున వలచెయి పట్టుక
అరుదుగ నిను మాటాడించినది ॥అలుకలు॥

జలధి కన్య తన సర్వాంగంబుల
బిలిచి నిన్ను నిటు పెనగినది
అలమేలుక (శ్రీ) వేంకటాధిప నిను రతి-
నెలమి నీ వుర (రం) బెక్కినది ||అలుకలు||

శ్రం : 26-6

ప. - గ మా ప మా గ రి స స । - స రి స నీ । స ధ నీ స స ॥
- అ లు క లు చె - ల్ల వు । - హ రి పు రు । షో - - త్త మ ॥

- స పా మ గా మ రి గ స । స రి గ మ । పా గ రి సా ॥
- న లి నిం - ది ర నీ తో । న - వ్వి న । ది - - - ॥ ||అలుకలు||

చ. - ప ప పా ప మ గ । మ రి గ స । రి గ గ ॥
- అ ది ల క్ష్మి మో - । హ న క మ । లం బు న ॥

- మ గ మా పా ప ద ప । గ మ పా ప ద నీ । సా - - ॥
- వే - ద మా త ని ను । వే - - సి - న । దీ - - ॥

- స రి గ సా రి గా । మ గ రి స । ద ని స స ॥
- ఆ - దె న నీ పై । అ భ య హ । - స్త ము ను ॥

- మ పా ద నీ స రి గ మ గ రి స ని । ద రి స ని ద ప । ప మ గ రి గ రి సా ॥
- సా - ద ర ము - న - గ - డు - । చా - - - చి న । ది - - - - - - ॥

||అలుకలు||

**అవతారిక :**

ఇందలి నాయిక విరహోత్కంఠిత, ముగ్ధ, దివ్య. ఈమె చెలులతో "ఘనుడైన అతడే నానాయకుడు. వేరెవ్వరు నాకు దిక్కు? ఏలనన్ను కలసి నాడోనమ్మా, నాపైన వలపు లేకున్నదా, కన్నులు వానలాయ, దేహమువత్తియాయ. చిత్తము అలసెను. చెక్కులు చెమరించెను. ప్రాయము బైకొనెను. పోయిన పోనీయని మీరందరు ఊరకున్నారు. ఎవరైన ఆతనికి బోధించరాదా?" అని చెప్పుకొను చున్నది.

**శంకరాభరణం — ఝంపె**

ఘనుడు దానేకాక కలరా నాకు దిక్కు
అనరమ్మ చెలులార ఆతనితో మీరు ॥పల్లవి॥

చిత్తము నలసెను చెక్కు చెమరించెను
కొత్తగాగ దనరాక కోరి కోరి
వత్తియాయ దేహము వానలాయ గన్నీళ్లు
తత్తరపు బతికేల దయ పుట్టదో ॥ఘనుడు॥

తాలిమెందో దాగెను తలపోత రేగెను
ఆలకించి తన అడియాసల జిక్కి
తీలుపడె నూరుపులు దిష్టమాయ వెరగులు
యీలాగు నన్ను మన్నించే దిక వెన్నడో ॥ఘనుడు॥

పాయము బైకొనెను భావము దాకొనెను
ఆయముతో నన్నుగూడి అంటగాను
యీ యెడ శ్రీవేంకటేశు డింత సేసి నన్నుగూడె
పోయిన బోనీ కెవ్వరు బోధించరో ॥ఘనుడు॥

శృం ; 26-108

ప. గ మ ద పా మ । గా - రి సా - ని స ॥ ధ ని స రి స । రి మ గా రి ॥
ఘ ను డు ఈ - । నే - - కా - - క ॥ క ల రా - - । నా కు దిక్కు ॥

గ మ ప ద ప । ప ద ని సా స ని ॥ ద ప మ గ రి । ప మ గ రి సా - ॥
అ న ర - మ్మ । చె - లు లా ర - ॥ ఆ త ని తో - । మీ - - - రు - ॥ఘనుడు॥

చ. గ మ ప ద ని ప । ద ప మ గా ॥
చి త్త ము - - - । న ల సె ను ॥

మ ద ప పా - మ । గ మ రి రి సా ॥
చె క్కు చె మ - - । రిం - - చె ను ॥

స స ని ధ ని సా స ని । స రి గ మ గ మ ॥
కొ త్త - గా - - గ - । ద - న రా - క ॥

గ రి గ మ పా - మ । పా - - - ॥
కో - - రి కో - - । రి - - - ॥

స స ని ద ని పా । ద ప మ గ మ పా ॥
వ త్తి - యా - య । దే - - - హ ము ॥

స స ని స రి గ మ గ రి । స ని ద ని సా ॥
వా న - లా - - - యె - । క - - న్నీ ళ్లు ॥

ప ప ప గ రి స ని । స ద ని సా స ॥
త త్త ర పు - - - । బ - తి కే ల ॥

గ మ ప ద మ ప గ మ రి గ । స రి ప మ గ రి సా ॥
ద య పు - - - ట్ట - దో - । - - - - - - - ॥ ॥ఘనుడు॥

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ, ప్రేమోత్కంఠిత. ఈమెకు నాధుని యందు గల మక్కువ చెప్పుకొనుచు, "నిన్ను తప్పుపట్ట తగదు నీ గుణములు తెలిసియు అలమేలుమంగ నగునేను నీ ప్రేమ దాక్షిణ్యమును అర్థించి నీకు ఊడిగములు చేసి సంతోషపరచుటకు ప్రయత్నించు చుంటిని. ఏది యెల్లైనను నీ దయవచ్చి నీవేలవలెగాదా" అని దక్షిణ నాయకుడగు నాతని గుణము లను చెప్పుచు శ్రీ వేంకటేశ్వరుని కృపకు పాత్రురాలగు చున్నది.

**రాగ లక్షణం :**

కురంజి ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇది ధైవతాంత్యములగు రాగముల యందలిది. ఇది 'ని స రి గ మ ప', 'ద ప మ గ రి స ని' అనునవి ఆరోహణావరోహణములుగా చెప్పబడి యున్నను క్రింది పంచమమును, 'స ని నీ ప' అని పట్టుట వాడుక యందుగలదు. దీనిని నవరోజు రాగముతో వేరు పరచుట లక్ష్య జ్ఞానము గలవారి నుండి తెలుసు కొనవలసి యుండును. ఇది యిప్పటి వాడుక ప్రకారము 29వ మేళమగు శంకరాభరణ జన్యము. ప్రయోగ ములు, స్వర సందర్భములు, గమక వరికాదులు మాత్రమే రాగములను గుర్తించుటకు ఆధారము లుగా నుండెడి రోజులలో, జనించినవియైన కొన్ని రక్తిరాగములకు ఆధారములు అందలి ప్రాచీన రచనలు మాత్రమే!

**కురంజి — రూపకం**

ఎప్పటి వాడవె కావా యెరుగుదుము
తప్పులు పట్టగ నిన్ను దగదయ్యమాకును ॥పల్లవి॥

చనవు సేసుక నే నీసరి నిలుచుందుగాక
మనసిచ్చి నీవు నాతో మాటలాడేవా
వనిత లిదెరగరు వడి వేగె కోనందురు
అనుమానమెల్ల బాసె నంపవయ్య మమ్మును ॥ఎప్పటి॥

వూరకైనా నేనే వట్టి వూడిగాలు సేతుగాక
మేరతో నీవు గొంతైన మెచ్చ బొయ్యేవా
నేరమెల్ల దీర నేడునిన్ను ముదలకించితి
ఘోర నోప నీతోను ఘోవయ్య చాలును ॥ఎప్పటి॥

నంటున నీతో నేనే నవ్వులు నవ్వుదు గాక
జంటపైయె నీ వట్టె సరసము లాడేవా
అంటిని శ్రీ వేంకటేశ అలమేలుమంగ నేను
యింటికి వచ్చి కూడితి వేల నయ్యనన్నుమా ॥ఎప్పటి॥

ప. రీ రి మ గా సా ॥ ని స గ రి స ని నీ ని ఫ ॥
ఎ ప్ప - టి వా ॥ డ - పు - కా - - వా - ॥

ఫా స ని స రి రి స ॥ గ మ ప ప ద పా మ ॥
యె రు - గు దు ము - ॥ త - ప్పు లు ప - - ॥

ప మ మ గ మ గా రి గ రి రి స ॥ స ని సా మ గ గ రి ॥
ట్ట - గ - ని - - న్ను - - - ॥ త గ ద - - య్యా - ॥

స ని సా సా ॥ - - - - - - ॥
మా - కు ను ॥ - - - - - - ॥ ॥ఎప్పటి॥

చ. స స స ని స గ రి ॥ రి స స ని నీ ని ఫ ॥
నం టు న నీ - - - ॥ తో - నే - - నే - ॥

ఫా - ని సా స రి స రి గ స ॥ రి రి మ గ గ రి సా ॥
న - - వ్వు లు - న - - - ॥ వ్వు దు గా - - - క ॥

సా పా - మ గా మ ప ॥ గా మ రి గ మ ప ప ॥
జం టై - - నీ - - ॥ వ ట్టె - స ర స ము ॥

మా ప ద పా ॥ మా మ మ మా ॥
లా డే - వా ॥ అం టి ని శ్రీ ॥

మ ద పా ప ప మ గ మా || రి రి మ గ గ రి ||
వెం - క టే - - - శ || అ ల మే - లు మం ||

స ని స రి గ స రీ || సా సా స ని స ధ ||
గ ను సే - - - ను || యిం టి కి - వ చ్చి ||

ప మ గా మ ప మ గ ప మ || గ ప మ గ రి మ గ రి సా ||
కూ - డి తి వి ఏ - ల - || న - య్యా - న - న్ను - ను || ॥ఎప్పటి॥

**అవతారిక :**

ఈ పదము నందలి నాయికా నాయకులను చూచి ఆనందించుచున్న చెలికత్తెలు "మీ యిరువురికి సరి తూగుచున్నది. మీ జాణతనములు చాలించి యెడ మాటలు కట్టిపెట్టుడు. మంకు తనములు మానితే విరహమునందలి మన్మధుని ములుకులు విరులుగానే మారును. మనసులు కలసియున్నప్పుడు చిలుకల పలుకులును ఇంపగును. సరసములు చెల్లితే జంకించుటలు కూడ ఆనందమునే యిచ్చును. ఇంక అలుకలు మాని మీరిద్దరు సంతోషమున నుండరే" యని చెప్పుచు ఆనంద నిలయ వాసుడగు శ్రీ వేంకటేశ్వరుని, అమ్మవారిని కొనియాడు చున్నారు.

కురంజి — త్రిపుట

అతడిదె నీవిదె అన్నిటాను జాణలు
యేతుల నింకానేలే యెడ మాటలు ॥పల్లవి॥

అంకెకు రా నేరిచితే అలుకలైనా సుఖమే
మంకుదనా లుడిగిన మానినులకు
సంకె దీరితే మరుని శరములెల్లా విరులే
యింకనైనా మామాట లియ్యకొనరే ॥అతడిదె॥

విన నేరిచిన జాలు విరహమైనా సుఖమే
మనసు దెలిసినట్టి మగువలకు
చెనకి లాలించితేను చిలుకలు మాటలాడు
చలములు మాని యిక సమ్మతించరే ॥అతడిదె॥

సరసము నేరిచితే జంకెనలైనా సుఖమే
తరి తీపు లెరిగిన తరుణులకు
యిరవై శ్రీ వేంకటేశుడిదివో నిన్నిటగూడె
యెరపులు మరి యేల యెనకుండరే ॥అతడిదె॥

శ్రృం : 27-22

ప. - - మ గ | సా - ని సా - ని || సా రి గ సా | రి రీ ||
- - అ త | డి - - దే - - || నీ - - - | వి దే ||

- - మ గ | మా పా - మ || గా - | గ మ గా రి గ రీ ||
- - అ - | న్ని టా - - || ను - | జా - - ణ - - ||

సా స | సా సా || స ని ని ధ | నీ సా ||
లు యే | తు ల || నిం - కా - | నే లే ||

- - స | పా ప ప మ గ || గ రి రి మ రీ | సా సా ||
- - యె | ద మా - - - || ట - - - - - | లు - || ||అతడిదే||

చ. - - ని | సా సా || - - ని స | రీ గ రి స ని సా ||
- - అం | కె కు || - - రా - | నే - - - - రు ||

రీ ధ ని | స రి గ స || స రి రి | మ గ సా ||
తే అ లు | క - లై - || నా - - | సు ఖ మే ||

సా మ గ | సా - ని సా - రి || గ సా | రి రి గా ||
- మం - | కు - - ద - - || నా - | లు డి గి ||

మా గ మ | పా ప ప మ గ || గా మ గ మ రి | రి రీ ||
న మా గ | ని ను - - - || ల - - - - | కా - ||

- - స | సా సా || ని స రి స | రి రి గ స ||
- - సం | కె ద్దీ || రి - తే - | ఘు ర్ఘు ని - ||

రీ స ప | ప ప మ గ గా మ రి || గ రి ప మ గ రి | స స సా ||
- శ ర | ము - - - లె - - || ల్లా - - - - - | వి రు తే ||

- - స | పా ప ప మ గ || గ ప మ గ మ రి | గా మా ||
- - యిం | క నై - - - || నా - - - - - | మా మా ||

పా గ | మా మ ద పా || ప ప మ గ మ | పా గ రి || సా
ట లి | య్యా కొ - - || న - - - - | శే - - || -   ||అతడిదే||

**అవతారిక ;**

ఇందు అలమేలు మంగతో అలరియున్న వేంకటనాధుని సన్నిహిత వర్తులైన చెలులు "ఈతనికి కప్పురపు కాపు పెట్టిన సొగసు. పాలకడలి యందు పవ్వళింపగా నంటిన మేలి మీగడ తరకలవలె కానవచ్చు చున్నది. పుణుగు జవ్వాదులు 'వ్రేపల్లె యందు రాసక్రీడలలో ఈతడు గడపిన రాత్రుల చీకటులా? అనునట్లున్నవి. అలమేలు మంగనురమునందు ధరించిన ఈతడు నిలువెల్ల సిరులతో కనబడు చున్నాడు. వీరి సొగసులిట్లుండక వేరెట్లుండును?,, అని తమలో తాము ఆనందించుచున్నారు. ఇది పెద తిరుమలాచార్యుల వారి రచన.

**రాగ లక్షణం :**

ప్రాచీన రాగములకు ఆరోహణావరోహణములు అంత నిర్దుష్టముగా కనబడవు. అట్టి రాగములలో శుద్ధవసంత మొకటి. దీనిని ఇప్పటి వాడుక యందు గల మేళ కర్తలలో 29వ దగు శంకరాభరణ జన్యముగా చెప్పియున్నారు. కాని శంకరాభరణము నుండి దీనిని వేరు చేయుట కొంచెము కష్టసాధ్యమే! ఇతరుల రచనలు యీ రాగము నందు కాన వచ్చుటలేదు. బహుశః శంకరాభరణము నుండి దీనిని విడదీయుట అనావశ్యము, అసాధ్యము అని యితర వాగ్గేయకారులు తలచి వుండవచ్చునని తోచుచున్నది, వక్రములగు కొన్ని దాటు స్వర ప్రయోగములను గమనించి రాగ భావమును పోషించు కొనవలెను. స రి గ మ ప ద ని స | స ని ద మ ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు.

శుద్ధ వసంతం—రూపకం

ఎన్నిమహిమల వాడే యీ దేవుడు
కన్నుల పండువ లెల్లా గదిసి నట్లుండెను ॥పల్లవి॥

పోలింప కప్పుర కాపు పురుషోత్తమునికి
యేలీలనుండునని యెంచి చూచితే
పాల జలనిధిలోన బవ్వళింపగా మేన
మేలిమి మీగడంటిన మెలుపుతో నుండెను ॥ఎన్ని॥

తట్టు పుణుగు కాపుదైవ శిఖామణికి
యెట్టుండెనని మఱి యెంచి చూచితే
చిట్టకాన రేపల్లెలో జేసిన రాస క్రీడల
నట్టే రాత్రులు మేన నంటి నట్టుండెను ॥ఎన్ని॥

అలమేల్మంగతోడనట్టె సొమ్ము ధరించగా
యెలమి శ్రీ వేంకటేశు నెంచి చూచితే
కలిమిగల యీ కాంత కౌగిట బెనగగాను
నిలువెల్లా సిరులయి నిండినయట్లుండెనూ ॥ఎన్ని॥

శ్రృం : 23–507

ప. - స । ని ద ద మ ॥ ద ప । మ గ గ రి ॥
- ఎ । న్ని మ హి మ ॥ లు - । గ ల వా - ॥

సా । - - సా ॥ ధ ని । స ని సా ॥
డే । - - ఈ ॥ దే - । - వు డు ॥

- స । రి గ మ గ ॥ రి రి । గ మ పా ॥
- క । న్ను ల వం - ॥ డు వ । లె - ల్ల ॥

- గ । మ ప ద ని సా ॥ స రి ని స । ద ని ప ద మ ప ద ని ॥
- క । ద సి న - - ॥ ట్టుం - - - । డె - - - ను - - - ॥ ॥ఎన్ని॥

చ. - గ । గా మ గ ॥ రి గ । రి సా స ॥
- పో । లిం ప - ॥ క ప్పు । ర కా పు ॥

ధ ని । సా - రి గ స ॥ రి గ । మా - - ॥
వు రు । షో - - త్త - ॥ ము ని । కి - - ॥

- గ । మపాప ॥ దమ । పగమా ॥
- ఏ । - లీ ల ॥ నుం - । డునని ॥

పగ । మ రి గ స ॥ రీ । గమ పా ॥
ఎంచి । చిచూ - చి ॥ తే । - - - ॥

- పద । ని స రి స ॥ రీ । గ మ గా ॥
- ఫా - । ల జ ల - ॥ ధి । లో - - ॥

గ మ గ । రి గ రి సా ॥ స ద ని । సా - - ॥
ప - వ్వ । శిం - - ప ॥ మే - - । న - - ॥

- స । స ని స రి గ మ ॥ గ రి స ని । ద మ పా ॥
- మే । లిమి - - మీ - ॥ గ - డం - । - టి న ॥

మ ప ద ని । స ని ద మ పా ॥ ప మ మ గ । గ రి స రి గ మ ప ద ॥ ని
మె - - - । లు - పు - తో ॥ నుం - - - । డె - ను - - - - - ॥ - ॥ఎన్ని॥

**అవతారిక :**

వేంకటగిరినాథుడు తొల్లి రక్షించిన భక్తుల చరిత్రలను కొన్నిటిని చెప్పుకొనుచు, ఆ స్వామిని అనంతుడవని కీర్తించుచు, నీవు ఎదుటి నిధానమవై యున్నను తెలిసికొని జీవులు కొలువ వలెనుగదా యను భావమును, అన్నమయ్యవారు వ్యక్తపరచు చున్నారు. ఇందు అయ్యవారు ఉదహరించిన భక్తుల చరిత్రలు యిప్పుడు ప్రచారమునందు ఉన్నట్లు తోచదు.

శుద్ధ వసంతం—ఆది

ఎదుటి నిధానమవెటు చూచిన నీ
వదె వేంకటగిరి యనంతుడా ॥పల్లవి॥

సొగిసి భాద్రపద శుద్ధ చతుర్దశి
తగువేడుక నిందరు గొలువ
పగటు సంపదలు బహుళ మొసగు నీ
వగు వేంకగగిరి యనంతుడా ॥ఎదుటి॥

తొలుత సుశీలకు దుశ్శీలవలన
వెలయ సంపదల విముఖుడవై
వలెనిన కొలిచిన వడిగాచిన మా
యల వేంకటగిరి యనంతుడా ॥ఎదుటి॥

కరుణ గాచితివి కౌండిన్యునిమును
పరగిన వృద్ధ బ్రాహ్మణుడవై
దొరవులు మావులు ధృవముగ గాచిన
హరి వేంకటగిరి యనంతుడా ॥ఎదుటి॥

అ : 11(2)–132

ప. స స ని̣ ని̣ సా రి స | రి గ మ గ | రి రి స ని̣ ||
ఎ దు టి ని ధా న ము | వె టు చూ - | చి న నీ - ||

స రి రి స రి గ గ రి | మ గా రి | సా - - ||
వ దె వేం - క ట గి రి | య నం తు | డా - - ||

రీ గా మ ప ద ద | మ గా రి | సా - - ||
ఓ వేం క ట గి రి | య నం తు | డా - - || ॥ఎదుటి॥

చ. మ గ మ ప ప ద ద ద | ప ద ని స | దా ద మ ||
సో గి సి భా - ద్ర ప ద | శు - ద్ధ చ | తు ర్ద శి ||

మ ప ప ద మ మ గ గ | రి స రి మ | గా - - ||
త గు వే - డు క నిం - | ద రు గో లు | వ - - ||

గ మ ప ప ద ద ద ద | ప ద ని స | స ని స స ||
ప గ టు సం - ప ద లు | బ హు ళ ము | న గు ని ధి ||

రి గ మ గ రి రి స ని | ద ద ని ని | సా - - ||
వ గు వేం - క ట గి రి | య నం - తు | డా - - ||

రీ గా మ ప ద ద | మ గా రి | సా - - ||
ఓ వేం క ట గి రి | య నం తు | డా - - || ॥ఎదుటి॥

**అవతారిక :**

"ఎన్ని చదివినను, ఇతరుల అనుభవనులు చూచినను, పుట్టుట గిట్టుటల యందు గల సుఖదుఃఖములను తెలుసుకొనినను వైరాగ్యము మనసునందు నాటదు. ఆసలుడుగవు, భ్రమలు తొలగవు. తనలో గల దైవమునే తెలియరు, నీ కొరకై వెదకు చుందును. నీవే యెదుటి నిధానమవై యున్నావు. ఇకనైనను నీ యందు లగ్నమనస్కులమై యుండగలమేమో లేదో!" అను భావమును అన్నమయ్య వారు యీ రచన యందు చెప్పుకొన్నారు.

**శుద్ధ వసంతం — ఆది**

ఏమని చెప్పెద నిటమీద హరీ
శ్రీమంతుడ నిను జేరితి మిది వో ॥పల్లవి॥

వినుచున్నారము వెనుకటి పాట్లు
కనుచున్నారము కలగేటి వారల
దినదిన భావము తెలిసీ దెలియదు
మనసున భయ మిసు మంతయు లేదు ॥ఏమని॥

భువి నెరుగుదుమిదె పుట్టెడిదెసలను
తవిలి మరణములు దలచెదమట్లనె
వివరపు టాసలు విడిచీ విడువవు
నవమగు విరక్తి నాటదు వోయి ॥ఏమని॥

చదివెదమిదివో సకల శాస్త్రములు
వెదకెద మిదె శ్రీ వేంకటేశనిను
మదిలో నుండగ మరచి వుంటి మిదె
యెదుట గంటిమిక యేలాపనులు ॥ఏమని॥

ప. గ మ ప మ గా గ రి | గ రి స ని | ధ ని సా ||
ఏ - మ ని చె ప్పె ద | ని ట మీ - | ద హా రీ ||

స రి గ మ ప ద ని స | స ని ద మ | ప మ గ రి ||
శ్రీ - మం - తు డ ని ను | జే - రి తి | మి ది వో - || ॥ఏమని॥

చ. స రి గ గ గ మ ప ప | గ మ ప ప | ద ని సా ||
వి ను చు - న్నా - ర ము | వె ను క టి | పా - ట్లు ||

ని ని స స రీ రి స | రి గ మ గ | రి రి స స ||
క ను చు - న్నా ర ము | క ల గె టి | వా - ర ల ||

ని ని స స స గ రీ స స | ని ని స ద | ని ని స స ||
ది న ది న భా - - వ ము | తె లి సీ - | తె లి య దు ||

స రి గ మ ప ద ని స | స ని ద మ | ప మ గ రి ||
మ న సు న భ య మి సు | మం - త యు | లే - దు - || ॥ఏమని॥

**అవతారిక :**

ఇందునాయకుని గుణములను స్వభావమును తెలిసినదగు నాయిక స్వామి "మీ గుణములు మాకిదివరకే తెలుసును. అన్నియు తెలిసే నిన్ను వలచి యున్నాము. నీ నవ్వులు నీ పలుకులు నీ చేతలు నీ చూపులకు ముందు; మేము చేయుపనులు మా మాటలు మా కోపములు ఎక్కునా? ఎందరు యెట్టి బుద్ధి చెప్పినా చనవిచ్చి సందిట నుంచుకొన్న నీ కౌగిటి ఏలుబడిని మరువ కలమా? నీతో పొందులు తప్ప నిందలు వేయగలమా?" అని నాయకుని అనురాగమునకు మురియుచు అతని దక్షిణ నాయకత్వమును నాయిక కొనియాడు చున్నది.

**రాగ లక్షణం :**

ఆరభి ప్రాచీన ఘనరాగములలో నొకటి. ఇందు శృంగార రసమునకు తావున్నదా అనిపించు రాగ స్వరూపము నేడు మనకు కనబడుచున్నది. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 29వ మేళమగు శంకరాభరణ జన్యము. స రి మ ప ద స । స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇందు పూర్వాచార్యుల రచనలు అనేకము కనబడుచున్నవి. మతభేదములు లేక ఒకే విధమగు స్వరూపము కలిగియున్న ప్రాచీనరాగములలో నిది యొకటి.

**ఆరభి — త్రిపుట**

తొల్లి నేమెరుగుదుము తోడి బడ నీ సుద్దులు
కల్లగాదు నిన్నప్పటి గరిసించ నేటికి ॥పల్లవి॥

యేతున నీవాడే మాటలిన్నియును డెల్లివచ్చె
యీతల మాకోపమిక నెందుకెక్కును
జాతితో నీ నవ్వేనవ్వు సరివచ్చె మామీదను
నీతి చెప్పి పెనగగ నీతో నేల ఇకను ॥తొల్లి॥

పట్టిన నీ చలములు పంతములకెల్లా నెక్కె
ఇట్టే నే వేడుకొనిన నేడకెక్కును
రట్టు సేసే నీవుద్దండాలిట్టే ఇంతటానిండె
నెట్టుకొని భాసడుగ నీతో నేల ఇకను ॥తొల్లి॥

కందువ నీకూటమి కౌగిటికి గురుతాయ
యిందరు జెప్పె బుద్ధులేడ కెక్కును
సందిట శ్రీవేంకటేశ చనవిచ్చి కూడితివి
నిందలు వేయును నాడ నీతోనేల ఇకను ॥తొల్లి॥

శృం : 19-535

ప. - - రి | సా సా || స స ని ధ | రి స రీ ||
- - తొ | ల్లి నే || మెరు - - | గుదుము ||

- - రి మ | ప ప పా || ద ప మా - గ | రి రి సా ||
- - తొ డి | బ డ నీ || సు - - - - | ద్దు - లు ||

- - ద | పా ద ప మ గ || రి ద ప | దా స స ||
- - క | ల్లా గా - - - || దు ని - | న్న ప్పటి ||

స ని ద రి | స ని ద ద ప || మ ప ద స ద ప | మ గ రి రీ ||
గ - రి - | సిం - చ - - || నే - - - - - | టి - - కీ || ॥తొల్లి॥

చ - - ద | పా పా || పా - | ద ప మ గ రీ ||
- - కం | దు వ || నీ - | కూ - - - ట ||

సా రి | స స సా || స స ని ధ | రి స రీ ||
మి కౌ | గి టి కి || గు రు - - | తా - య ||

- - రి | మ గ రి స రీ || రి మ పా | ప ద పా ||
- - యిం | ద - - - రు || జె - ప్పె | బు - ద్ధు ||

మ ప ద రి స ని | ద ద పా || ద ప మ గ రి మ | పా - - ||
లే - డ - - - | కె - - || క్కు - - - - - | ను - - ||

- - స | స ని ద రి స || రి రి మ గ | రి స రి ||
- - సం | ది - ట శ్రీ - || వేం క - - | టే - శ ||

- - స రి | మ గ రి పా || స ని ద ద | సా సా ||
- - చ న | వి - - చ్చి || కూ - డి - | తి వి ||

- - ద | పా ద ప మ గ || రి ద ప | దా సా ||
- - నిం | ద లు - - - || వే యు దు | నా డ ||

స ని ద రి | స ని ద ద ప || మ ప ద స ద ప | మ గ రి రి ||
నీ - తో - | నే - - ల - || ఇ - క - - - | ను - - - ||

సా రి | సా సా ||
- తో | ల్లి నే ||

**అవతారిక :**

"నీవు యెంత వలచినను ఆతనిని రట్టు సేయదగునా? దొరతనపుమగవాడు దొడ్డతనమును అలుసుగా భావించి సిగ్గులు విడిచి పైకొని పరవశమును చూపదగునా? నీ చేతలకు ఆతనిని చూచి అందరునవ్వు చున్నారు." అని చెలి నాయికను మందలించుచున్నది.

**రాగ లక్షణం :**

పూర్వగౌళ ప్రాచీన రాగములలో నొకటి. కాని శంకరాభరణ జన్యమైనను, సంచార సందర్భములలో ఇతర రాగములలో కలసి పోవుచుండుట వలననేమో ఇది ప్రచారము నుండి జరిగిపోయినదని తోచుచున్నది. ఇట్లే కొన్ని ప్రాచీన రాగముల యందు రసవంతములగు రచనలు రాగస్వరూపమును కనబరచుటకు లేకుండుట వలన ఆరాగము లిప్పుడు వాడుకయందు లేకుండ పోయినవి. ఇది యిప్పటి వాడుకప్రకారము 29వ మేళమగు శంకరాభరణ జన్యము.

ఆరోహణ : స గ రి గ స రి మ ప ద ని స

అవరోహణ : స ని ద ప మ గ రి స

**పూర్వగౌళ — త్రిపుట**

నలువంక సతులెల్ల నవ్వేరాతని
యెలమి నింతేసి బాయిట వేయదగునా ॥పల్లవి॥

ఘనుడైన మగవాని గాంత లెంతవలచిన
చెనకి కడు బచ్చిగ జేయదగునా
పెనగుచు నాతడు తప్పించుకొనగానే నీవు
కనుపట్ట మోవిమీద గంటి సేయదగునా ॥నలు॥

దొరతనపు విభుని దొయ్యలులెంత మీటిన
సిరుల గొల్వున గాకు సేయదగునా
పొరసియాతడు నిన్ను బొమ్మల జంకించ గానే
తొరలించి సంగడి పొందులు చూపదగునా ॥నలు॥

(శ్రీ) వేంకటేశ్వరుని జెలులెంతా సోద్యమైన
సేవసేసి సిగ్గువడ చేయదగునా
యీవల నాతడు నిన్ను నెనసి మెప్పించగానే
ఆవటపు రతులను అలయించదగునా ॥నలు॥

శృం : 19–141

ప. - - స రి | గ స రీ || స సా - ధ | సా సా ||
- - న లు | వం - క || స తు - - | లె ల్ల ||

- - స రి | మ ప ద పా || ప ద నీ స రి స | స ని ద ప ప మ గ రి ||
- - న - | వ్వే - - - || రా - - - - - | త - - - ని - - - ||

- గ స | రి మ పా పా ద ప మా || ప ద ప | ప ద ని సా ||
- - - | యె ల మి నిం - - - || తే - - | సి - - జా ||

స స రి గ | స రి సా || ప ద ని స రి స | స ని ద ప ప మ గ రి ||
యి ట - - | వే - య || త - గు - - - | నా - - - - - - - ||

గ స స రి | గ స రీ ||
- - న లు | వం - క ||

చ. - - ప ప | పా పా || మ గ స రి గ | స రి సా ||
- - ఘ ను | డై న || మ - గ - - | వా - ని ||

- - స ద | ప మ ద ని స || స రి గ స | రి రి మా ||
- - కాం - | త - - లెం - || త - - - | వ ల చి ||

పా స రి | మ ప ద ద ప || ప ప మ గ గ రి | గ స రీ ||
న చెన | కి - - క డు || ప - - - చ్చి - | గ - - ||

- - రి మ | ప ద ని స ద ప || పా ద ప మా | పా - - ||
- - చే - | య - - - త - || గు - - - | నా - - ||

- - స̇ ద | ప మ దా ని స̇ || స̇ రి̇ గ̇ స̇ | రీ రీ ||
- - పె న | గు - - చు - || నా - - - | త డు ||

- - స̇ రి̇ | ప̇ మ̇ గా̇ గ̇ రి̇ గా̇ || స̇ సా̇ | స̇ ద నీ సా̇ ||
- - త - | ప్పిం - - చు - కొ || న గా | నే - - నీ ||

సా రి మ | పా పా ద ప మా || ప ద ప | ప ద నీ సా ||
పు క ను | ప ట్టు - - - || మో - వి | మీ - - ద ||

- - స̇ రి̇ | గ̇ స̇ రి̇ స̇ || ప ద ని స̇ రి̇ స̇ | స̇ ని ద ప ప మ గ రి ||
- - గం - | టి - సే - || య - - - - - | ద - - - గు - - - ||

గ స స రి | గ స రీ ||
నా - న లు | వం - క ||

**అవతారిక :**

తన దేవేరులతో ముచ్చటించుచున్న శ్రీ వేంకటేశ్వరుని చూచిన చెలులు "దక్షిణ నాయకుడవైన నీవు ఒక్కొక్కరితోను ఒద్దికగా చనవులు చూపుచు వారిని లాలించి, ఆదరించి అనుభవించి ఆనందిపజేయుచున్న విధములు చూడ చూడ మాకు వింతలగు చున్నవయ్యా!" యని స్వామిని కొనియాడుచున్నారు.

**రాగ లక్షణం :**

నీలాంబరి ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము ఇరువది తొమ్మిదవ మేళమగు ధీర శంకరాభరణ జన్యము. 'ప ని ద ని ప' అను ప్రయోగమున కైశికి నిషాదము పలుకు చున్నది. అదియే భాషాంగ స్వరము. కొందరు లక్షణ కారులు దీనిని 28వ మేళమగు హరి కాంభోజి జన్యమనియు చెప్పియున్నారు. అది న్యాయము కాదు. ఇందు కాకలి నిషాద ప్రయోగము ప్రధానముగానుండి సకృత్తుగా కైశికి నిషాదము పలుకుచుండుట వలన ఇది 29వ మేళకర్త జన్యమనుటయే ఉచితముగా తోచుచున్నది. విలంబ కాలమున దీర్ఘములగు స్వరములను ఒదుగులతో పలికించు కొనుచు ప్రస్తరించినప్పుడే యీరాగ చ్ఛాయలు ఒప్పి నిండుదనము నిచ్చు చున్నది. స రి గ మ ప ద ప ని స । స ని ద ని ప మ గ రి గ స అనునవి ఆరోహణావరోహణములు. కొన్ని ప్రాచీన రాగములు ఆరోహణావరోహణ ములపైనను జనక రాగములపైనను అంతగా ఆధార పడక కొన్ని స్వతంత్రములగు సంచార సందర్భములు కలిగి శోభించుచుండుట కర్నాటక సంగీతమునందు పరిపాటి. బేగడ, నీలాంబరి, ఆనందభైరవి, అఠాణా, దేవగాంధారి మొదలగు రాగములు ఇటువంటికోవకు చెందినవి.

**నీలాంబరి—త్రిపుట**

ఎంతవేడుకో నీకు యీపె మీదను
వింతలెల్లా జూచి మాకు వెరగయ్యానిపుడు ॥పల్లవి॥

ప్రియ (ప్రేమ)మున నీ తోడ ప్రియురాలు మాటాడగ
ఆముకొని వినేవు నీ వప్పట నుండి
గోమున నే పొద్దు నీకు గొలువులు సేయగాను
భ్రామట్లనుండి యిట్టె సంతోసించేవు ॥ఎంత॥

అప్పటికిని బాగాలిచ్చి ఆకు మడిచియ్యగాను
వుప్పతిల్లు గళలతో నుబ్బేవు నీవు
చిప్పిలగ నిన్ను జూచి సెలవుల నవ్వగాను
చెప్పరాని తమకాన జిమ్మిరేగేవు ॥ఎంత॥

నేరుపు లెల్లా మెరసి నీకు బాదా లొత్తగాను
బోరున నీ నిలువెల్ల బులకించేవు
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నీదేవుల
గారవపు రతులను గడు జొక్కేవు ॥ఎంత॥

శ్రు : 24-10

ప. - - గ మ | పా ప ప మ గ || గా రి గా - | మ గ గ రి గా ||
- - ఎం - | త వే - - - || డు - కో - | నీ - - - కు ||

సా స | సా స స ధ ని || సా రి గా మ | పా - గ మా ||
- యీ | పె మీ - - - || ద - - - | ను - - - ||

మా గ మ | పా ప ద నీ || సా స ని | దా నీ ||
- విం - | త లె - - || ల్ల చూ - | చి మా ||

పా గ మ | పా ని ద దా ని ప || ప ప మ గ రి గ | మ ప మ గ గ రి గా ||
కు వె ర | గ య్యా - - - - || ని - - - - - | పు - - - డు - - ||

సా గ మ | పా ప ప మ గ ||
- ఎం - | త వే - - - ||

చ. - - గ మ | పా ప ప మ గ || గ రి గా | మ ప మ గ గ రి గా ||
- - ప్రి య | ము న - - - || నీ - - | తో - - - - - - ||

సా స స | స ని ధ ని సా || స రి గ మ ప మ | గా మ గ గా మ గ ||
డ ప్రియు | రా - - - లు || మా - - - - - - | టా - - డ - - ||

మా గ మ | పా ప స || స స ని ద ని | పా ప ప మ గ ||
గా అ - | ముకొని || వి - - - - - | నే వు - - - ||

మా మ గ | రి గ మ ప ని ని ద ప || మ గ రి గ మ ప | మ గ గ రి గా ||
- సీ - | వ - - - ప్పు - టి - || నుం - - - - - - | - - - - - డి ||

సా స | సా సా || సా - సా - | స ని ని ద నీ ||
- గో | ము న || నే - ప్రా - | ద్దు - - - నీ ||

పా గ మ | పా ని ప ప మ ప మ || ప సా సా - | స ని ద ని సా ||
కు కొ లు | వు - - లు - - - - || చే - య - | గా - - - ను ||

- - స ని | స రి గ స || సా - సా ని | స ద నీ సా ||
- - జా - | మ - ట - || నుం - డి - | ఇ - - ట్టె ||

సా గ మ | పా స ని ద ని సా - ద || ప ప మ గ రి గ | మ ప మ గ గ రి గా ||
- సం - | తో - - - - - - - - || సిం - - - - - - | చే - - - - - - ||

సా గ మ | పా ప ప మ గ ||
వు ఎం - | త వే - - - ||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక రూపగర్విత, ప్రౌఢ, స్వాధీనపతిక. ఈమె సౌభాగ్యమును కొనియాడుచు "అద్దములవంటి నునుపులు గల నీ చెక్కులపై చిరునవ్వులు చూచి తిరిగి తిరిగి నీ నాథుడు నీతో మాటలాడుచున్నాడు. నీ మొగము నందలి కవళికలు గమనించి నీ మాటకు జవదాటకున్నాడు. నీవు ప్రియములైన మాటలు పెక్కులు చెప్పుచున్నప్పుడు రెప్పలార్పక నిన్నుచూచి ఆనందించుచున్నాడు. లక్కవంటి నీ విలాసపు పొందులు విడువజాలడు. వేడుకతో నీవు విడెమియ్యగా నిన్ను కూడిన శ్రీ వేంకటేశ్వరుడు నిన్ను యురమెక్కించుకొని ఇక దింపజాలడు సుమా!" యని ఆదిలక్ష్మియగు అలమేలుమంగా దేవినిగా తమ చెలిని భావించి మెచ్చుకొనుచున్నాడు.

**నీలాంబరి — త్రిపుట**

ఎంత భ్రమల బెట్టేవే ఇతని నీవు
దొంతుల నీ యానలు త్రోయజాలడు ॥ పల్లవి ॥

జిగి జెక్కుచేత నీవు చిరునవ్వు నవ్వగానె
మగిడి మగిడి పతి మాటలాడీని
మొగముచూచి నీవు మించి యాసలియ్యగానె
తగిలి నీ మాట లిట్టె దాటజాలడు ॥ ఎంత ॥

పెక్కు విధముల నీవు ప్రియములు చెప్పగానె
అక్కరితో రెప్పలు వేయక చూచీని
లక్కవలె గరచి విలాసాలు నీవు చూపగ
వెక్కసపు నీ పొందు విడువగజాలడు ॥ ఎంత ॥

వేడుక తోడుత నిట్టె విడెము నీకియ్యగానె
కూడి శ్రీ వేంకటేశుడు గోరనొత్తీని
యేడ జూచినాను నీవే ఇచ్చకములాడగానే
జాడ నురమెక్కించి దించగ జాలడు ॥ ఎంత ॥

శృం : 27—236

ప  - - గ మ | పా ని ప ప ప మ గ || రి గ మ ప మ గ | రి గ మ గ గ రి గా ||
- - ఎం - | త - - భ్ర - మ - || ల - - - - - - | బె - - - ట్టే - - ||

సా స | స ని ధ ని సా || స రి గ మ రి గ | గా మ గ గా మ గ ||
వే - | ఇ త - - ని || నీ - - - - - | వు - - - - - ||

- - గ మ | పా ద ని ద ని సా || స ని ద ని స ని | ని ప ప ప మ గ ||
- - దొం - | తు - - - - ల || నీ - - - - - - | యా - న - - - ||

మా రి గ | మ ప ని ని ద ప మ గ || రి గ మ ప మ గ | రి గ మ గ గ రి గా || సా
లు త్రో - | య - - - జా - - - || ల - - - - - - | దు - - - - - - || -
॥ఎంత॥

చ. - - ప ప | పా పా - మ || గ మ పా ని ప | ప ప మ గ మా ||
- - జి గి | చె క్కు - - || చే - త - - | నీ - - - వు ||

మా రి గ | మా ని ప ప ప ప మ గ || రి గ మ ప మ గ | రీ గా ||
- ఛి రు | న - - - వ్వు - - - || న - వ్వు - - - | గా నె ||

- - స స | స ని ధ ని ప ప || పా గ గ మ గ | గ రి గా మా ||
- - మ గి | డి - - - మ - || గి - డి - - | ప - - తి ||

మా గ మ | ప స స స ని ద || ద ని ప | పా పా ||
- మా - | ట - లా - - - || డీ - - | ని - ||

- - స స | సా సా || సా - | స ద నీ సా ||
- - మొ గ | ము జూ || చి - | నీ - - వు ||

- - స ని | స రి గ స || సా - సా - | స ద నీ సా ||
- - ముం - | చి - యా - || స - లి - | య్యా - - గా ||

సా ప స | సా సా - ని || ని ద నీ స రి స ని | ని ప పా ||
నె త గి | లి నీ - - || మా - ట - - - - | లి - ట్టె ||

- - గ మ | పా ద ని ద ని సా స రి || ద స ద ప | ప ప మ గ గ రి సా || సా
- - దా - | ట - - - - జా - - || ల - - - | డు - - - - - - || -

॥ఎంత॥

**అవతారిక :**

ఇందునాయిక ముగ్ధ స్వీయ గనుక, చెలులు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునితో "నీవు చేసిన ప్రియములకు మారుసేయక మోమాటపడి యూరకున్నదని మా చెలిపై నేరముల నెంచెదవా?సరసుడవటు నీవు చెయ్యిబట్టి దగిచి ఆమెకు విడెమియ్యరాదా? ఆమెను కౌగిట నదిమి లాలించ రాదా? ఆమెసిగ్గులను అడ్డుచెప్పుటగా నెంచక మన్నించి ఆదరించవలె గాని మాపుదాక మాతో ఎన్ని చెప్పినను ఏమున్నది?" యని చెప్పుచు తమ చెలి చేతలను సమర్థించు కొనుచున్నారు.

**రాగ లక్షణం :**

సామ ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 29వ మేళమగు హరికాంభోజి జన్యమనియు చెప్పి యున్నారు. ఇది నిషాద వర్జ్యమగు రాగముగనుక ఎట్లైనను అనవచ్చును. కాని ఇందు సంగతుల కూర్పు స్వరముల స్వభావములు పరిశీలించినచో ఇది శంకరాభరణ జన్యమనుటయే యుచితముగా తోచుచున్నది. ఇందు తాళ్లపాకవారి తరువాత త్యాగరాజస్వామి, దీక్షితులవారు తప్ప వేరొకరు రచనలు చేసినట్లు కనబడదు. స రి మ ప ద స । స ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. 'స రి మ గ రి మ ప' 'రి ప మ ప', 'మ ద స', 'ద రి స' 'ప స ద ప', 'మ గ గ రి' వంటి ప్రయోగములు ఇందు రక్తిని కలిగించుచున్నవి.

**సామ—రూపకం**

మాతోనేమి చెప్పేవు మాపు దాకాను
యీతరవాతనే నీవు యియ్యవయ్య చనవు ॥పల్లవి॥

అనరాదు గాక నిన్ను ఆపె యెదుటనే నీవు
ననిచి వేరొకతెతో నవ్వనేటికి
మనసిచ్చి యందుకుగా మాటలాడదాయ నేమో
పెనగి చేపట్టి తీసి పెట్టవయ్య విడెము ॥మాతో॥

అట్టుసేయ రాదుగాక నెట్టన సతి చెలితో
నట్టె నీవు జూజము లాడ వచ్చునా
ఇట్టె యిందుకు గానే ఇంటిలోనే వున్నదేమో
గుట్టున వద్ద గూచుండి కూడవయ్య కౌగిట ॥మాతో॥

తప్పు మోపరాదుగాక తరుణి నిట్టె కూడి
కప్పులు దేరగ మోవి గంటినేతురా
చిప్పిలి యిందుకు గాను సిగ్గుపడి వున్నదేమో
అప్పటి శ్రీవేంకటేశ చెప్పవయ్య ప్రియము ॥మాతో॥

శృం : 25-124

ప. - ప । పా ద ప మ గ ॥ గ స । రి స రీ ॥
- మా । తో సే - మి - ॥ చె - । ప్పే - వు ॥

- స ధ । సా స రి ప మ ॥ మ గ గ రి । రి స రీ ॥
- మా - । వు దా - - - ॥ కా - - - । ను - - ॥

- సా । - రి మ పా ॥ ద ప । దా సా ॥
- యీ । - త రు వా ॥ త నే । నీ వు ॥

- ప ద । స స ద ద ప ॥ ప మ మ గ । గ రి రి స రీ ॥
- ఇ - । య్యా వ - - య్య ॥ చ న - - । వు - - - - ॥ ॥మాతో॥

చ. - మ । మ మా మ ॥ మ ప ద మ । ప మ మ గ గ రి రీ ॥
- త । ప్పు మో ప ॥ రా - - - । దు - గా - - - క ॥

- స రి । మా మ గ గ రి రీ ॥ సా రి ధ । సా - - ॥
- త రు । ణి ని - - - ట్టె ॥ కూ - - । డి - - ॥

- ధ । స స రీ ॥ స రి మా । మ గ గ రి రీ ॥
- క । ప్పు లు దే ॥ ర - గ । మో - - - వి ॥

- రి స । రీ రి మ ప మ ॥ పా । - - - - ॥
- గం - । టి నే - - తు ॥ రా । - - - - ॥

- ద | ద ద ద ప || ప మ ప | దా సా ||
- చి | ప్పి లి ఇం - || దు - కు | గా ను ||

- స̇ రి̇ | స̇ రి̇ మ గ గ రి̇ || స̇ రి̇ గ | స̇ రి̇ స̇ స̇ ||
- సి - | గ్గు - ప - డి - || యు - - | న్న దే - మో ||

- ద | స̇ సా స̇ || ప ద రి̇ స̇ | స̇ ద ద ప ప ||
- అ | ప్ప టి శ్రీ || వేం - - - | క - శే - శ ||

- ప | ప ద సా ద ప || ప మ మ గ | గ రి రి స రి ||
- చె | ప్ప వ - య్య - || ప్రి - య - | ము - - - - ||                ||మాతో||

**అవతారిక :**

బ్రతుకు నందు ఆశను వదలియుండక వాచవులకు తవిలి వంచనములకు లోనై వెతల బడు సిగ్గులేనిదగు మనసును గురించి చెప్పుచు "ఆశలకు అంతరంగమున చోటెంతైనా గలదట. విరతికి పీసమంతైన చోటు లేదట. తనకు సంసారమున ఎందరైన గలరు గాని ఒక్కరును మోక్ష మియ్య జాలరట. కామోపభోగములకు ప్రొద్దుగలదు గాని హరిదలచుటకు వేళ లేదట బుద్ధి లేని లంపటపు పనులకు ప్రొద్దెంతైనా కలదు. మోక్షకారకములగు పనులు చేయుటకు వేళ లేదుట ఇతరులకు చెప్పుటకు జ్ఞానముకలదు గాని తానాచరించుటకు ఆత్మజ్ఞానము లేదట. మనసునందు గల పరమాత్ముడగు శ్రీ వేంకటేశ్వరుడు రక్షించెనుగాని లేకున్నచో యీ పాపము లకు నిష్కృతి గలదా !" అని అయ్యవారు తమను తాముద్దేశించి చెప్పుకొనుచున్నారు.

**రాగ లక్షణం :**

బిలహరిరాగము ప్రాచీనము. భాషాంగము, రక్తిరాగము. స రి గ ప ద స స ని ద ని ద ప మ గ రి స । అనునవి ఆరోహణములు. ఇప్పటి వాడుక ప్రకారము యిది 29వ మేళమగు శంకరాభరణ జన్యమని చెప్పుకొనవలెను. 'ప ని ద పా' – 'గ ప ద ని ద పా' మొదలగు ప్రయోగములలో కైశికి నిషాదము పలుకుచున్నది. వెంకటమఖి సంప్రదాయ మందును ఇట్లే చెప్పియున్నారు. క్షేత్రజ్ఞుల పదములందును బిలహరి ఇట్లే యున్నది.

**బిలహరి—త్రిశ్రఏక**

ఛీ ఛీ ఓ బదుకా సిగ్గులేని బదుకా
వాచవికీ బతిమాలి వడబడ్డ బదుకా ॥ పల్లవి ॥

ఆసలకు జోటుకద్దు అంతరంగాన నెంతైనా
పీసమంతా జోటులేదు విరతికిని
యీసున సంసారమున కెందరైనగలరు
వోసరించి మోక్షమియ్య నొక్కరు లేరు ॥ ఛీఛీ ॥

భోగించ వేళగద్దు పొద్దు వొడుపుగుకుంను
వేగమే హరిదలచ వేళ లేదు
వోగులలంపటమున కోపికెంతైనా గద్దు
యోగపు సత్కర్మానకొక యింతలేదూ ॥ ఛీఛీ ॥

యెదుట ప్రపంచాన కెరు కెంతైనా గద్దు
యిది వోయాత్మజ్ఞాన మించుకాలేదు
మరి శ్రీ వేంకటేశుడు మమ్ముమన్నిచెట్టె కాచెగాని
పదరి నా వేరములు పాప మటి లేరూ ॥ ఛీఛీ ॥

అ : 5—292

ప సా రీ గా । ప ప దా - - ॥ దా రిం సా ని । ద ప దా - - ॥
ఛీ ఛీ ఓ । బ్రతు కా - - ॥ సి గ్గు లే ని । బ్రతు కా - - ॥

స రి స ని ద ప । ప ప ద ప పా ॥ ప ద ప మ గ రి । స ని ధా సా ॥
వా - చ వి కీ - । బ్రతి మా - లి ॥ వం - చ ప - డ్డ । బ్రతు కా - ॥ ఛీఛీ ॥

చ. దా ని ద పా । ప ద ప మ గ రి ॥ గ ప పా మ గ । రి గ పా పా ॥
ఆ స ల కు । చో - టు క - ద్దు ॥ అం త రం గా న । నెం - తై నా ॥

మ గ ప ప ద ప । ద స స సా ని ॥ ద ప ద ద సా । రీ గ మ గ రి ॥
వీ - స ము - త । చో - టు లే దు ॥ వి ర తి కి ని । యీూ సు న సం - ॥

సా ని ద ప ద । ద రి స ని ద ప ॥ ద ద ద ప పా । - - - - - - - ॥
సా ర ము న - । కెం ద రై - నా - ॥ గ ల రు - - । - - - - - - - ॥

ప ద రి సా ని । ద ని ద పా ప ॥ ద ప మ గ గ రి । సా - - - - ॥
ఓ - స రిం చి । మో - క్ష మి య్యా ॥ ఒ - క్క రు లే - । రు - - - - ॥ ॥ ఛీఛీ ॥

**అవతారిక :**

ఈ కీర్తనమున శేషాచలనాధుని కృపాకటాక్షము వలన ఆ దేవ దేవుని వైభవము లను అలంకారాదులను పరమ యోగీంద్రులు తమ హృదయమున నిలుపుకొని పూజించిన పాదాంబుజములను గగన గంగ మొదలగు పుణ్యతీర్థములను, కోవిదులు కొనియాడెడి కోనేటిని దర్శించి ఆనంద జలధిలో నోలలాడుచు అయ్యవారు తాము చూచినవి కన్నులకు కట్టినట్లు మనకు చెప్పియున్నారు.

**రాగ లక్షణం :**

దేశాక్షి ప్రాచీనములగు ప్రసిద్ధ రాగములలో నొకటి. ఇప్పటి వాడుక ప్రకారము అది 29వ మేళమగు శంకరాభరణ జన్యము. స రి గ ప ద స | స ని ద ప మ గ రి స । ఆరోహ ణావరోహణములు. ప్రాచీన రాగములలో కొన్ని కాలక్రమమున మరుగుపడి వాటికి సన్నిహిత ములుగా నుండిన కొన్ని ఇతర రాగములు ప్రచారమునకు ఎక్కువగా వచ్చుట జరుగుచున్న ఒక సత్యము. ఉదాహరణకు స ని ద ని ద ప అనునప్పుడు కైశికినిషాద ప్రయోగము గలిగి బిలహరి యను పేరుతో భాషాంగమై యుండిన రాగము దేశాక్షిని ప్రక్కకు నెట్టినది. ఇట్లే సామంతమును కేదారము; యీ కేదారమును నీలాంబరి; ప్రక్కకు నెట్టివేయుట జరిగినది. ఇటువంటి రాగములు కర్ణాటక సంగీతమున ఎన్నియో కలవు ఇప్పటికిని దేశాక్షి రాగస్వరూ పమును తెలియజేయుటకు మహానుభావులైన పురందర దాసులవారి గీతమొకటి ఆధారముగా నున్నది. ఇంకను కొన్ని గ్రంధముల యందు శైలదేశాక్షి, నారాయణ దేశాక్షి మొదలగు రాగములు కనబడుచున్నవి గాని దేశాక్షి రాగమునకు వీటికిని సంబంధము కనబడుట లేదు.

**దేశాక్షి—ఝంపె**

కంటి నఖిలాండ (తతి) కర్తనధికుని గంటి
కంటి నఘములు వీడుకొంటి నిజమూర్తిగంటి ॥ పల్లవి ॥

మహోన్నత ఘన ఫణామణుల శైలము గంటి
బహు విభవముల మంటపములు గంటి
సహజ నవరత్న కాంచన వేదికలు గంటి
రహి వహించిన గోపురంబులవె కంటి ॥ కంటి ॥

పావనంబైన పాపవినాశనము గంటి
కైవశంబగు గగన గంగ గంటి
దైవికపు బుణ్య తీర్థములెల్ల బొడగంటి
కోవిదులు గొనియాడు కోనేరి గంటి ॥ కంటి ॥

పరమ యోగీంద్రులకు భావగోచరమైన
సరిలేని పాదాంబుజములు గంటి
తిరమైన గిరిచూపు దివ్య హస్తము గంటి
తిరువేంకటాచలాధిపు జూడగంటి ॥ కంటి ॥

అ : 11(2)–58

ప. ప గ ప ద రి । స ని ద ద ప ॥ ప గ ప ద రి । స ని ద ద ప ॥
కం - టి న ఖి । లాం - డ ప తి ॥ క - ర్త న ధి । కు ని గం - టి ॥

గా ప మ గ । రి స రి గ ॥
కం టి న ఘ । ము ల వీ డు ॥

పా మ గ రి । గా ప దా ॥ సా - - - । - - - - - - ॥
కొం టి ని జ । మూ ర్తి గం ॥ టి - - - । - - - - - - ॥ ॥ కంటి ॥

చ. గ ప దా ద । ద ప మ గ రి ॥ గ గ ప దా । స ని దా ప ॥
మ హో న్న య । ఘ న ఫ ణా - ॥ మ ణు ల శై । ల ము గం టి ॥

గ ప ద ద ద । స స స ని ద ॥ ద ప ద ద స । సా - - - ॥
బ హు వి భ వ । ము ల మం - ట ॥ ప ము ల గం - । టి - - - ॥

స రి గ మ గ । రి స ని ద ప ॥ ప ద ద రి స । ని ని దా ప ॥
స హ జ న వ । ర - త్న కాం - ॥ చ న వే - ది । క ల గం టి ॥

ప ద స స ని । ద ప మ గ రి ॥ స రి గ ప ప । దా సా - ॥
ర థ హ య హిం - । చి న గో - పు ॥ రం - బు ల పై । గం టి - ॥ ॥ కంటి ॥

**అవతారిక :**

"జీవులు సుఖము లను కొని సూదుల మూటల వంటి కష్టములమ పైన వేసుకొని తిరుగాడుచున్నారు. ఈ కష్టములు యెప్పుడు పోవును, ఎట్లుపోవును? సుఖదుఃఖములకు అతీతుడై మనలను ఉద్ధరింపగలవాడు వేంకట నాధుడున్నాడని తెలుసుకొనవలెను గదా!'' అని అయ్యవారు ప్రాపంచిక బంధములలో పడి తన్నుకొనుచున్నవారి నుద్దేశించి హెచ్చరించు చున్నారు.

**దేశాక్షి—ఆది**

అప్పుల వారే అందరును
కప్పగ దిప్పగ గర్తలు వేరి ॥ పల్లవి ॥

ఎక్కడ జూచిన నీ ప్రపంచమున
జిక్కులు సిలుగులు జింతలునే
దిక్కెవ్వరు యీ లేదీపులలో
దిక్కు ముక్కులకు దేవుడె కాక ॥ అప్పుల ॥

యేది దలంచిన నే కాలంబును
సూదుల మూటల సుఖము లివి
కాదన నౌనన గడ గనిపించగ
పోదికాడు తలపున గల దొకదే ॥ అప్పుల ॥

ఎన్నడు వీడీ నెప్పుడు వాసీ
బన్నిన తమ తమ బంధములు
ఉన్నతి సేయగ వొప్పులు నెరపగ
వెన్నుడు వేంకట విభుడే కలడు ॥ అప్పుల ॥

అ: 11 (8)–15

ప. గా ప ప మ గ గ రి । స ని ని ద । సా - - ॥
అ ప్పు ల వా _ రే - । అం - ద రు । ను - - ॥

స రి గ గ పా ద ద । స రి స ని । ద ద ద ప ॥
క - ప్ప గ ది ప్ప గ । గ - ర్త లు । వే - రీ - ॥ ॥అప్పుల॥

చ. మ గ ప ప ప ద ద ప । ద స ని ద । ప ప ప వ ॥
ఎ - క్క డ జూ - చి న । నీ - ప్ర పం । - చ ము న ॥

ద ద స ని ద ద ద ప । ప ద ద రి । సా - - ॥
జి - క్కు లు సి లు గు లు । జిం - త లు । నే - - ॥

స ద స రి గ మ గ రి । స స ని ని । ద ప ద ద ॥
ది - క్కె - వ్వ రు యీూ - । తీ - దీ - । పు ల లో _ ॥

ద రి స స ని ద ద ప । ద ప మ గ । రి స రీ ॥
ది - క్కు ము - క్కు ల కు । దే - వు డె । గా - క ॥ ॥అప్పుల॥

**అవతారిక :**

ఇందు ముగ్ధ యగు నాయిక చేష్టలను నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునకు విన్న వించుచు "నీకథలు మాచెలి యేమేమి విన్నదో తెలియదు. నీయందు మోహపరవశయై యున్నది. ఈమె బాల. నీవు నవ్వగా తనను హేళన చేయుచుంటివని కనుబొమలచే జంకించుచున్నది. నీవు చేయివేయగా వలదని ఆనలు బెట్టుచున్నది. కాని ఈమెకు నీయందుగల మనసును నీ వెరుగుదువు గనుక లాలించి ఆదరించు చుంటివి." అని చెలి విన్నవించుచున్నది.

**రాగ లక్షణం :**

దేవగాంధారి ప్రాచీనరాగము. భాషాంగము. ఈ రాగమునందు 'ని సా ని' అను నప్పుడు కాకలినిషాదము 'ద నీ ద' అనునప్పుడు కైశికి నిషాదము పలుకు చుండుటచే ఇది 28వ మేళ జన్యమా, 29వ మేళ జన్యమా అనుసందేహము లక్షణకారులకు కలుగుచునే యున్నది. ఇందు తరుచుగా కాకలినిషాదమే పలుకుచుండుట వలన ధీరశంకరాభరణ జన్యముగా చెప్పి కైశికినిషాదమును భాషాంగ స్వరముగా నిర్ణయించుట న్యాయము. వెంకటమఖి సంప్రదాయము నను యీ విధముగనే చెప్పియున్నారు. ఇది రక్తిరాగము. స రి గ రి మ ప ద ని స । స ని ద నీ ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు.

**దేవగాంధారి—ఆది**

ఏమని వినెనో యిటునీ సరితలు
తామర విసురుచు దాకించీని ॥పల్లవి॥

యీలాగున నీ వింటికి రాగా
వాలుక చూపులు వంచీ జెలి
ఆలరివై మాటాడక మునుపే
కోలుముందుగా గొనరీని ॥ఏమని॥

ననుపున నీవిటు నవ్వులు నవ్వగ
కినియుచు గడు జంకించీని
చనవున బై జేయి చాచక మునుపే
ఘెనగుచు నానలు వెట్టీని ॥ఏమని॥

గక్కున నీ విటు కౌగిలించగా
అక్కజపు రతుల నలసేని
యిక్కువ శ్రీవేంకటేశ మునుపనే
చెక్కులునొక్కుచు జెనకేని ||ఏమని||

రేకు : 25–69

ప. - ద నీ స సా స ని దా ని ద పా । - ప ప మ ప ద ప । మా మ గ రి రి ॥
- ఏ - మ ని వి - నె నో - - । - ఇ టు - నీ - - । స రి - త లు ॥

- స స ని ధ ధా ని స రి స రి రి । మా మ గ రి రి । మ ప ద ప దా ॥
- తా - - మ ర వి - స - రు చు । తా - - కిం - । చీ - - - ని ॥ ||ఏమని||

చ. - ద ని ద పా - పా ద ప మ గ రి । - స రి గ సా । రి స సా ॥
- యీ - - లా - గు న - నీ - - । - విం - టి కి । రా - గా ॥

- సా ని ధ దా ని స రి స రి రి । గ మ మ గ రి । రి స రి రి ॥
- వా - లు క చూ - - - పు లు । వం - చీ - - । చె - లి - ॥

- పా మ ద దా ని స స ని దా । ని స రి స రి రి । గ మ గ రి ॥
- అ ల రి - వై - మా - - । టా - - - ద క । ము ను పే - ॥

- సా - స సా స ని దా । పా ద ప మా - గ । రి మ ప దా ॥
- కో - లు ముం దు - గా । కొ స - రి - - । నీ - - - ॥ ||ఏమని||

**అవతారిక**

ఇందు "పురుషోత్తముడవైన నీవు జీవాత్మలగు గొల్లెతలకు పురుషోత్తముడవైతివి సమస్త జీవరాసులయందుఁను నిండియున్న నిన్ను పొగడుటకును, దెగడుటకును రసవంతములఁగు పలుకులెక్కడ నున్నవి? ఎట్లునుతించినను అవి నీరసములే అగును. శ్రీ వేంకటేశ్వరుడవై మమ్మేల నేలితివి. ఇంక నిన్ను దూరుటకు ఏమున్నది? మాకామిత ఫలము లీడేరినవి." అని ఆస్వామికి సన్నిహితులగు కొలువరి కత్తెలు కొనియాడుచున్నారు.

**దేవగాంధారి—చతురశ్రఏక**

ఏమని దూరే మెందాకా నిను
కామిత ఫలములు గలిగెను మాకు ॥పల్లవి॥

పలుకులేమిటికి బలుమారు
అలర నీరసము లాయ నిక
కొలది మీరి రదె గొల్లెతలు
మలసి వారలకు మగడవు నీవు ॥ఏమని॥

తడవ నేమిటికి తతిగొనుచు
చిడుముడి నీ సేత చెల్లెనిక
అడరిరి పెండ్లికి నచ్చరలు
యెడయక వారల నేలితివి ॥ఏమని॥

వెంగెము లేటికి వెక్కసమై
కంగు దేరమము గలసితివి
యింగిత మెఱిగిన యిల్లాండ్లము
చెంగట గూడితి శ్రీవేంకటేశ ॥ఏమని॥

రేకు: 24—588

ప  మ ప ద ని సా సా - ని ॥ దా ద నీ ద పా ప ప ॥
ఏ - మ ని దూ రే - - ॥ మిం దా - - కా ని ను ॥

ప మ పా ద ప మ గ గ రి ॥ రి స రి గ స రి సా ॥
కా - మి త - ఫ లము లు ॥ క లి గె ను నూ - కు ॥ ॥ఏమని॥

చ. రి రి రి ని ద ప ప ॥ మ గ గ రి రీ - - ॥
ప లు కు లే - మి టి ॥ ప లు మా - రు - - ॥

రి రి రి గ మ గ గ రి ॥ రి స రి గ స రి సా ॥
అ ల రి నీ - ర స ము ॥ లా - యె ని క - - ॥

మ ప ద సా స స ని ద ॥ ద ని స రి స రీ - - ॥
కొ బ ది మీ రి ర - దె ॥ గో - - ల్లె త లు - - ॥

రి రి రి గ మ గ గ రి ॥ రి స రి గ స రి సా ॥
మ ల సి వా - ర ల కు ॥ మ గ డ వు నీ - వు ॥ ॥ఏమని॥

**అవతారిక :**

ఇందు అయ్యవారు "ఇతరుల దోషముల నెంచుచు తన తప్పుల నెరుగక సంచరించెడి వారిని హెచ్చరించుచు, గుణ దోషము లెన్నుటకు ఎవ్వరికి స్వతంత్ర్యములేదు గదా శ్రీహరికి తప్ప! మనము జీవులందరును పరమాత్మని ప్రతిరూపములే అను పరమసత్యమును గ్రహించు కొనక వారను వీరను భేదమును పాటించి చెడిపోవుచున్నాము. శ్రీవేంకటనాథుని కృప కలుగుట వలన గదా ఇట్టి అజ్ఞానముబాయును." ఇది తాళ్లపాక చినతిరుమలాచార్యులవారి రచన.

దేవగాంధారి—ఝంపె

నేరిచెవ్వడు బ్రదికె నేరక యెవ్వడు చెడె
భారకుడందరికి శ్రీపతి యుంతెకాక ॥పల్లవి॥

ఒక్కరి నేరములైతె నూరకె వెదక జూచే
నక్కటా నాగుణదోషా లవియెంచను
వొక్కటై విచారించితే వోరులేమి తానేమి
అక్కడ నిక్కడ గురి హరి యుంతెకాక ॥నేరి॥

దట్టించి వొక్కరినైతె తప్పులెంచ జూచేను
అట్టె నాయపరాధాల కాజ్ఞయేదో
నెట్టన దలపోసితే నేనేమి పరులేమి
గట్టిగా స్వతంత్రుడు శ్రీకాంతుడింతెకాకా ॥నేరి॥

వూరకె వొక్కరినైతె వొచ్చములు వట్టేను
కారుకమ్మినట్టి నాకల్ల లెంచను
గారవించి శ్రీవేంకటనాథుడు నన్ను
సారెకు రక్షించగాను జయ మాయగాకా ॥నేరి॥

అ: 16 (1)—24

